శ్రీ ఎల్. మాలకొండయ్య

# ప్రజాకవి - రోజా కవితలు

(శ్రీ మాలకొండయ్య సాహిత్య, సాంఘిక జీవన దర్శనం)

సంకలనం

డా. రావూరు వెంకటసత్యనారాయణరావు

స హ కా ర ం

శ్రీమతి పి. రమాదేవి

ప్ర చు ర ణ

భావన ఆర్ట్ థియేటర్స్

హైదరాబాదు-500 20

ప్రజాకవి-రోజాకవితలు

ప్రతులు 1,000

ప్రచురణ:

డిసెంబర్ 1982

ప్రతులకు :

ఎల్. శ్రీనివాస్

94-శ్రీనగర్ కాలనీ, హైదరాబాదు-873

ముద్రణ :

టి.వి. శ్యామలరావు & కో.

రాంనగర్, హైదరాబాదు.

ముఖచిత్రం:

శీలా వీర్రాజు

# ఆముఖం

శ్రీమాల కొండయ్యగారితో నా పరిచయం ఒక దశాబ్దపు వయస్సు సంతరించుకుంది. అక్షరాలా ఆయన కవి. ఉద్యోగవ్యాసంగంలో మునిగివుండి కూడా కవిత్వాన్ని సద్యోగంగా భావించి, కలాన్ని కుంచెగా మార్చుకొని, రమణీయమైన చిత్రాలు రచిస్తూ ఉంటారు. ప్రజాకవిగా ఏనాడో వారు భాసించారు. ఆ విధంగా ప్రస్తుతింపబడ్డారు.

కలెక్టర్ హోదాలో వుండగా ప్రజాకార్యక్రమాలెన్నింటిలోనో చొరవ చేసుకొని ప్రవేశించి, ఎన్నో ఘనమైన విజయాలు సాధించారు. రాజమహేంద్రవరంలో కందుకూరి వారి పేర చేసిన సేవ నిరుపమానం. అటుసామాన్య ప్రజలు, ఇటు సారస్వత వేత్తలూ వారికి పరిచితులయ్యారు. బంధువులుగా భాసించారు.

నిజానికి వీరిజీవితం ఒక ఉద్గ్రంథ మవుతుంది. వీరి సేవలు—దేశ సేవగా, ప్రజాసేవగా, సాహిత్య సేవగా భాసిస్తున్నాయి.

వీటిఅన్నిటికీ దర్పణంగా పలువురు మిత్రులు, సాహితీవేత్తలు వ్రాసిపంపిన 'అక్షర రమ్యగీతికలు' ఈ గ్రంథరూపంలో వెలువడినాయి. మాల కొండయ్య గారిలోగల ఎన్నో ఉత్తమగుణాల్ని వెలుగులోకి తెచ్చినాయి. వీటిని ఏరి దండ గ్రుచ్చే అవకాశం నాకు కల్పించినందుకు వారికి నా కృతజ్ఞతలు తెలియపరుస్తున్నాను. ఇంకా, ఇంకా రచనలు సాగించమని ఆశీర్వదిస్తున్నాను.

డా॥ రావూరు

# మా మాట

'భావన' సంస్థ శాఖోపశాఖలుగా విస్తరిల్లి రాష్ట్రంలో సాంస్కృతిక క్షేత్రానికి యధాశక్తి చేస్తున్న సేవలో భాగంగానే భావనా ప్రచురణల విభాగం కూడా రూపొందింది. ఈ విభాగం క్రింద తొలి ప్రచురణగా 'చలన చిత్ర పత్రికా రచన అవతరణ' గురించి శ్రీహరి ప్రసాదరావు వ్రాసిన పరిశీలనా వ్యాసాన్ని ముద్రించాం. డాక్టర్ వాసా ప్రభావతి రచించిన 'ఆలాపన' కవితా ఖండికల సంపుటిని మా రెండవ పుష్పంగా అందించాం. శ్రీహరిశ్చంద్ర ప్రసాద్ వ్రాసిన సాహిత్య సంకలనాన్ని కూడా భావన ప్రచురిస్తుంది. ఇప్పుడు ప్రజాకవి శ్రీ ఎల్. మాలకొండయ్య "రోజా కవితలు" గురించి ఇరవైమంది సాహితీ మూర్తుల అనుశీలన సంపుటిని సగర్వంగా అందిస్తున్నాం. అటు పరిపాలనా దక్షులుగా ఇటు వక్తలుగా మననున్న కొద్దిమందిలో శ్రీమాలకొండయ్య, శ్రీజె. బాపురెడ్డి, శ్రీగుంటూరు శేషేంద్ర శర్మ మున్నగువారు గణనీయులు. శ్రీమాలకొండయ్య ఐ. ఎ. ఎస్ అధికారి అయికూడా తన కవితా హృదయాన్ని నిరాడంబరంగా, నిష్కర్షగా, నిశ్చలంగా ఎన్నో గీతాల్లో తరచి చూపించారు. ప్రజాసమస్యల్ని తీసుకొని స్పందించిన రచయితగా ఆయన ప్రజాకవి పేరును అర్థవంతం చేసుకున్నారు. ఆయన 'రోజాకవితలు' గ్రంథాన్ని సాహిత్యలోకం హర్షించినతీరు తెన్నుల రూపంలో వర్తమాన సాహిత్య ప్రభంజన మహోద్ధతిని సహృదయుల మననానుశీలనానికి 'భావన' సమర్పిస్తున్న ఉపద.

భావన ప్రచురణల విభాగం 'భావనవ్యూ' అనే పత్రికనుకూడా ప్రచురిస్తోంది. వివిధ సంస్కృతీ బంధువులు భావన కృషిని, సేవల్ని మన్నించి ఆశీర్వదిస్తున్నందుకు సమ్మోదంతో ఇంకా ఇతోధిక పాటవాన్ని సాధించుకోడానికి 'భావన'కు అండగా నిలిచి, అభిమానించి, భావన ప్రతిఅడుగు సాంస్కృతిక వరమైన పండుగ కావిస్తుంటారని ఆకాంక్షిస్తున్నాం. ఈ అనుశీలన గ్రంథాన్ని అందుకోండి.

హరిశ్చంద్ర ప్రసాద్ — 'భావన' కార్యదర్శి

పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి — 'భావన' అధ్యక్షులు

కోరబోను నే నే వృత్తినీ
రాజాలను నేనే "వేత్తను"
కవనమే నా నిత్య వృత్తి
కాగోరితి సాహితీవేత్తను
అదె నా సంకల్పం
అదె నా స్వర్ణ స్వప్నం.

[వంగకవి సహజీవ]

---

సహజీవ కవి తానే వృత్తినీ కోరబోనన్నాడు. కవిత్వమే తన వృత్తి అన్నాడు. మాలకొండయ్యగారు వృత్తి చేత ప్రభుత్వ ఉద్యోగి. ప్రవృత్తిచేత కవి. ఈయనగారే 'వేత్తా' కాగోరలేదు. ఈయనగారి సంకల్పం గొప్పది. ఉద్యోగంలో వున్నా సమాజానికి, సాహిత్యానికి దగ్గరగా వుండాలన్నదే మాలకొండయ్య గారి ఆశయం.

కొందరికి ఆశయాలు ఆశయాలుగానే మిగిలిపోతాయి. కొందరికి సిద్ధించి కృతార్థుల్ని చేస్తాయి. మాలకొండయ్యగారు అనేక గ్రంథాలు వ్రాశారు. సాహితీవేత్తలుగా రూపొందారు. 'బ్రతుకు నిజం-కవిత స్వప్నం' అన్న సామెతకు ఆనవాలుగా నిలిచారు.

వీరి గ్రంథాలు పలుమార్లు చదివి ఆనందించిన అభినందన చందనమే 'సాహిత్య దర్శన' ప్రకరణ. వీరి గేయంలో రమణీయమైన హారంలో పొదిగిన రత్నాలు భాసిస్తాయి. రచయితలో సునిశితమైన విమర్శ, సుందరమైన కల్పన, అందమైన పోకడ, మనస్సుకు విందుచేసే విలక్షణతా గోచరిస్తాయి.

—రాపూరు

# మధు (ర) వాణి

— ఆస్థానకవి డాక్టర్ దాశరథి

"కదిలే వేలు రాస్తుంది; రాసింది గనుక మరీ కదులుతుంది"

ఈ సుప్రసిద్ధ పంక్తులు ఉమర్ ఖయ్యాం కవివి. అనువాదం మాల కొండయ్య కవివి. మూలానికి విధేయంగా తెలుగువారికి కవిహృదయం తెలిసేలా, సాగిన మాలకొండయ్యగారి అనువాదం చదివిన తరువాత ఈ కొద్దిపంక్తులు వ్రాయ డానికి పూనుకొన్నాను.

ఫార్సీ కవులు ఎందరో ఉన్నారు. రూమీ, జామీ, హాఫిజ్, ఫిరదౌసీ. కాని ఉమర్ ఖయ్యాముకు వచ్చిన కీర్తి, ఆయన కవితలకు కలిగిన విశ్వవ్యాప్తి మరో ఫార్సీ కవికి రాలేదు. దానికి రెండు కారణాలు. ఒకటి ఉమరు భావాలు సర్వజనానికీ ఆమోదయోగ్యంగా ఉండడం; రెండు, ఉమర్ ఖయ్యామ్ కవితలను సుప్రసిద్ధ ఆంగ్లకవి ఫిట్స్‌జిరాల్డ్ అనువదించడం.

"కదిలే వేలు రాస్తుంది..." అన్న కవిత మానవుని నిస్సహాయతను చెబుతున్నది. విధి వ్రాతను ఎవరూ మార్చలేరు!

"నీ కన్నీటి ధారలన్నీ
అందులో ఒక్క మాటనైనా కడిగి వెయ్యలేవు"
ఈ సత్యం పాఠకుని హృదయంలోకి రసవంతంగా చొచ్చుకుపోతుంది.
"బోర్లించిన మూకుడులాంటి ఆకాశాన్ని
చేతులెత్తి సహాయం కోరకు"

అంటాడు కవి ఒకచోట. ఆకాశం శూన్యం. దాన్ని ఆశించి ఏం ప్రయోజనం? అంటున్నాడు కవి.

"అవుననీ కాదనీ ప్రశ్నలు [illegible]ంచా
ఆటగాడి గురి దెబ్బనుబట్టి పోతుంది బంతి"

బంతి చేయవలసింది ఏమీలేదు. జగత్ సృష్టికి కారకుడైన దేవుడే ఆటగాడు. అతడు అనుకున్నట్లు జరుగుతుంది. విచారపడి సాధించేదేమిటి? అని ప్రశ్నిస్తున్నాడు ఖయ్యాం.

అతనికి గడచిన "నిన్న" మీదా, రాబోయే "రేపు" మీదా విశ్వాసంలేదు. గతం గడిచిపోయింది. భవిష్యత్తు వచ్చేదాకా మనం ఉంటామో లేదో! వర్తమానం విలువ తెలుసుకో! అంటాడు.

"...............................
కాలం మన కాళ్ళక్రింద ఎలా జారిపోతుందో చూడు!
జనించని రేపు! మరణించిన నిన్న!!
వాటిగూర్చి వగవ నేల? నేడు మధురాతిమధురమైతే చాలదా!"

ఇదీ ఉమర్ సిద్ధాంతం! పెద్ద పెద్ద చక్రవర్తులు పోయారు. మన మెంతటి వాళ్ళం? అంటాడు ఉమర్.

"ఈ పొదరింటి లతల నీడలో
కమ్మని రొట్టెముక్కతో - మధు కలశంతో
ప్రణయ కావ్యంతో అందాల పడతివి
నా చెంత నీవుండి మధుర గానం చేయ
కారడవి కూడ కాదె మరి స్వర్గసీమ!"

ఇదీ ఉమర్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని విని, ఉమర్ భోగ లాలసుడన్నారు విమర్శకులు. కాని కాలం విలువ తెలిసి, అనుభవించమని ప్రబోధిస్తున్నాడని వారు అర్థం చేసుకోలేదు.

నిజానికి వేదాంతపరంగా

మధుశాల=యాత్రాస్థలి. దేహం=కాలం
మధువు=ఆత్మ. మధుపాత్ర=శరీరం
రొట్టె=స్వర్గం పంపిన ప్రసాదం
బుల్‌బుల్ పక్షి=అంధకారంలో అలమటించే అంతరాత్మ వేదన.

ఉమరు వాడిందంతా సాంకేతిక భాష. ఈ సంకేతాలను అవగాహన చేసుకుంటూపోతే ఉమర్ కవిత సర్వమతాతీతమైన ఆధ్యాత్మిక బోధన అవుతుంది. వాచ్యార్థంలో తీసుకుంటే శృంగారం, లక్ష్యార్థంలో తీసుకుంటే వైరాగ్యం.

ఉమర్ కవిత ఆత్మాశ్రయం, ఆతని అనుభవాలు ప్రపంచం అనుభవాలైనాయి. కనుక ఉమర్ కవితలు విశ్వవిఖ్యాతి పొందాయి.

## అనువాదాలు

ఇంగ్లీషులో ఫిట్‌జిరాల్డు, ఫ్రెంచిలో నికొలాస్ అనువదించడంతో ఉమర్ కవిత్వం విశ్వసాహిత్యంలో ప్రవేశించింది. ప్రపంచ భాష లన్నిటిలోకీ ఉమర్ కవిత వెళ్ళింది.

భారతదేశంలో—

వాళిఫ్ మురాదాబాదీ ఉర్దూలోకి ఉమర్ రుబాయీలను అనువదించి "భారతీయ ఖయ్యాము" (ఖయ్యాముల్ హింద్) అని పేరు తెచ్చుకున్నాడు.

హర్వన్ష్‌రాయ్ బచ్చన్ హిందీలోకి అనువదించారు, రఘువంశరాయ్ గుప్త కూడా హిందీలోకి అనువదించారు. కాంతిచంద్ర ఘోష్ వంగ భాషలోకి అనువ దించారు.

దువ్వూరి రామిరెడ్డిగారు (పానశాల) రాయప్రోలు సుబ్బారావుగారు (మధుకలశం) ఆదిభట్ల నారాయణదాసుగారు, మాధవపెద్ది బుచ్చి సుందరరామ శాస్త్రి, ఎం. ఆర్. అప్పారావుగారు, మధిపడగ బలరామాచార్యులుగారు మొద లైన వారెందరో తెలుగులోకి అనువదించారు.

## మాలకొండయ్యగారి అనువాద రీతి

ఇదివరకు మాలకొండయ్యగారు ఖలీల్ జిబ్రాన్ అనే అరబ్బీ కవి కవిత లను అనువదించి ఉన్నారు. "న్యాయానికి నోరు" మూలార్థం. సుబోధకం అయ్యేలా బాగుంది మాలకొండయ్యగారి అనువాదం. ముఖ్యంగా అనువాద విష యంలో వీరు ఛందస్సు జోలికి పోరు. ఫిట్జ్‌జిరాల్డు అనువాదాలు ఆధారంగా శ్రీ మాలకొండయ్యగారు సులభమైన తెలుగులో ఉమర్ ఖయ్యాం రుబాయీలను అనువదించారు. చాలా జటిలమైన భావాలను సైతం మూలానికి విధేయంగా అనువ దించారు.

"పుడమి తొలి మట్టితో ఆఖరి మనిషిని మలిచారు
చివరి పంటతో మొదటి విత్తనం నాటారు;
అవును! ఆఖరి ఉషస్సు చదువవలసినదాన్ని
రాసింది సృష్టి తొలి ఉదయం"

ఈ రుబాయీ ఆలోచనామృతం. మెదడు పని చేయడానికి ఇంధనాన్ని అందిస్తుంది. ఇంత సులభమైన శైలిలో ఈ జటిల భావాల్ని ఇమడ్చడం కష్టం.

ఉమర్ కవితాహృదయం లోతులు తరచి కూర్చిన కవిత ఇది. దీన్ని సాధారణ అనువాదం అనడానికి వీలులేదు. మూలానికి కడు దగ్గరగా ఉంటూ, మూలార్థాన్ని పండు వలచి చేతిలో పెట్టినట్లు అందించే తెలుగు సేత; పునఃసృష్టి.

ఉమర్ ఖయ్యాముని అనుసరించడానికి ధైర్యంగా ముందుకువచ్చి విజయం సాధించిన కొద్దిమందిలో శ్రీ మాలకొండయ్యగారొకరు. వీరు సామాన్యపాఠక హృదయానికి దగ్గరగా వెళ్ళిన కవి.

మాలకొండయ్యగారి రచనలోని ప్రత్యేకత ఏమిటంటే—అందులో అయోమయత్వం ఉండదు. అర్థంగాని మాట అసలే వుండదు.

ఉమర్ ఖయ్యాం భావాలు మాలకొండయ్యగారిని ఆకర్షించాయి.

రసోత్పాదక రమణీయ భావాలు ఎవరిని ఆకర్షించవు?

తన దారిని తాను పోయే కవి ఉమర్. ముఖ్యంగా ఆధ్యాత్మిక మూల్యాలను గురించి ఆలోచించే వేదాంతి. ఆయన ఆలోచనలు స్వతంత్రాలు. తన సమకాలీనులు రూఢిచేసి పెట్టిన భావాలను ఎదిరించిన విప్లవకారుడు. వాచ్యార్థం కంటే లాక్షణికార్థం పాఠకుణ్ణి ఆలోచనాపరుణ్ణి చేస్తుంది ఉమర్ ఖయ్యాం రుబాయీలలో.

రమారమి వెయ్యేండ్లనాడు వ్రాసిన ఉమర్ కవితలు ఈనాటికీ రసనిధులనడానికి మాలకొండయ్యగారి "మధువాణి" నిదర్శనం. మధువు మాట్లాడుతున్నది! మధువాణి మధురవాణి అయింది!

మాలకొండయ్యగారి కృషికి అభినందనలు. మధువాణి రసిక హృదయాలలో మధుర భావాలను ప్రేరేపించగలదని విశ్వసిస్తున్నాను.

ఇందులోని "కూజానామా" సృష్టిలోని అనేక సూక్ష్మాంశాలను వెలికితీసి సామాన్యులకు సుబోధకం అయ్యేలా చేసింది. ఉమర్ ఇతర రచనలు ఒకయెత్తు, కూజానామా ఒక యెత్తు. 82వ పద్యంనుండి ఈ కూజానామా ప్రారంభం.

కుమ్మరి=ఈశ్వరుడు

మట్టి=చిత్తు

కుండ=అచిత్తు

రూపక అలంకారం ప్రతి పంక్తిలో సాక్షాత్కరించే ఈ కవితలలోని ధ్వని విన్యాసాన్ని తెలుసుకోడానికి మరీమరీ చదవాలి.

# ఆవిష్కారం

"My heart bleeds when I see human suffering"
అంటున్నారెవరో !

ఎవరబ్బా, ఆ అంటున్నది?

మానవ యాతనను చూచినప్పుడు హృదయం కన్నీరు కార్చే కరుణా మూర్తులు ఈ కాలంలో కూడా ఉన్నారా?

"పేదవాళ్ళ ఫైళ్లు
పెండింగుగానే ఉంటాయి"—
ఓహో, ఆ అంటున్నది మాలకొండయ్యగారు!

ఒక్క అధికార వర్గంలోనే కాదు, లబ్ధ ప్రతిష్ఠులైన రచయితలలో కూడ అంత సనాతనమైన విషయాన్ని ఇంత అధునాతనంగా చెప్పగల తెలుగుకవి మరొక రెవరు?

అవును, శ్రీ లింగం మాలకొండయ్యగారు మొదటినుంచీ మొదటి శ్రేణికి చెందిన విద్యార్థి. పుట్టుకతోనే గొప్ప మేధావి. ప్రస్తుతం ప్రజలచే "సర్వకళా పోషక" బిరుదనామంతో వ్యవహరించబడుతున్న గొప్ప అధికారి.

ఆయనకు కాకపోతే- "పెండింగు ఫైళ్ళు" వంటి రచనను, అందులో "పేదవాళ్ళ ఫైళ్ళు పెండింగుగానే ఉంటాయి" అనే సత్యాన్ని వ్యక్తీభూతం చెయ్యడం మరెవరికి సాధ్యం?

ఈ గ్రంథంలో రకరకాల కవితలు మొత్తం అరవై ఒకటి ఉన్నై. అందులో ప్రతి ఒక్క కవితా ఒక కళాఖండం. మాలకొండయ్యగారు సహజకవి.

భావ మధురమైనదై నప్పుడే దానినుంచి కవిత పుడుతుంది. కళ పుడుతుంది.

కవిత ప్రేమాత్మకం. ప్రేమ మానవతా హృద్యం. మానవతకు మరో పేరు మాలకొండయ్యగారు.

"ఏదో చెప్పాలనిపిస్తున్నది నాకు" అన్నారు మాలకొండయ్యగారు. ఇదే ఆయన తొలిరచన. ఇదే ఆయన కవితా నవోదయంలో తొలి కిరణం. ఏదో చెప్పాలన్న తహతహ, ఎంత తీవ్రమైనదైతే అంత నిశితం - ఎంత మధుర మైనదైతే కవిత అంత రసవంతం.

మాలకొండయ్యగారు నిర్విరామంగా పనిచేసే వ్యక్తి. ఒక్క వ్యక్తి ఎంతని చేయగలడు? తన పరిధిలో తాను చేస్తూ, అలా చెయ్యమని ప్రతివ్యక్తికీ చెప్పడం అవసరమే. అందుకే చెప్పాలనిపించింది ఆయనకు. ఏదో చెప్పాలి. వట్టి కబుర్లు చెప్పడం కాదు, చెప్పేది రసవంతంగా చెప్పాలి. కాంతా సమ్మితంగా చెప్పాలి. బుజ్జగించి చెప్పాలి. బుజ్జగించి ఎంత కఠినంగా చెప్పినా ఫర్వాలేదు. హృదయంలో ఆర్ద్రత లేకుండా పైకి ఎంత మెత్తగా చెప్పినా ఫలితం ఉండదు. పైగా ఆయన కొక లక్ష్యం వుంది.

దానిని, స్పష్టంగా అవసరమైతే పచ్చి వాచ్యంగా చెప్పాలి. ఏమైనా ప్రతి మనిషినీ నిలబెట్టి, మానవాభ్యుదయానికి కృషి చెయ్యమని చెప్పాలి. అలా చెప్పారాయన- ఈ గ్రంథంలోని ప్రతి కవితలోనూ, ప్రతి పంక్తిలోనూ.

"హెడింగ్ లైట్సు" ఒక అద్భుతమైన రచన. అది ఒక్క మాలకొండయ్యగారు మాత్రమే చెయ్యగలిగిన రచన. నిజానికి ఇదొక ధ్వనికావ్యం.

రైతు గురించి ఎవరైనా వ్రాయవచ్చు. "హాలికులైననేమి" అన్నారు పోతన్నగారు. తాను దీనస్థితిలో ఉండటం వేరు. సమాజం దృష్టిలో దీనస్థాయిలో ఉండటంవేరు- దీనస్థితికి ఎవరూ సిగ్గుపడనక్కరలేదు. దీనినే "పెరగని రైతు" కవితలో ఎంతో చక్కగా వర్ణించారు మాలకొండయ్యగారు.

"మట్టిలో మణులు పండిస్తున్నాడని
పరిశ్రమలకు ప్రాణం పోస్తున్నాడని
రైతులేందే రాజ్యం లేదని
అందరూ రైతును పొగడుతారు"

అయితే— "ఈసగాచి నక్కల పాలవుతున్న" రైతు జీవితాన్ని గురించి "ఎక్కడివేసిన గొంగళి అక్కడే" అన్నట్లున్న రైతు ఆదాయం గురించి ఎవరైనా ఆలోచిస్తున్నారా! అని ప్రశ్నిస్తున్నారాయన. ఈ ప్రశ్నలకు జవాబు ఎవరు చెప్పగలరు? చిక్కులముడి ఎవరు విప్పగలరు?

మాలకొండయ్యగారు తమ ప్రకృతి పరిశీలన శక్తి అంతటినీ, ఏతదనుభవ పారవశ్యరక్తి నంతటినీ కరిగించి, సహృదయ లోకాన్ని సౌందర్య స్నపితులను చేసిన సుకుమార కవిత "సెలయేరు"

"పక్షులైనా, పశువులైనా,
మనుషులైనా, మ్రాకులైనా,
అంతా ఒకటేఅయిన సెలయేరు-
అందాలనూ, ఆనందాలనూ
అందరికీ పంచిపెట్టే సెలయేరు-
పక్షపాతం పాటించని సెలయేరు-"

ఈ సెలయేరు ఎంత శోభాకరమైనట్టిదో, అంత సోషలిస్టు! మాలకొండయ్యగారు కవితకు ఏ వస్తువును స్వీకరించినా, దానిలో సరసమూ సౌందర్యమూతోపాటు మానవతను కూడా సమపాళ్ళలో నింపుతారు! సౌందర్యంతో

కూడా ఆయనకు సోషలిజమే కనిపిస్తుంది. అదీ నిజమైన కళాదృష్టి - అప్పుడే నవసృష్టి.

ఇది "పొగడ్త" కాదు. ఏ ఖర్చూలేని పొగడ్తలతో ఎవరినైనా సంతోష పెట్టవచ్చు. పొగడకపోతే దేవుడుకూడ కరుణించడు. "నిద్ర"కు కూడ పక్షపాతం లేదు. "రాజైనా, పేదైనా నిద్రాముద్రకు దాసోహమనవలసిందే". ఇక్కడ ముద్ర అనే మాటలో ఎంత అధికార ముద్ర ఉందో చూడండి. నిద్ర అనేది ఒక సుప్రీం సోషలిస్టు అథారిటీ - మాలకొండయ్యగారి దృష్టిలో.

"మూఢ నమ్మకా" లంటే గిట్టదాయనకు. మన సమాజాన్ని అవి నాశనం చేశాయంటా రాయన.

"మన భవిష్యత్తు ఆ బల్లికి తెలుస్తుందా?
మన జయాపజయాలు ఆ పిల్లిచేతిలో ఉన్నాయా?"

అంటూ ప్రశ్నిస్తారు. అందుకే "నడుంకట్టి ముందుకునడు" అంటూ యువతరాన్ని ఉద్బోధిస్తారు.

"నీ సమాజం బూజుపడితే జబ్బుపడే దెవరు?
నీ వాతావరణం కుళ్ళిపోతే చచ్చిపోయే దెవరు?"

అని ప్రశ్నించి "నీవూ నీవాళ్ళేకదా" అని వేలెత్తిచూపి, "బూజుదులిపే బాధ్యత నీకు లేదా" అని హెచ్చరిస్తున్నా రాయన. కవితను సూటిగా చెప్పడానికి ఇదో చక్కని ఉదాహరణ.

పరిహసించడం ద్వారా చెడ్డను పరిహరించడంలో మాలకొండయ్యగారి శక్తి అపారం. కవితకు ఆత్మ అయిన ధ్వనికీ, వ్యంగ్యానికి ఆయన రచనలు ఆలయాలు.

సజానికి, ఈ జీవిత వలయాలు—
ఆధునిక సమాజ జడస్థితికి విలయాలు,
సర్వమానవ ప్రగతిపథంలో కాంతినిలయాలు!

"జీవిత వలయం" కవితలో ఉన్న పంక్తులు పది మాత్రమే అయినా—

ఉద్యోగ మాత్రోపజీవి అయిన వ్యక్తియొక్క జీవితపథం ఆద్యంతమూ ఇందులో సంవలయితమయింది. అల్పాక్షరాలలో అనల్పార్థ రచనకు ఈ కవిత మచ్చుతునక. చదువుకూ, సంధ్యకూ తీరికలేని ఈ ఆధునిక యంత్రయుగంలో కవితలు తెగబారెడు చెరుకుగడల్లా కాక, జేబీలో పట్టే జామిపళ్ళలా ఉండాలి. క్లుప్తంలో ఆకలిదప్పులు తీరుస్తూ, గుండెకు బలంకూడా ఇవ్వాలి. ఈ కవిత అందుకు చక్కని నిదర్శనం.

"పిసినిగొట్టు మరణిస్తే దానకర్ణుడంటారు!
దగాకోరు దహనమైతే ధర్మరాజంటారు!"

అంటూ—మర్యాద పేరుతో మానవ సమాజం చేసుకొంటున్న ఆత్మవంచనను సూటిగా చూపుతున్నారాయన.

"మన గొప్పతనం తెలుసుకోవాలంటే చచ్చి చూడాలి"
ఎంత గొప్ప విసురు?

"మిన్నుకూ, మన్నుకూ మధ్య గాలిలో జీవిస్తున్న" కొంద వాళ్ళను గురించి ఎంతో చక్కని పరిశీలన చేశారు మాలకొండయ్యగారు.

"పాత ఏడాది చేసిందేమిటి? కొత్త ఉగాది చేయగలిగిందేమిటి" ఏం లేదు, నిజమే. అలా అని చేతులు ముడుచుకు కూర్చోగూడదనీ, మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తే మార్పు సాధ్యమేనని ఉద్ఘాటిస్తున్నారాయన.

"వేట" ఒక కరుణ కావ్యం. నిజానికి ఈ గ్రంథంలోని రచనలన్నీ ఏదో ఒక విధంగా కరుణకావ్యాలే. మానవతకు కరుణేకదా పునాది!

"ఇంటర్‌వ్యూ", "దొరగారి దర్శనం", "కలెక్టరు కడగండ్లు" ఇవి మూడు మాలకొండయ్యగారు మాత్రమే చెయ్యగలిగిన ప్రత్యేక రచనలు. వస్తువుతో గాఢ పరిచయమూ, సమ్యక్ అనుభవమూ ఉన్నప్పుడే రచయిత దానిని కవితగా రూపొందించ గలుగుతాడు. ఏ వస్తువునైనా సాహితీకరించాలంటే, ఆ వస్తువులో కవి లీనమై వ్రాయాలి. అట్టి తన్మయతా సారస్వత సాక్షాత్కార ధన్యుడు మాలకొండయ్యగారు.

"ఏనాడు-ఆనాడు" ఒక మానవాభ్యుదయ పథకం. "కెమెరాకళ్ళు"లో కవితా చిత్రాలను ప్రదర్శించారాయన.

విషయపరిజ్ఞానం లేకుండా విమర్శ చెయ్యగూడదని చెపుతూనే—
"ఆమ్లెట్ రుచి చెప్పాలంటే
గుడ్డు పెట్టి నవసరమా?"

అంటూ-విషయ రసాస్వాదనకు తద్విషయ సాక్షాత్‌ధురీణత అక్కరలేదని కూడా అంటారు! నిజంగా ఈ రకం సత్యాన్ని చెప్పగలిగిన వాడేకదా ఋషి అంటే?

"చెప్పడం మనపని, చెయ్యడం మరొకరిపని" అని అందరూ అనుకోవడం వల్లనే పనిచేసేవాళ్ళు లేక, జాతి అభ్యుదయం కుంటుపడుతున్నదన్న సత్యాన్ని ఎంత అందంగా చెప్పారాయన! ఈ కవితకు "ఉపాధి" కవిత ఒక అద్వితీయమైన ఉపాధిని కల్పించింది.

"మనం మనుషులం, సంఘం బ్రతికిస్తున్న మనుషులతో కూడిన శవపేటిక" అంటూ నిర్వచనం చేసి, మనుషులపై శవపేటిక పెత్తనం చేస్తున్నదంటూ నిశితంగా విమర్శిస్తున్నారాయన.

"పొరుగింటి పుల్లకూర"ను సహృదయులందరికీ పంచిన పుణ్యం ఒక్క మాలకొండయ్యగారికే దక్కింది. "ఆశే ఊశ" ఆశను ఆధ్యాత్మికరించిన రచన. ఆశ లేకపోతే అభ్యుదయమే లేదు మరి.

ఈ గ్రంథంలోని "ప్రయాణం" చదవకుండా ఎవరూ సరదాగా ప్రయాణం చేయలేరు. "స్నేహితం" పఠించకుండా ఎవరూ మంచి స్నేహితులు కాలేరు. "అలవాట్లు" చూడకుండా దురలవాట్లు పోగొట్టుకోలేరు. "నవ్వు"ను చదవనిదే నోటారా నవ్వలేరు. "సిగ్గు"ను గ్రహించందే మల్లెమొగ్గల్లా సిగ్గు పడలేరు. "ప్రేమ" చదివి "స్త్రీ"ని చూడకుండా, "భార్య"కు "వెల్లుల్లిశాస్త్రి కథ" చెప్పి "పూజలు" చెయ్యలేరు.

ప్రతిరోజూ ఎందరెందరో "విమానయానం" చేస్తుంటారేదూ? అందులో ఉన్న అపూర్వ సౌందర్యాన్ని గురించి చెప్పిందెవరు? స్వర్గం పైనెక్కడో లేదనీ పైనుంచి చూచినపుడు అది క్రింద భూమిమీదనే కనిపిస్తుందనీ అంటారు మాల కొండయ్యగారు. పైనుంచి చూడడమంటే హెచ్చుతగ్గులకు అతీతమైన దృష్టితో చూడడమన్న వ్యంగ్యాన్ని ఆశ్రయిస్తే - ఎన్నో "అందాలూ, ఆనందాలూ" కనిపిస్తాయిందులో.

సమాజంలోని నేటి అరిష్టాలన్నిటికీ కారణం మన ప్రజల బాధ్యతారహిత ప్రవర్తనమే అంటూ నిర్మొహమాటంగా "నడిరోడ్డులో" అన్న కవిత వ్రాశా రాయన.

"కొంచెం పసకచీకటి కమ్మితే చాలు
రోడ్లన్నీ మరుగుదొడ్లే అయిపోతాయి——"

తెలుగునాట ప్రతినిత్యమూ ప్రతివారి కంటా పడుతున్న దృశ్యాలే ఇవి. అయితే-ఏ దృశ్యమైనా కవి కంటిలో పడ్డప్పుడే దానికి అమృతత్వం సిద్ధిస్తుంది.

"మనవాళ్ళు ఆత్మవంచనకూ
అపరిశుభ్రతకూ జంకరు!"

"బూతు మాటలే మనకు నిషేధం, బూతుపనలు కాదు" నిజం! బూతు మాటలు కూడా సంస్కృతంలో వుందే నిషేధం కాదు!!

"అందమైన అబద్ధాలాడటం
అందరూ నేర్చుకొంటున్నారు"

అంటూ నిర్వేదం ప్రకటిస్తున్నారు మాలకొండయ్యగారు. బెల్లంలో ఎఱ్ఱమన్ను మిరియాలలో బొప్పాయి గింజలు, బియ్యంలో లలితసుకుమార తెల్లరాళ్ళు (వగైరా) కలిపి డబ్బుచేసుకోవటం వంటి జాతీయ అంతర్జాతీయ మహాకళకూడా వ్యంజితమవుతున్నది. విషయజ్ఞులు గమనించగలరు.

"చెప్పు"లో, "ఇటుకలో", "కలంలో", "ఎరువు సొమ్ము"లో కూడా "శ్రీరంగనీతులు" కనిపిస్తాయాయనకు! "చాడీలు"లో "కనిపించని కారణాలు" కనిపించకపోతే, "ఎవరికి నష్టం?" "దుఃఖం" కలుగుతుంది. "కోపం" వస్తుంది. "మంచీ చెడూ" అనకుండా.

"చాడీలు చంపుతాయి
అవి తగిలే చాలామందిని!"

"ఎవరాచిన్నది" అన్న రచన మాలకొండయ్యగార్కి సాహిత్య రూపరచనా శక్తికి పరాకాష్ఠ. మన నేలలో, మన మోలనే ఎల్లప్పుడూ కనిపించే ఆమే—

"వెన్నెల లాగున్నది
ఎండలో పోతున్నది.



Sri Malakondayya Addressing District Officers and social workers regarding cyclone relief in East Godavari.

పూవులాగున్నది

పూరి గుడిసెలో ఉంటున్నది!"

"అదృష్టం" అంటే వేరే ఏమీ లేదనీ,పనే అదృష్ట" మనీఅంటూ, మంచీ, చెడూ రెండూ లోకంలో పక్కపక్కనే వుంటాయనీ అంటారు.

సమకాలీన సమాజంనుంచి వెనక్కి ఒక "జనరేషన్‌గేప్"లో తిరోగ మిస్తున్న తెలుగుకు వాస్తవికతా దృగ్దీపం పట్టారు. పెరగని రైతు ఇబ్బందులతో పాటు కలక్టరు కడగండ్లను కూడా లోకానికిచూపి, సానుభూతి కోరారు. అందుకు ప్రతిఫలంగా రసానుభూతిని అందిచ్చారు.

ఇందులో వున్న కవితలు, అదీ ఇదీ అన్నీ కలిసి, "అదీ-ఇదీ" రచనలో బ్రహ్మైక్యం పొందాయి. ఈ ద్వంద్వంలో మనకు ధ్వన్యమాన మవుతున్నవి జీవ బ్రహ్మలేకదా?

మాలకొండయ్యగారు "కారులో కవిత్వం'' వ్రాస్తే, నేను ఈ పీఠిక రైల్లో వ్రాశాను. ఒడిదుడుకులు, దుందుడుకులు, కుదుపులు, కదుపులు ఏవైనా వుంటే సహృదయులు క్షమించగలరు.

బోయి భీమన్న

# మూలం - అనువాదం

—నార్ల వెంకటేశ్వరరావు

కాలిల్ జిబ్రాన్ "మిస్టిక్" కవి. తమకు సమకాలికులుగా చెప్పదగు ప్రాచ్యకవులలో ఆయన ఇక్బాల్, టాగోర్‌ల కోవకు చెందినవాడు.

యుగధర్మానికి భిన్నంగా వెళ్ళి, మిస్టిక్ కవిత్వాన్ని వ్రాసినా, జిబ్రాన్ స్పష్టతను, సారళ్యాన్ని పుష్కలంగా సాధించాడు. జాతీయధర్మాన్ని ఆయన నిష్ఠతో పరిపాలించాడు. ఆయన లెబనాన్‌లో జన్మించాడు. అది ఎంత చిన్న దేశమో అంత ప్రాచీన దేశం. అది ప్రాచీనతకే కాదు, ప్రకృతి సౌందర్యానికి పేరుబడిన దేశం. ఒకే ఒకసారి ఒక పగలులో ఒక సగం మాత్రం ఆ దేశంలో నేను గడపడం తటస్థించింది. ఆ కొద్ది గంటలలో బీరూట్‌ను సందర్శించాను; బిబ్లోస్‌లోకి తొంగిచూచాను. ఇటుచూచినా, అటుచూచినా, ఎటుచూచినా, పచ్చని కొండలు, నీలికడలి. ఆ పరిసరాలలో దిశాచక్రాన్ని దాటి అనంతంలోకి మన దృక్కులు దూసుకుపోతూ ఉంటాయి. అందువల్లనే కావచ్చు, లెబనాన్‌లో ప్రవక్తలు పెక్కుమంది జన్మించారు. మిస్టిక్ దృక్పథానికి ప్రోది చేశారు.

జిబ్రాన్ ప్రవక్త కాకపోవచ్చుగాని, ఆయన నిశ్చయంగా మిస్టిక్. అయితే పాత ధోరణిలోని మిస్టిక్ కాడు. మతానికి ఆయన విరోధికాడు. అయితే మతం గీసే గీతలలోపల ఆయన నిలువలేకపోయాడు. మతం పెట్టే విధినిషేధాలకు ఆయన తలవంచలేకపోయాడు. అందువల్ల ఆయన సిరియన్ క్రిస్టియన్ చర్చికి

పిత్రైనంత దూరంగా జరిగిపోయాడు. ఆదిలో ఆయన పారిస్‌లో స్థిరపడాలని అనుకొన్నాడు కాని, అక్కడైనా ఎక్కువ కాలంపాటు నివసించలేక, తన జీవిత కాలంలో చివరి రెండు దశాబ్దాలను అమెరికాలో గడిపాడు.

జిబ్రాన్ మొత్తం జీవితకాలం పట్టుమని అయిదుదశాబ్దాలైనా కాదు. ఐనా ప్రపంచం మొత్తంమీదనే గణుతింపదగు ఒక మహాకవి ప్రతిపత్తిని ఆయన సాధించగలిగాడు. ఆయనకు నోబెల్ బహుమానం వచ్చివుండకపోవచ్చు. కాని, మహాకవి ప్రతిపత్తికి ఆ బహుమానమే ఒక గీటురాయి కాదు. దాన్ని పొందిన కవులలో కొందరిని ఈనాడు చదువుతున్నవారు లేరుసరికదా, కనీసం తెలుస్తున్న వారు సయితం లేరు.

ఆదిలో జిబ్రాన్ అరబిక్ భాషలో వ్రాశాడు; తర్వాత ఇంగ్లీషులో రచనలు చేశాడు. ఈ విషయంలో సయితం ఆయన తిరిగి ఇక్బాల్‌ను, టాగోర్‌ను జ్ఞాపకానికి తెస్తాడు. అన్నట్టు ఇక్బాల్ కవి మాత్రమే. చిత్రకారుడు కాడు. వృద్ధాప్యంలో టాగోర్ చిత్రరచనను ప్రారంభించి, ఆ కళలో సయితం విఖ్యాతిని సముపార్జించుకొన్నాడు. ఆదినుంచీ జిబ్రాన్ చిత్రకారుడు. ఆయన కవితలలోవలె ఆయన చిత్రాలలో సయితం మిస్టిసిజం తొణికిసలాడుతూ వుంటుంది.

జిబ్రాన్ రచనల అనువాదాలు ఆయన జీవితకాలంలోనే ఇరవై భాషలలో వెలువడినాయి. తెలుగులోకి జిబ్రాన్‌ను తెచ్చినవారిలో శ్రీ ఎల్. మాలకొండయ్య బహుశ రెండవవారు, లేదా మూడవవారు.

తక్కిన అనువాదాలకు, మాలకొండయ్యగారి అనువాదానికి ఒక ప్రధానమైన భేదం వున్నది. జిబ్రాన్‌వలె శ్రీ మాలకొండయ్య మిస్టిక్ అవునో, కాదో నాకు తెలియదుగాని, ఆయనవలె ఈయన మానవతావాది. మానవునిలో, మానవతలో ఈయనకు పరమ విశ్వాసం వున్నది. మానవతను పెంచడానికి ఈయన కృషి చేస్తున్నారు. అందువల్లనే కావచ్చు, జిబ్రాన్ రచనలలో మానవతకే అధిక

ప్రాధాన్యమిస్తున్న భాగాలనే అనువాదానికి ఈయన ఎన్నుకొన్నారు. ఎన్నుకున్న భాగాలను సరళమైన భాషలో, సున్నితంగా సుందరంగా, అనువదించారు.

తన కళ్ళముందు ఏవో దృశ్యాలు గిరగిర తిరిగి పోతున్నప్పుడు తన హృదంతరంలోపల ఏవో ప్రేరణలు కళపెళ ఉడుకుతున్నప్పుడు, వాటిని వ్యక్తీకరించడానికి కావలసిన భాష తనంత తానుగా పెల్లుబికి వస్తుంది. ఇది మౌలిక రచనలోగల ఒక సౌలభ్యం. ఈ సౌలభ్యం అనువాదాలలో రాదు. అందు వల్ల మౌలిక రచనలను చేయడంకంటె కూడా అనువాదాలను చేయడం కష్టతరం. శ్రీ మాలకొండయ్య కవిగా ఇదివరలో పేరుతెచ్చుకొన్నారు; ఇకమీదట అనువాదకుడుగా కూడా ఆయన ప్రఖ్యాతి తెచ్చుకోగలరు.

ఈ అనువాదంలో శ్రీ మాలకొండయ్య సాధించిన విజయానికి నా అభినందనలు; కవిగా ఆయన మరింత ఉన్నత శిఖరాలను అందుకోవాలని నా ఆశంస.

# అత్యుత్తమ వచన కవితాసంపుటి

—పోతుకూచి సాంబశివరావు

యస్. మాలకొండయ్య కవితాసంపుటి 'కాలంవెంట కవి' ఆధునికతలోని నిశిత పరిశీలనతో స్పందిస్తోంది. ఆయనకూడా కాలంవెంట నడిచే కవి. కాలాన్ని వెంట నడిపించుకుపోయే కవి. అతి సులభశైలిలో గుంభనం, గాంభీర్యం సంతరించుకుంటాయి ఆయన కవితలు. పూర్వసాహిత్యంలో కూడా వేమనవంటి మహాకవి రచనల్లో సౌలభ్యం, సౌగంధం కూడా కనిపిస్తాయి. ఆ సౌగంధంలో ఇహపర తత్వ రహస్యాలు తొణికిసలాడతాయి. అలాగే మాలకొండయ్య కవిత్వంలో కొండంత సుమమాలల సౌరభం వెల్లివిరుస్తుంది. అర్థం చేసుకున్న కొలదీ అంతుబట్టని అర్థాలు స్ఫురిస్తాయి.

'కాలంవెంట కవి' గ్రంథంలో వంద కవితలున్నాయి. ఒకవిధంగా ఇది ఆధునిక వచన కవితా శతకం? 'కాలాన్ని చిత్రించాలి కవి-కాల గమనాన్ని కట్టి వేయాలి కలం కదలికతో' అన్న మాలకొండయ్య కవితా పంక్తులు కవికి, కవి వంటి యోగికివర్తించే అమరసూక్తి. నిజమైన కవికి ఈ ప్రతిభ వుంటుంది-కవికి ఈ ప్రతిభ వుండాలని ప్రవచించే కవిలో యీ ప్రతిభా అన్వేషణ ద్యోతకమవుతుంది

## అలలకు లేదు అలసట...

స్నేహం గురించి వ్రాస్తూ అమ్మడానికీ, కొనడానికీ వీలుకానిదది

# అత్యుత్తమ వచన కవితాసంపుటి

—పోతుకూచి సాంబశివరావు

యస్. మాలకొండయ్య కవితాసంపుటి 'కాలంవెంట కవి' ఆధునికతలోని నిశిత పరిశీలనతో స్పందిస్తోంది. ఆయనకూడా కాలంవెంట నడిచే కవి. కాలాన్ని వెంట నడిపించుకుపోయే కవి. అతి సులభశైలిలో గుంభనం, గాంభీర్యం సంతరించుకుంటాయి ఆయన కవితలు. పూర్వసాహిత్యంలో కూడా వేమనవంటి మహాకవి రచనల్లో సౌలభ్యం, సౌగంధం కూడా కనిపిస్తాయి. ఆ సౌగంధంలో ఇహపర తత్వ రహస్యాలు తొణికిసలాడతాయి. అలాగే మాలకొండయ్య కవిత్వంలో కొండంత సుమమాలల సౌరభం వెల్లివిరుస్తుంది. అర్థం చేసుకున్న కొలదీ అంతు బట్టని అర్థాలు స్ఫురిస్తాయి.

'కాలంవెంట కవి' గ్రంథంలో వంద కవితలున్నాయి. ఒకవిధంగా ఇది ఆధునిక వచన కవితా శతకం? 'కాలాన్ని చిత్రించాలి కవి-కాల గమనాన్ని కట్టి వేయాలి కలం కదలికతో' అన్న మాలకొండయ్య కవితా పంక్తులు కవికి, కవి వంటి యోగికివర్తించే అమరసూక్తి. నిజమైన కవికి ఈ ప్రతిభ వుంటుంది-కవికి ఈ ప్రతిభ వుండాలని ప్రవచించే కవిలో యీ ప్రతిభా అన్వేషణ ద్యోతకమవుతుంది

## అలలకు లేదు అలసట...

స్నేహం గురించి వ్రాస్తూ అమ్మడానికీ, కొనడానికీ వీలుకానిదదీ

అంటారు మాలకొండయ్య. చివరికి ఆ న ం ద మ య ం అది-అనురాగమయం అది-అంటారు. ఆత్మలో ఆత్మగా భావించిననాడే 'ఆమె' నిజంగా ధన్యురాలు - అలలకు లేదు అలసట- కలలకు లేదు వేసట-జీవితంలో చాలా భాగం చాలామంది కలలతోనే గడిపేస్తారు. కాలంలోని ప్రతినిమిషం విలువ గ్రహించి సద్వినియోగంతో నిర్మాణాత్మక పయనం చేసే మనుషులు చాలా కొద్ది మంది. విజ్ఞానానికి పునాది జిజ్ఞాస. గుళ్ళు గోపురాల కట్టడాల వెనకాల రహస్యాలు గోల-ప్రకృతి శోభకు మూలం వర్షపుబిందువు - అసమానతలకు వంతెనలు కట్టాలి - భార్య అనే ఆలయానికి అలసి పయనించే యాత్రికుడు భర్త-అన్న మాలకొండయ్య సూక్తులు జీవితం తరించి పలికే మార్గదర్శకాలు ఆత్మ యాత్ర, నింగి నేలకు, ఊహకు వాస్తవానికి మధ్యవున్న మానవ జీవితం మొదలైన భావాలు ఆయనలోని ఆధ్యాత్మిక తత్వాన్ని మెరుపులా ప్రకటిస్తాయి.

## నిన్న, చెల్లని నాణెం—.

కులాలోయ భూలోక స్వర్గంగా వర్ణించిన ఆయన భావపటిమ, నోరులేని మూగ జంతువులు మానవులకన్న నయం అన్న నుడి, పని చెయ్యనివారిలో తప్పేవీ అనే వ్యంగ్యభావం, చీకటి వెలుగులు మానవుడి మంచి చెడ్డల రహస్య శిబిరాలనే ఆయన మాట, సాహిత్యంలో మానవ జీవితాలకు అద్దంపట్టిన ప్రతిబింబాలు. నిన్న-నేడు-రేపు అత్యంత భావస్ఫోరకమైన కవిత. నిన్న చెల్లని నాణెం, రేపు-ప్రామిసరీనోటు-నేడు రొఖ్ఖం-అన్న ఆయన ఆధునిక ప్రాపంచిక పోలికలు మనస్సుకు హత్తుకుంటాయి.

అందానికి ఆరాధన అవసరం- మహాబలిపురంలో చావులేని శిలలు ఉన్నాయి - శరీరం - రక్తమాంసాల ముద్ద - ఎముకలగూడు - అంతుతెలియని ఆత్మ - అని యిచ్చిన నిర్వచనం - మాలకొండయ్య ప్రతిభావ్యుత్పత్తులకు నిద

ర్శనం - ఆడినమాట రాదు తిరిగి - పెదవి దాటినదే రహస్యం - ఉపన్యాసం ఉన్మాదం మెదడుకు నాలుక కలం - పెద్దరికం ధనవంతులది - ఊరి పెద్దలది- ప్రతి జన్మదినం ఒక మైలురాయి జీవిత రహదారిలో- ఆడది లేకుంటే మగవాడి బతుకు మట్టిపాలే- అనే కవి ఆలోచనలు కఠోర సత్యాలుగా స్ఫురిస్తాయి.

విశ్రీ విరామంలేని సమయాల్లో కూడా పెల్లుబుకుతాయి నాలో ఊహాగానాలు. అని కవి ఒకచోట చెప్పుకున్నారు. జగమే ఒక చెరసాల ఒక దృక్పథంలో. నిత్య జీవితంలో అన్ని అవస్థలు బదిలీతే - మరొక దృక్పథంలో కవి మనస్సు విశృంఖలంగా విహారం చేసింది ఆధునిక జీవన సమరాంగణంలో.

## కవితలో వేగం, రాగం—

వచనకవిత వ్రాయడం సులువు. రెండు పదాలు కలిపి వదిత్తే అదొక మినీ కవితగా మారుతుంది-అని అనేకమంది వాదన. అయితే భావస్ఫోరకంగా వచనకవిత వ్రాయడం అంత సులువుకాదు. ప్రబంధ కావ్యం పూర్తిగా చదివిన తరువాత కూడా ఏ ఒక్క పద్యమూ నిన్నాకర్షించక పోతే ఆ కావ్యం ఎందుకు? కాని రెండు సూటిమాటల కవితలతో హృదయస్పందన కలిగించగలిగితే - అది తప్పకుండా కవిత్వమే. ఆ దృష్ట్యా మాలకొండయ్య కవితాఝురిలో వేగం, రాగం కూడా స్ఫురిస్తాయి.

నేను మేఘాన్ని - మెరుపులతో వెలుగును యిచ్చే మేఘాన్ని - ఉరుములతో బెదిరించే మేఘాన్ని - పసిపాప నవ్వుముఖాన్ని - నేను మేఘాన్ని - అని కవి తన్ను మేఘంతో పోల్చుకున్నారు. జలదంలో అనంత విద్యుచ్ఛక్తి ఉంది - కవి కలంలో కూడా ఈ శక్తి లేనపుడు మానవ మనస్సులు స్పందించవు. అనంత శక్తికి, విప్లవ తత్వానికి, నిరంతర భాగ్యానికి మేఘం చిహ్నం - మేఘం కూడా రాగానికి రాయబారి. అనంత జగత్తులోని అసమానతలు రూపుమాపి అందరినీ కలిపి రాగమయం చేసే అపూర్వ శక్తికి మేఘం చిహ్నం. అటువంటి

మేఘంతో కవి తన్ను పోల్చుకోవడంలో విశిష్ట ఔచిత్యం వుంది - వినూత్న హృదయ గమనం గోచరిస్తుంది.

కవితా రంగంలో మాలకొండయ్య 'కాలంవెంట కవి' ఆత్యుత్తమ వచన కవితా సంపుటి అంటే అతిశయోక్తికాదు. భావాలు తేనెటీగల్లా రొద చేసుకుంటూ పుస్తకం చదివినంతసేపు మానవ హృదయాలను చుట్టుముట్టుతాయి. ఈ భావాలే ప్రేరణకైనా దారితీయగలవు - అపుడే ఆ భావాలు సందేశాలుగా మారుతాయి - ఆ విధంగా మాలకొండయ్య కవితలు సందేశాలు.

జీవితం అనంతం - తరచి చూచినకొలది అనేక రంగులు కోణాలు - అందాలు కనిపిస్తాయి. కవి ఎంతవరకు తన అపూర్వ ఊహాసృష్టితో ఇది గమనించి జగత్తుకు అందివ్వగలడో, అంతవరకు అతని రచనాసాఫల్యం వుంటుంది. మాలకొండయ్య ఈ దృష్ట్యా విజయం పొందారనడం నిర్వివాదం.



TELUGU DARBHAR OF ELURU falicitating Sri Malakondayya (Prajakavi) and the Collector Sri Danam, I. A. S., honouring him The Secretary, Sri K. Lakshmaiah, stands by

# కాలంవెంట కవి మాలకొండయ్యగారు

—డా॥ వాసా ప్రభావతి

వ్యవహారికంలోనే రచనలు చేస్తున్నా, వచనంలోనే కవిత్వం రాస్తున్నా సంస్కృత సమాస భూయిష్టమైన పదజాలం వెంటపడుతూనే ఉంది. సామాన్య పాఠకులకు అందని ఫలంలా సాగుతూనే ఉంది. అభ్యుదయ భావం చోటుచేసుకోని రచనలు, కవితలు వెలువడుతూనే ఉన్నాయి. ఇవి కొనసాగుతున్నంత కాలం రచనలు వ్యవహారిక భాషలో ఉన్నా, వచన కవిత్వంలో ఉన్నా సరియైన ప్రయోజనాన్ని సాధించలేవనే చెప్పాలి.

తెలుగుతనం ఉట్టిపడుతూ, ఆధునిక అభ్యుదయ భావాన్ని అందించే రచనలే సామాన్య పాఠకులకు అందుబాటులో ఉంటాయనడం నిర్వివాదాంశం.

అందుకే కాలంతోబాటుగా కవి, లేక రచయిత శైలిని, భాషను, భావాన్ని మార్చుకుంటూ సాగిపోవడం సామాజిక చైతన్య స్ఫూర్తికి దోహదకారి అవుతుంది. మాలకొండయ్యగారి కవిత్వంలో తెలుగుతనం ఉట్టిపడుతోంది. కవితకు చమత్కారం సామాన్య పాఠకులకు అందుబాటుకోసమే అన్నది వారి నమ్మకం. మనచుట్టూ ఉన్న సమాజాన్ని గమనిస్తూ దానిని సరిదిద్దటానికి ప్రయత్నించడమే కవి కర్తవ్యమని వారి ఉద్దేశం.

అందుకే 'కాలంవెంట కవి' అన్న శీర్షికలో ఈయన ఆధునిక యుగంలో కవి ఎలా రచించాలి అన్న విషయాన్ని ఎంతో బాగా చిత్రించారు. అది ఆ కవి ప్రణాళిక. ఆ ప్రణాళిక ననుసరించే ఆయన కవిత్వానికి రూపం ఆపాదిస్తారు

"కాలాన్ని విశ్లేషించాలి కవి
కాల గమనాన్ని
కట్టివెయ్యాలి కలం కదలికతో"

అంటే, కాలంతోపాటుగా కవి తనచుట్టూ ఉన్న సమాజాన్ని చూస్తూ సాగాలి. పైగా కాలంతోపాటుగా సాగిపోయే అన్యాయాలను, అక్రమాలను, దురాచారాలను, మూఢాచారాలను రూపుమాపే రచనలు చేస్తూ కాల గమనాన్నే ఆపగల శక్తి కవి కలానికుండాలంటున్నారు.

"కాలం ఇక్కడా
కవి ఎక్కడో కాకుండా
కాలాన్ని కవితలో సంధించి
కాలంతో అడుగు కలిపి నడవాలి కవి"

అన్న నగ్నసత్యాన్ని చక్కని తేటతెలుగు మాటలతో వర్ణించారు. ఆధునిక యుగంలో ఉన్నా వీటిని పట్టించుకోకుండా ప్రబంధయుగంలో సంచరించే కవి కలాలు కళ్ళుతెరవాలని వారి ఉద్దేశం.

మల్లెపూలు, మగువలు, వసంతశోభలు, కోకిల గానాలు వీరి కవితా వస్తువులు కావు. [illegible]

చుట్టూ ఉన్న సమస్యల వలయంలో కవి దృష్టి ఉంది. వాటినిండా సమాజాన్ని రక్షించాలన్న తపన ఉంది. అందుకే వాటిని ఎత్తిపొడిచే ధైర్యముంది. సూటిగా చిత్రించే ధైర్యముంది ఈ కవికి. తనకున్న శైలిలో, తనకున్న భావనా శక్తితో అందరికీ అర్థమయ్యేట్టులో కవిత్వం వ్రాయాలన్న తపన ఉన్న కవి ఈయన. [illegible] ఈయన. [illegible]

[illegible]

"పెరగని క్రైతు", "పెండింగు ఫైళ్ళు", "నడిరోడ్డులో" మొదలగు శీర్షికలు మనచుట్టూ ఉన్న సమస్యల చిత్రీకరణకు గీటురాళ్ళు. ప్రాణస్నేహం, యువతరం మొదలైనవే కాకుండా జీవాత్మ, పరమాత్మ, జీవితం, లోకంపోకడ మొదలగు కొన్ని శీర్షికలు వారి అనుభవాలను, తాత్వికదృష్టిని చిత్రించి ఉపదేశాన్ని అందించేవిగా ఉన్నాయి. ఆలాఅని ప్రకృతి దృశ్యాలను చూసి కనురెప్పలను, గుండె తలుపులను మూసుకునే కవికాదు ఆయన.

సెలయేరును చూసినప్పుడు ఆయన హృదయం ఏవిధంగా ఉప్పొంగిందో ఇది చదివితే మనకు తెలుస్తుంది-

"గలగల పారే సెలయేరు
మిల మిల మెరిసే సెలయేరు
సరి గమ పద నిస సంగీతం
శ్రుతి తప్పక పాడే సెలయేరు"

"పాటతో పరవశమై
పరిసరాలను పరికించని సెలయేరు"

అంటూ రమ్యంగా తనభావాలను వర్ణించగల శక్తి వారికలానికుంది. ఆ సెలయేటిని కూడా లోకకళ్యాణార్థమై వర్ణించగల దొడ్డబుద్ధి కూడా వారికుంది. అందుకే-

"పక్షపాతం పాటించని సెలయేరు
వేసట ఎరుగని సెలయేరు
ద్వేషం ఎరుగని సెలయేరు
అందాలను ఆనందాలను
అందరికీ పంచిపెట్టే సెలయేరు"

అంటూ తన అంతరాత్మలోని ఆదర్శాలను పలికించగల నేర్పు వారికుంది.

మూఢనమ్మకాలను, దురాచారాలను విమర్శించారీకవి. 'నమంకర్తి నమ' అన్న శీర్షికలో-

"నీ సమాజం బూజుపడితే నష్టపడేదెవరు?
నీ వాతావరణం కుళ్ళిపోతే జబ్బుపడేదెవరు?"

అంటూ సమాజాన్నినిలబెట్టి ప్రశ్నించగలశక్తి వీరి కలానికుంది. అంతేకాదు-

"నీ యువత్వం, నవత్వం ఎండి రాలకముందే
నీ గుండెల్లో వృద్ధాప్యం గూడుకట్టకముందే
నీవు చేయగలిగిందేదో చేయి
మానవ శ్రేయస్సు నీ కలంలో నింపుకొని వ్రాయి"

అంటూ కవులకు హెచ్చరికలు చేశారు. ప్రస్తుత సమాజంలో కుటుంబ నియంత్రణా ప్రాధాన్యాన్నిగూర్చి వర్ణించారు. కేవలం చెప్పడమే కాదు. దాన్ని ఆచరించగలగడమే నిజమైన మానవత అన్న భావాన్ని-

"ఏనాడు చెప్పేది చేయగలమో
ఏనాడు చేసేది చెప్పగలమో
ఆనాడు చెప్పుకోగలం మనం మనుష్యులం అని"
అంటూ నిజమైన సందేశాన్ని స్పష్టంగా అందించారు.

"సంఘాన్ని మింగే తిమింగిలాలు ఉన్నంతకాలం
సంవత్సరం ఏంచేస్తుంది? అది కొత్తదైనా పాతదైనా?
లేకుంటే ఎందుకీ పండగ(లు) పరమ దండగ(లు)"

అంటూ నిర్మొహమాటంగా చెప్పగల నైపుణ్యం వీరికుంది. పెరగని ప్రైతు శీర్షికలో-

"పొద్దున్నే లేస్తాడు
పొలానికి వెడతాడు
ఎద్దుల్ని దున్నల్ని నమ్ముకొని
మబ్బుల్ని మట్టినీ నమ్ముకుని
కాడి గడతాడు"

అంటూ ఎంతో సహజ సుందరంగా వర్ణించారు. నిజంగా రైతు నమ్మేది మట్టినీ, నీటిని వర్షించే మబ్బులనే. భూమిని సాగుచేయడానికి ఎద్దులను, దున్నలను నమ్ముకుంటాడు. ఇటువంటి హృదయాలను చకితపరచే వర్ణనాశక్తిగల కవి ఈయన. కాలంవెంట సాగిపోయే కలం వీరిది.

"సూర్యోదయాన్ని మరచి
నిద్రాదేవతకు దాసులైన వారికి
శూన్యం సూర్యదర్శనం"

అన్న వీరి మాటలు యథార్థం. కాలాన్ని, చుట్టూ ఉన్న తన సమాజాన్ని చూడలేని కవిత్వం, వెలుగును కూడా చూడలేదు. పతితల గుండెల్లో వెలుగులు నింపలేదు కదా?

# అర్థవంతంగా మలచగల ప్రతిభ

—నాయని రమాదేవి

శ్రీ మాలకొండయ్యగారి కలం నుంచి ఆసక్తికరంగా దుమికిన జలపాతం ఈ 'పాపా నీకు తెలుసా?— అన్న గేయసంపుటి. సంగీత స్వరాలలో 'స' పలికినంత స్పష్టంగా, మృదువుగా భాషాశైలిని వ్యక్తం చెయ్యగలగడం, పిల్లలకు కావలసిందేదో సూటిగా చెప్పగలగడం వీరికున్న నేర్పు. మానవుని నిత్యావసరాల్లో దొర్లే పదజాలం, వస్తుసముదాయం వీరి కవితా జగత్తును జాగృతం చేసిన వైనం వీరి ప్రతి కవితలో కనబడుతుంది. అవసరం, అనవసరం అన్న ప్రసక్తి లేకుండా ఎన్నుకున్న వస్తువేదయినా, చెప్పదలచుకున్న భావంతో, అర్థవంతంగా మలచగల ప్రతిభావంతులనిపిస్తుంది.

'పిల్లలు—పెద్దలు' అన్న గేయం ప్రారంభంలోనే వీరు, 'పిల్లల మనో వికాసానికి పెద్దలు అడ్డుగోడలా?' అన్న ప్రశ్న చదువరుల్లో ఉద్భవింపజేస్తారు. అది యక్షప్రశ్నలా అల్లుకుపోతుంటే ఆ చిక్కులన్నీ ఆయనే విడదీస్తూ, పిల్లల స్వాతంత్ర్యాన్ని దౌర్జన్యంగా అరికట్టకుండా యుక్తిగా అంకెకు తెచ్చుకోవాలనీ, వాళ్ళ ఆశలను, ఆశయాలను అర్థం చేసుకుంటూ అవసరమయినంతవరకు అనుకూలిస్తూ వాళ్ళను తీర్చిదిద్దాలని చెప్తారు వారి శైలిలో యిలా...

"ఇంటిలో తల్లిదండ్రులు
బడిలో పంతుళ్ళు
సమాజంలో పెద్దలు

పిల్లల స్వంత ఆలోచనలను మొదట్లోనే తుంచివేస్తే
వారు కాగలరా ఆదర్శ పౌరులు?
అవుతారా వికసించే పుష్పాలు?
చిగురించే వృక్షాలు?
ఈ విషయం పెద్దలు గ్రహించిననాడే
పిల్లలు కాగలరు నిజమైన మనుషులు;
సక్రమైన పౌరులు"

మట్టిని భూమాతగా భావించే వాళ్లున్నా, మట్టివల్ల కలిగే మహోపకారం గురించి అందరిదృష్టీ ప్రసరించదు. దాన్ని కవితాదృష్టితో బొమ్మలుగా, పాత్రలుగా, వస్తువులుగా, భవనాలుగా అభివర్ణించి దాన్నుండే బంగారుపంటలు, తియ్యని నీరు, దుస్తులు మానవులందుకుంటారంటూ...

"మట్టిలోనూ మట్టిపైనా మనం ఉన్నా
మట్టికీ మనిషికీ ఎంతో సంబంధం వున్నా
పట్టుబడరాదు మట్టికి మనం
కట్టుబడి ఉండాలి మట్టే మనకు
మట్టిని ఉపయోగించుకోవాలి మనం
మట్టిలో మనం కారాదు మలినం..." అంటారు.

శరీరం దేవాలయం. దేవుడు ప్రాణరూపకంగా ఉన్నాడు కాబట్టే దేహం తన పని సక్రమంగా నిర్వర్తిస్తుంటుంది. ఈ దేహంలో వున్న అవయవాల్లో ముఖ్యమైనవి కన్ను, కాలు. వీటి అవసరం దేహి కెంత ముఖ్యమో అలాగే కుటుంబసభ్యులు సఖ్యతకలిగి మసలుకోవాలని వీరి 'ఏదిముఖ్యం?' అన్న గేయం తెలుపుతుంది.

"కుటుంబంలో లేవా అందరికీ
పటువైన బాధ్యతలు?
ఎవరికి వారే ముఖ్యమని
పనిచేయడం మానితే
ఎవరికి నష్టం?
కాదా బాధ్యత కుటుంబం అందరికీ?"—అంటారు.

అలవాట్లగురించి వీరికో నిశ్చితాభిప్రాయం వున్నట్లు, 'అలవాట్ల'న్న గేయం నిరూపిస్తుంది.

వీరు జీవితంలో మంచి సత్యాలను వీరుకుని స్పష్టంగా చెప్తారు. వీరి ఇతివృత్తం ఎంపిక ఎప్పుడూ బాగుంటుంది.

(ఎ. ఐ. ఆర్. వారి సౌజన్యంతో)



Sri Malakondayya being falicitated as a poet and Red-Cross worker at Rajahmundry by Sri Kedareswarudu.

# "బాలసాహిత్యంలో పాలనుఖుగులు"

—ఏడిద కామేశ్వరరావు
(రేడియో అన్నయ్య)

పెద్దలు అంటూ వుంటారు:

"భాషతో బాలభాష పుట్టిందా? బాలభాషతో భాష అవతరించిందా? అనేది ఇదమిద్ధమని ఎవరూ తేల్చలేకపోయినా-ధ్వని సంకేత సమన్వితమైన శబ్దంలోంచి బాలభాష అవతరించింది అని మాత్రం అంగీకరించక తప్పదు"—అని!

కాగా, భాష, బాలభాష-రెండున్నూ కవలలు అని అనుకోవాలి. ఆదిమానవుడు మొదలు ఆధునిక మనిషి వరకూ - కాలంతోపాటు భాష ఎన్నో విధాలుగా మారినా, 'బాల-బాలభాష' - ఒకేలాగున వున్నారు. బాలభాషకు కాలక్రమంలో ఏ ప్రాతిపదికలైతే పడివున్నాయో, అవే, ఈనాటివరకూ నిలిచి ఉన్నాయి!

బాలల భావోన్నతికి దోహదమిచ్చే ప్రకృతిని, పరిసరాలను భాష అద్దం పడుతుంది, కనుకనే బాలలు భావనతోపాటు భాషనుకూడా ఆత్మగతం చేసుకొంటారు! బాలలు అవగాహన చేసికొనే ఆ భావాలను, భాషను - వారికి అభ్యుదయ పరంపరగా వుండులాగున తీర్చి దిద్దవలసి వుంది. అట్టి నేర్పు తీర్పులు ప్రవర్తిల్లేదే "బాలసాహిత్యం"!

సుందరమ్ము, సుకుమారము అయిన ఈ బాలభాష పొదిగిన బాలసాహిత్యం

ఎంతో సుసంపన్నమై, యుగయుగాలుగా, తరతరాలుగా మహనీయమైన వార సత్వంగా మన నట్టింట చిరులాస్యం చేస్తూనేవుంది!

పూర్వ కవులవలెనే ఆధునికులు కూడా బాలసాహిత్య క్షేత్రంలో ముద్దునుసు పంటలను పండించారు!

అట్టివాటిలో - కటీవల వెలువడిన - శ్రీ ఎల్. మాలకొండయ్యగారి కలం నుండి జాలువారిన "పాపా! నీకు తెలుసా?" అనే గేయ కదంబం!

నీతిని నీతిగాగాక, ఆ నీతిని వెల్లడించే రీతిలో ఒక కథరూపాన చెప్పడం ఒక పద్ధతి. అలాగే చిన్నచిన్న ఉపమానాలతో నీతిని నిర్ధారించడం మరొక పద్ధతి! ఈ రెండు ప్రక్రియలూ బాలసాహిత్య రచనలో అవస్థానుసరణీ యాలు!

శ్రీ మాలకొండయ్యగారి "బాలగేయాలలో" ఈ రెండోపద్ధతి పలుముఖా లుగా విస్తరిల్లింది. అదీన్నీ బాలలకు అందుబాటులో ఉండే భాషలో ముచ్చటగా మలుచుకొన్నది - "ఉపమ"లు కూడా ఒకటీ రెండూ కాదు; కోకొల్లలుగా వారి కలం చిలకరిస్తుంది! మచ్చుకు:

"ఆడినమాట రాదు తిరిగి
విడిచిన బాణం రాదు మరలి
గడచిన కాలం దొరకదు మళ్ళీ
పోయిన అవకాశం చిక్కదు చేతికి"

చెప్పదలుచుకొన్నది సూటిగా చెప్పడము, అదీన్నీ వీలైనన్ని తక్కువ మాటలతో చెప్పడము - బాల సాహిత్య రచనలో ముఖ్యంగా అనుసరించవలసిన విధానమని అందరూ అంగీకరిస్తారు. అలాకాక, విషయాన్ని డొంకతిరుగుడుగా అల్లిక చేసి పెడితే, అది బాలల లేతమనస్సులను గందరగోళ పరుస్తుంది.

అయితే 'బాలసాహిత్యంలో' జిలుగులు, బిలుగులు వుండకూడదనికాదు, 'నాన్ సెన్సు సాంగ్స్' ప్రక్రియలలో వాటికి ఇతోధికమైన స్థానం వుంది. పదాలను ఉచ్చరించడం, చక్కగా నోటబట్టడం అలవాటు కావడానికి ఈ జిలగు సాహిత్యానికి ఎంతైనా అవసరం వుంది. బాలసాహిత్యం ప్రాథమిక స్థాయిలో దీనికి పెద్ద పీటే వుంది!

'నాన్ సెన్సు సాంగ్సు' కాక, నీతిని, విషయ విజ్ఞానాన్ని ప్రబోధించే బాలగేయాల రచనలో మాత్రం సొంపు సొగసులతోపాటు 'సూటి' విధానం చాలా అవసరం.

శ్రీ మాలకొండయ్యగారు 'సూటి' మనిషిలా కనపడుతున్నారు. ఆయన మాటల్లో, చేతల్లో ఆ తత్వం ప్రస్ఫుటిస్తుంది! పాటల్లో కూడా అదే తత్వం ప్రతిఫలిస్తుంది. మచ్చుకు:

"మట్టిలోనూ మట్టిపైనా మనం ఉన్నా
మట్టికీ, మనిషికీ ఎంతో సంబంధం వున్నా
పట్టుబడరాదు మట్టికి మనం
కట్టుబడి వుండాలి మట్టే మనకు
మట్టిని ఉపయోగించుకోవాలి మనం
మట్టిలో మనం కారాదు మలినం"

బిడ్డల మనస్సు వెన్నలాంటిది. అది ఎంత మృదువైన ముద్దలా వుంటుందో ...అంతలా కరిగి పోతుంది. ఏమాత్రం వెచ్చదనం తగిలినా! పిల్లలకు చెప్పే బుద్ధులు వెన్నముద్దల్లా వుండాలి. పాలబుగ్గల్లో ఆ మిసిమి పారాడి మెరవాలి! అంతేగాని, కరిగి జిడ్డు ఓడకూడదు!

అందుకే వారిని ఆజ్ఞాపించే రీతిలో నీతులు చెప్పకూడదు. లాలనగా, ఉదాహరణలతో మెత్తమెత్తగా చెప్పాలి! అలాకాక పెత్తందారీ ధోరణిలో మాట్లాడితే వారి మనస్సు క్షోభిస్తుంది. ఆ క్షోభలోంచి 'ఎదురు తిరుగు' భావం పొటమరిస్తుంది.

"కూడదు" అనే విషయం తెలియని వయస్సులో పిల్లలు ప్రతీ పనీ చేస్తారు! అంతేకాదు-అదిఏమిటో తెలుసుకోవాలనే ఆశ వాళ్ళకు వుంటుంది ఆలా వాళ్ళుచేసే పనిని ఎవరైనా "వద్దు" అని అంటే వాళ్ళకు ఎంతో కోపం వస్తుంది. అప్పటికీ మనం చేయవద్దు అని అంటే వాళ్ళు ఏడుస్తారు; కాళ్ళు చేతులూ బాదుకొంటూ మారాం చేస్తారు. ఈ విధమైన మనస్తత్వం పిల్లలకు పుట్టుకతోటే వస్తుంది. పాలు తాగాలని తల్లివద్దకు వెళ్ళిన బిడ్డకు, తల్లి పాలు ఇవ్వకపోతే - బిడ్డ ఏడుస్తాడు. ఈ తత్వం పసిప్రాయంనుంచీ బిడ్డతో పాటు పెరుగుతుంది. పెద్ద అయినకొద్దీ ఆ తత్వాన్ని మనం "ఎదురుతిరగడం"గా అన్వయించుకొంటాము. అర్థం తెలియక చేసే వాళ్ళ పనిని అర్థం చేసుకోలేక మనం వాళ్ళను దండిస్తాం. కాగా, పిల్లలకు గల ఈ మానసిక స్థితిని మనం గుర్తించుకోవాలి.. అందుకు అనుగుణంగా బిడ్డలతో మెలగాలి. అంతేగాని ఆజ్ఞాపించే ధోరణిని అవలంబించకూడదు.

ఈ తత్వాన్ని బాగా అర్థం చేసుకొన్న తీరు శ్రీ మాలకొండయ్యగారి రచనలలో ద్యోతకం అవుతుంది. అందుకే ఆయన పిల్లలకు చెప్పదలచుకొన్న విజ్ఞాన, వివేకములను సూటిగా చెప్పారు; అవి అన్నీ అనునయంగా చెప్పినట్లే ఉంటాయికాని, ఎక్కడా ఆజ్ఞాపించే "పెపబెత్తం తత్వం" ఎక్కడా గోచరించదు. కనుకనే పెద్దలకు ఓ సుద్దు చెప్పారు:

"జ్ఞాపకముంచుకోవాలి పెద్దలు ఒకనాటి పిల్లలే అని—
అందుకే పిల్లల మనసులు అర్థం చేసుకోవాలి పెద్దలు"

—అని చెబుతూనే శ్రీ మాలకొండయ్యగారు పిల్లలకు "అర్గురు మిత్రు

లను" పరిచయం చేశారు. ఆ మిత్రులను ఆధారం చేసుకొని, పిల్లలనే అడగ మన్నారు పెద్దలని—

"బాలలూ!
మీరు ఏమి చేయవలసినా
అడగండి తప్పకుండా
మీ ఆర్గురు మిత్రులనూ
ఏమిటి? ఎవరు? ఎందుకు?
ఎక్కడ? ఎప్పుడు? ఎలాగు?-లను—
ఇస్తారు మీకు కావలసిన సలహాలు
చేస్తారు తగు సహాయం"

—అంటూ, "పిల్లలు చేసేవన్నీ అల్లర్లు కావని తెలుసుకోవాలి" అంటూ నచ్చబలికారు.—

సలహాల రూపంలో విజ్ఞానాన్ని వివేకాన్ని అందించే రచనలను చేయడం మంచిసామర్థ్యానికి ఒక మచ్చుతునక! బాలసాహిత్యాన్ని కొంత సృష్టించాలనే ఆశ యానికి తోడు ఇట్టి చాకచక్యం వుండటం అభినందనీయమైన విషయం!

శ్రీ మాలకొండయ్యగారి కలం అన్ని సాహిత్యరంగాలలోనూ శిల్ప సోయ గాలను చిందివోసింది బాలసాహిత్యంలోనూ ఆ కలం అమృతాన్ని వర్షించింది.

శ్రీ మాలకొండయ్యగారి మాట ఎంతో గంభీరంగా వుంటుంది. అంతటి లోతూ అది సంతరించుకొన్నది - ఆ రెండిటిమధ్య దోబూచులాడే ఔదార్యం ఇంతా అంతా కాదు! 'పాపా!' అని సంబోధిస్తూ, కొన్ని మాటలను 'మాల'గా చుట్టి 'కొండల'కెత్తిన శ్రీ మాలకొండయ్యగారి బాలసాహిత్యం నిజంగా పాలసాహి త్యమే అవుతున్నది!

# మాటలు కావు - మధురవేదనల మూటలు

—త్రిపురనేని సుబ్బారావు

తెలుగులో వచన కవిత్వం అనే నూతన ప్రక్రియను చేపట్టి ప్రసిద్ధి కెక్కిన కవులు బహు కొద్దిమంది మాత్రమే. అలాంటి బహుకొద్దిమందిలో శ్రీ లింగం మాలకొండయ్యగారొకరు. వారి తొలిగ్రంథం 'జీవితవలయాలు' రెండవ గ్రంథం 'మనిషికి మనిషి'. ఇది వచనకవితా సంపుటి. ఇందులో 65 కవిత లున్నాయి. మానవ హృదయంలోని మధుర వేదనను మాటల్లో మూటకట్టారు మాలకొండయ్యగారు. ఇందులోని కొన్ని కవితలు చదవగానే పాఠకుడు ఆలో చనా నిమగ్నుడవుతాడు.

ఇది 'మీటింగుల యుగం' అని మాలకొండయ్యగారి అభిప్రాయం. ఈ విష యాన్ని కవిగారు ఎంత చక్కగానో చమత్కరించారు.

పని చేపట్టాలన్నా మీటింగులే  
వెడగొట్టాలన్నా మీటింగులే!  
ఎలక్షన్‌లకు మీటింగులు  
సెలక్షన్‌లకు మీటింగులు  
ఉద్యోగుల మీటింగులు  
నిరుద్యోగుల మీటింగులు  
పుడితే పురిటి మీటింగులు  
చస్తే సంతాపాల మీటింగులు!

కట్టడాలకు మీటింగులు

పడగొట్టడాలకు మీటింగులు

పెళ్ళిచూపులకు మీటింగులు

విడాకుల వ్యవహారాలకు మీటింగులు

అసలు మీటింగులు ఉండాలా లేదా అంటే

అది తేల్చడానికి పెట్టాలి మీటింగులు!

'పోవచ్చు - రావచ్చు' అనే కవితలో మాలకొండయ్యగారు నాటినుండి నేటివరకూ కవిత్వంలో వచ్చిన మార్పులను గమనించారు.

పద్యకవిత్వం పోయింది

గేయకవిత్వం వచ్చింది

గేయకవిత్వం పోయింది

గద్యకవిత్వం వచ్చింది.

గద్యకవిత్వం పోవచ్చు

హద్దులు అసలే లేని

చోద్యకవిత్వం రావచ్చు.

'మనిషికి మనిషి'లో మధుర మనోజ్ఞమైన కవితలున్నాయి. మచ్చుకి 'విందు' అనే కవితలో మాలకొండయ్యగారు యిలా అంటున్నారు.-

దేహానికి విందులు గావించి

ఆత్మను ఆకలిలో ఉంచడం

వంటావిడను మేపి

యింటావిడను పస్తుంచడం

ఈ పంక్తులు చదువుకొన్న పాఠకుడు తనలో తాను నవ్వుకోవలసిందే! నవ్విస్తూనే చురకలు వేయడం మాలకొండయ్యగారికి వెన్నతో పెట్టిన విద్య.

కయ్యానికి బహుశః కారణాలుండవు
కారణాలు తెలిస్తే కయ్యాలే ఉండవు.

ప్రపంచమంతా ఒక నాటకం. ఎక్కడ చూసినా ఒక బూటకం చూపే వస్తువు ఒకటి, అమ్మే సరుకు మరొకటి. అంటే, ఏదిచూచినా కల్తీసరుకే. చివరకు విషంలో కూడా కల్తీ అయితే ఇక చచ్చేదెలాగు? అంటున్నారు మాలకొండయ్యగారు.

కొందరికి సన్మానాలు చేయించుకోవడం అంటే సరదా. వాళ్ళకి సన్మానాలు చేయించుకోడానికి సందర్భాలు కూడా అక్కరలేదు. ఏదో ఒక సందర్భం కల్పించుకొని సన్మానం కోసం ప్రాకులాడుతారు. చేస్తే అన్నిటికీ సన్మానాలు చెయ్యొచ్చు.

పుస్తకం అచ్చువేస్తే సన్మానం
పుణ్యక్షేత్రాలు చుట్టివస్తే సన్మానం
ఏరుదాటితే సన్మానం
గట్టు ఎక్కితే సన్మానం
పెళ్ళిచేసుకుంటే సన్మానం
పిల్లలు పుడితే సన్మానం
పరీక్షలో పాసైనా సన్మానం
ఉద్యోగం దొరికినా సన్మానం

అయితే, కవిగారి ఉద్దేశంలో సన్మానం పొందే అర్హతని సంపాదించుకోవడం కన్నా, సన్మానం వేరేలేదు. అది లేనినాడు ఏ సన్మానమైనా అవమానం క్రిందనే



Sri Malakondayya being falicitated by Kinnera Art Theatres.
Chief Guest Sri I. Ramakrishna Raju, Minister for Cultural Affairs
honouring the poet.

జమకట్టాలి అంటారు.

ధనికుడికీ, పేదవాడికీ గల తేడాను మిక్కిలి మనోహరంగా వివరించారు మాలకొండయ్యగారు.

ధనికుడు తనకిష్టమైనప్పుడు భోంచేస్తాడు
పేదవాడు తనకు దొరికినప్పుడే తింటాడు.

అసలు ఏ కవిత్వానికైనా వుండవలసిన ప్రధాన లక్షణం స్పష్టత. దీన్ని గురించి వివిధ కాలాల్లోని లక్షణకారులు, వివిధ రకాలుగా నిర్వచించారు. వాట న్నింటిని స్పృశించడానికి ఇప్పుడు సమయమూలేదు, ఇది సందర్భం కూడా కాదు. మహాకవి రేంబో అన్నట్లుగా భావం రూపరహితం. ఆ నైరూప్యానికి ఒక ఆకృ తిని యివ్వటం కవియొక్క బాధ్యత. రేఖామాత్రంగా ఉన్న ఒక భావనకు, మూర్తిత్వాన్ని యివ్వడంలో శ్రీ మాలకొండయ్యగారి కలం కదనుతొక్కింది. ఏఏ భాగాల్లో అని చెప్పడానికి ఈ పుస్తకంనుండి అనేక కవితలను ఎత్తిచూప వలసి వుంటుంది.

తాము చెప్పదలుచుకున్నదేదో స్పష్టంగా, సరళంగా, సుందరంగా చెప్పడం శ్రీ మాలకొండయ్యగారి ప్రత్యేకత. సామాన్యమైన పదాలతో, సామా న్యమైన విషయాలను సామాన్యంగా చిత్రించగల కవితాహృదయం వీరిసొత్తు. మనుషులమధ్య వుండవలసింది కారుణ్యమని వీరు ప్రబోధిస్తారు. మానవ హృద యాలలో షమతకే తప్ప మారణ హోమాలకు తావుండరాదని వారి విశ్వాసం.

'మమత' మధురగీతం

'సమత' సరళగీతం

సమతా, మమతల యుగళరాగం

మానవజాతికి మంగళగీతం

విశ్వమనోహర శుభగీతం

---

మనిషి మనీషిగా జీవించాలనీ, ఆ ఆశయాలతో వర్థిల్లి ఋషిగా మారాలని పరమాత్ముని సందేశం. అప్పుడే నరలోకం నాకమవుతుందనీ, నరుడు ఆ ప్రగతిని చూసి, మురిసి ముచ్చటలు పడాలని ఆయన కోరిక.

కాని, మానవుడు ఆ కోరికను ఎంతవరకు తీరుస్తున్నాడు? ఆ ఆశయాల నెంతవరకు ఆచరిస్తున్నాడు? మానవత నెంత గౌరవిస్తున్నాడు?-ఇవన్నీ ఈనాడు సమాజాన్ని ఎదుర్కొనే ప్రశ్నలైనాయి. ఎక్కడో కొందరు మహానుభావులు ఆ మహోన్నత శిఖరాలందుకోడానికి ప్రయత్నిస్తున్నారు. తమ ప్రత్యేకతను నిలుపుకొంటున్నారు.

ఈకాలంలో మనిషి మనిషిగా నిలబడటంలేదు. అందుకే ప్రతి కవీ మానవతావాదిగా మారిపోతున్నాడు. అట్లాటివారిలో మాలకొండయ్యగారొకరు. ప్రజల దీనదశ గమనించి ఈయన కలం కన్నీటి సెలయేరుగా మారింది.

# నిండుగుండెల్లో సాహిత్య తపన

డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి

శ్రీ మాలకొండయ్యగారిని అభినందిస్తూ మిత్రులు కొందరొక సంచిక వెలువరించాలనుకుంటున్నమాట సంతోషం కలిగిస్తున్నది. మంచిపని చేసేవారిని అభినందించటం కేవలం ఆ మంచిపని చేసినవారిని వెన్ను తట్టడంకోసం, వ్యక్తిగత ప్రశంసకోసం చేస్తున్న పని కాదు. ఒక వ్యక్తి చేసే మంచిని సమిష్టిగా పంచుకోవటం, మంచిపట్ల మనకున్న ఆదరాభిమాన విశ్వాసాలను ప్రకటించుకోవటం-

ఉద్యోగరీత్యా ఊపిరి సలపని పనిలో ఉండి సాహిత్య వ్యాసంగాన్ని ఊపిరిగా పీల్చుకోవటం అంత సులువైనదా? స్వీయ కవితను, అంతకుమించి శక్తి సామర్థ్యాలను ఒక పరీక్ష చేసే అనువాద కవితలు క్రమం తప్పకుండా వెలువరిస్తున్నారంటే మాలకొండయ్యగారి నిండుగుండెల్లో ఉన్న సాహిత్య తపనను అంచనా వేసుకోవచ్చు.

గట్టిగా, పదుగురికీ నొక్కి చెప్పాల్సిన మాటలు ఆయన మనస్సులో ఉన్నాయి. అవే ఆయన కవితా సామగ్రి. అందరమూ జగతి గతి చూస్తూనే ఉన్నాము. ఏదో కాలం అలా ఉందని తోసేసుకు పోతున్నాము. ఆ పని ఆయన చేయలేరు. సున్నితమైన మనస్సు కావటం, చిత్తశుద్ధి వుండటం నిష్కర్షగా చెప్పాలన్న ఆరాటం కలిగేటందుకు కారణాలు కాగా-

"ఆవేశం, ఆవేగం
ఆందోళన, ఆవేదన

అడ్డుగట్లు లేకుండా
తోసుకు వస్తుంటే—"

చూసేవన్నీ, చేసేవన్నీ తనివితీర చెప్పాలనిపించింది. కాని రచనకు అంతకంటె బలవత్తరమైన కారణం 'నా ఆలోచనలను అనుభూతులను పదిమంచితో పంచుకోవాలని" అనిపించటం.

ఏళ్ళు గడిచినకొద్దీ జీవితంలో ఎదగటం గొప్పే అయినా ఎదుగుతూనే పసివాడి మనస్సు పదిలపరచుకోవటమూ అంతకంటె గొప్ప. లోకంలో అన్యాయం, మోసం, ఇట్లాంటివి కనిపిస్తే కొందరికి ఆవేశం వస్తుంది. మంచిమనస్సు గలవాడు 'ఇట్లాంటివి కూడా ఉంటాయా అయితే!' అని విస్తుపోయి 'ఛీ ఛీ తప్పు కాదూ!' అనవచ్చు. మాలకొండయ్యగారి తీరు మొత్తంమీద ఇలాగే ఉంటుంది.

"ఏనాడు సభలు తగ్గించి
సత్కార్యాలు చేయగలమో—
ఏనాడు ఉపన్యాసాలు కట్టిపెట్టి
ఉపయుక్త కార్యాలకు పూనగలమో—"

—అని సగం తనలో తాను అనుకున్నట్లు అంటారేగాని 'వట్టిమాటలు కట్టిపెట్టోయ్ గట్టి మేలులపెట్టవోయ్' అని ధాటిగా విసురుగా చెప్పరు.

కలెక్టరుగా పనిచేసినా 'కలెక్టరుగిరీ' చూపలేరు. 'తీరికలేని పనులే తీరంలేని ఆనంద సాగరాలు' అని తన పనిలో నిమగ్నమై పోతారు. ఎక్కడా ఆర్భాటం లేదు — ఆఖరికి కవితా శైలిలో కూడా. మనమూ మనమూ సరదాగా మాట్లాడుకుంటున్నట్లు అలవోకగా పంక్తులు నడుస్తుంటాయి. వూ కొడుతూ అలా వింటూ వింటూ పోతుంటే అకస్మాత్తుగా ఒక చెణుకు. మూడుముక్కల్లో ఒక త్రికాల సత్యం. దానితో ఆ చెబుతూఉన్నదానికంతా ఒక కొత్తవెలుగు, ఒక

కొత్త ప్రాణం వచ్చినట్లయిపోతుంది.

పేరులో ఏముంది పెన్నిధి అంటూ చెబుతూ పోయిపోయి, కడపట ఒక్క సారి 'మంచిపేరు మనిషికి మాణిక్యాల మకుటం' అని ముగిస్తే - చెప్పులగురించి సాదాగా చెప్పుకుపోతూ ఒక్కసారిగా, తప్పు చేసినవారి నుద్దేశించి, 'కొట్టాలి చెప్పుతో' అన్నప్పుడు చెప్పు సంతోషిస్తుందో. సిగ్గుపడుతుందో" అని జిగేల్మని పిస్తే - కోపంగురించి కవితావ్యాసం కూరుస్తూపోయి "కోపంలేని మనిషి ఆ దేవు డిలో మరోరూపం" అని ముక్తాయిస్తే!

ఒక్కొక్కసారి ఎంత నిశితంగా ఆలోచించి ఎంత సులుసూత్రంగా చెప్పే స్తారా మాలకొండయ్యగారు అనిపిస్తుంది.

"మనం మనమే
బ్రతికివున్న మనుషులం!
మరి సంఘమో?
బ్రతికివున్న మనుషులతో నిండిన శవపేటిక!"
"మంచికి" కొలతబద్ద-చెడు
"చెడు"కు కొలమానం-మంచి
"కోటి విధాలుగా
వేటి ప్రజాజీవనమే బండి
ఈ బండిల జీవితమే
ఇబ్బందులతో గడపాలి మరి"

ఈ బందులకు, ఇబ్బందులకు తేడా ఏముంది- ఎలాగో సంధికుదుర్చుకు బతకటం తప్ప! ఇదొక గడుసుతనం.

మాలకొండయ్యగారు అక్కడక్కడ గడుసుతనం చూపకపోలేదు.

అయితే జీవితంలో వైరుధ్యం బొమ్మా బొరుసు లాంటివని సరిపుచ్చుతూ ఉండటం వల్ల అక్కడక్కడ కనబడే చమత్కారం మిస్ అయ్యే ప్రమాదం ఉంది పాఠకులు.

ఇది కలియుగమో, ఆకలి యుగమో, ఇతరులే మంటారోకాని మాల కొండయ్యగారు దీన్ని మీటింగుల యుగమని తేల్చారు. అడ్డమైన దానికీ మీటింగులే.

మీటింగులు లేందే రోజు గడవనిది
మనం ఉంటున్న మోడర్న్ యుగం!
అసలు మీటింగులు ఉండాలా, లేదా అంటే-
అది తేల్చడానికీ పెట్టాలి మీటింగులు!

మీటింగుల లాంటివే సన్మానాలూ. అన్నిటికీ సన్మానాలే. ఆ విసుగులోను మాణిక్యంలాంటి మాటవొకటి చెప్పారాయన-

సన్మానం పొందే అర్హతను
సంపాదించుకోవడం కన్న
సన్మానం మరి వేరే ఏముంది?

మాలకొండయ్యగారు పాపలకు హితోక్తులు పలికారు. ఖలీల్ జీబ్రాన్, ఉమర్ ఖయాం వంటి మహనీయుల రచనలూ అనువదించారు.

"కవిత్వం నిజమైన వెన్నెలై కాయాలి
అడవిలో కాక ఆశ్రిత జనావళిపై"

అని మాలకొండయ్యగారే అన్నట్లు సమాజానికి దర్పణంపట్టి సమాజాన్ని ఆదిలించి, అలరించి వారు ఇంకా ఇంకా వెన్నెల వెలుగులు కురిపిస్తారని మనం ఆశించవచ్చు.

# మాలకొండయ్యగారి (రచనల్లో) మానవతా దృష్టి

"కవి కౌస్తుభ"

—ఆచార్య తిరుమల

ఇది వచన కవితాయుగం. ప్రాచీన సాహిత్యానికి లక్షణ నిర్దేశం జరిగింది. కానీ ఆధునిక సాహిత్యానికింకా అలాంటి ఏర్పాటు సమగ్రంగా జరగలేదు. కాబట్టి వచన కవిత భావుకులందరికీ ఆయుధం అయ్యింది. ఇక్కడ భావానికి ఉన్న ప్రాముఖ్యం భాషకు గానీ మరే కట్టడికి గానీ లేదు. రాసినదాంట్లో చక్కని భావం వుంటే చాలు.

ఆధునిక వచన కవితా ప్రపంచంలో శ్రీ మాలకొండయ్యగారు ఒక నిరంకుశ కవి. 'కవి నిరంకుశుడు' అనే ప్రాచీనోక్తికి ఆయనొక నవ్యోదాహరణ. కవితా వస్తువుని ఎన్నుకోవటంలో గానీ, చెప్పే తీరులో గానీ ఆయనకు ఒక ప్రత్యేక మార్గం వుంది. అది అనితర సాధ్యం.

ముఖ్యంగా కవికి వుండవలసిన కరుణ, తన ప్రజలపట్ల ప్రేమ, సహృదయత - మాలకొండయ్యగారిలో నిండుగా కనిపిస్తాయి.

ఆయన భాష సజీవ వ్యావహారికం. ఆయన కవిత్వం ప్రజలకోసం. ఆయన ప్రజా మనిషి. "విజ్ఞానానికి విడిది గృహం భాష"—(భాష) అనే



Sri Malakondayya seen with Cine Music Director, Sri Pendyala Nageswara Rao (Chief Guest) and 'Ragasudha' family: Mr. Subrahmanyam, Smt. Mani Subrahmanyam, Kumari Padmaja and Sri Suresh, who conducted a musical nite of Sri Malakondayya's lyrics.

భాషకొక విలక్షణమైన నిర్వచనం చేసిన మాలకొండయ్యగారు - 'వ్రాతదార్లు' అనే కవితలో—

"సాటివారికి పనికిరాని కవిత్వం
కాదా - అడవిని కాచిన వెన్నెల?"

అనటం అపూర్వం. విజ్ఞానాన్ని మధించి ఆ నవనీత సారాన్ని తోటివారికి పంచాలన్నది ఆయన ఆశయం. అంతేకాదు, 'విజ్ఞాన నిలయం' అనే ఖండికలో- "ప్రపంచ నాగరికతకు పుస్తకమే పునాది" అన్నారాయన. అటువంటి పుస్తకం విజ్ఞాన నిలయం. పుస్తకం విలువ ఆయనకు తెలుసు. ఆ విలువని ఆయనిలా ప్రబోధిస్తారు—

"విజ్ఞానానికి పునాది ఆసక్తి"—(యువతరం)-
"ఆసక్తి విజ్ఞానానికి గీటురాయి
యువతరం భావికి ఊతకర్ర"—(ఎగిరే పక్షులు)—

నాగరికతకు పుస్తకం, పుస్తకానికి విజ్ఞానం, విజ్ఞానానికి ఆసక్తి - ఆసక్తికి యువతరం- ఇదీ ప్రగతి సాధనకి ఆయన ఇచ్చిన ప్రణాళిక. ఇందులో రవ్వంత దోషంకూడా లేదు. ఇలా యువతని ఉద్బోధించటమే కాదు,

"మోసపోతున్న సత్యాన్ని గెలిపించాలి కవి"
అని 'కాలంవెంట కవి'ని కూడా పలుగెత్తించారు.

ఆధునిక సమాజంలో క్షీణించిపోతున్న విలువల్ని చూసి మాలకొండయ్య గారు వ్యక్తం చేసిన ఆవేదన, తపన - నాన్యతోదర్శనీయం.

'ఆట - విమర్శ' అనే కవితలో ఆయన చెప్పినట్లు-
"ఆటనేర్చి ఆడటం ఎంత కష్టమో

తెలియకుండా విమర్శించడం అంత సులభం"

కాబట్టి - హృదయాన్ని గ్రహించి దుమ్ముని వూది బొమ్మని చూపెట్టటం సద్విమర్శకుని పని. ఏ మమకార, వికారాలూ లేకుండా మాలకొండయ్యగారి సృష్టిని నేను చవి చూపించటానికి ప్రయత్నిస్తున్నాను.

"మల్లెపూల వాన కురిసె
చలువ చీర సగము తడిసె"—

అన్న మాలకొండయ్యగారు కవి కాదంటే ఎలా? ఈ ఒక్క ప్రయోగంతో ఎంత అర్థం చెప్పుకోవచ్చు!

మరో ప్రయోగం చూడండి:-
"తానీషా చూశాడు నన్నీరోజు
తరుముతున్నాడు నన్నేమొ నెలరాజు
పైట కొంగు జారుచున్నది
పరువము తొంగి చూస్తున్నదీ—"

తానీషా రాజు. మిగిలిన కాముకుల్లా ప్రవర్తించడు. అతను చూపుతో ఆమె పైట తొలగించాడట! ఎంత రసజ్ఞత! ఎంత రసజ్ఞత!!

ఇలాంటి పిచ్చెత్తించే ప్రయోగాలు చేయగల మాలకొండయ్యగారు— సామాన్యమైన పద్ధతిలో రాయడం సామాన్య ప్రజలకోసం మాత్రమే.

మాలకొండయ్యగారి చూపు సోకని రంగం లేదు. ఆయన వెన్ను తట్టని మనిషి లేడు. ఆయన కలం స్పృశించని విషయం లేదు. ఆయన బహిరంతర లోకాన్ని చూడగల మనిషి. అదే సత్యాన్ని 'చవి చూడు' అన్న కవితలో—

"కళ్ళు తెరిచి లోకాన్ని చూడు
కళ్ళు మూసుకుని నిన్ను నువ్వు చూడు"—

అని వెల్లడించారు. పనినిపట్టి ఫలితం వుంటుందంటూ 'లోకం తీరు' ను చెపుతూ—

"వేప నాటితే చింత మొలుచునా
పాపం విత్తితే పుణ్యం పండునా?"

అని ప్రశ్నించి—ఆత్మ పరిశీలన చేసుకోమంటారు. అంతేకాదు, ఏపని చేయటానికైనా నామోషీ పనికిరాదంటూ—

"కాయ కష్టంలో వుంది గౌరవం
ఏ పని చేపట్టినా లేదవమానం"—(పని)

అంటూ ***dignity of labour*** ని (శ్రామిక గౌరవాన్ని) నిర్వచిస్తారు.

ఐతే మనిషి పరిసర ప్రభావాలకి, కొన్ని వాతావరణాలకి లోనై అనుకున్నంత త్వరగా మారటానికి ఒప్పుకోడు. ఆ అలవాట్లు అంత బలంగా వుంటాయి - కాబట్టి - అటువంటి మనిషిలో మార్పు రావాలని, అతనికి చైతన్యం రావాలని కోరి—

"కొత్త అలవాట్లు పట్టుదారాల్లాంటివి
పాతుకుపోయినవి ఉక్కు పగ్గాల్లాంటివి"—(అలవాట్లు)

అంటూ విశ్లేషించి చూపిస్తూ - స్నేహంతో, సహకారంతో, ఐకమత్యంతో సత్సాంప్రదాయాల్ని నెలకొల్పుకోవచ్చు నంటూ నచ్చజెపుతారు.

"ప్రపంచ పరిస్థితులన్నిటిని
పరిశీలిస్తాడు మనిషి
ప్రక్కయింటివారి బ్రతుకు మాత్రం
పట్టించుకోడు మనిషి"—(మనిషికి దూరం)

ఇది మాలకొండయ్యగారు ప్రదర్శించిన నేటి మానవ మనస్తత్వం. అంతేకాదు - మనలో చాలా దాగుడుమూతలున్నాయి. ఆయనే అన్నారు—

"వెలుగులో తెలుసుకుంటాం మనలిగూర్చి
చీకటిలో దాచుకుంటాం నిజస్వరూపం" అని.

ఇది పచ్చి నిజం. ఈ ముసుగులోంచి బయటపడాలంటే నమ్మకం కావాలి. మనిషిని మనిషి నమ్మాలి. అందుకే - "నమ్ముతాను" అన్న కవితలో

నమ్మకంలో పుడుతుంది శక్తి అని
నమ్మకంలో వికసిస్తుంది జీవితం అని
నమ్ముతాను" అని చాటారు.

ఇక్కడ "**Faith is God**" అన్న గాంధీజీ గుర్తుకు వస్తాడు. నమ్మకంతో, స్నేహ భావంతో మనుషులంతా మెలగాలి. 'మిత్రులు'ని ఉద్దేశించి - శ్లేషతో

"స్నేహం లేని జీవితం
చమురులేని దీపం"

అన్నారు. అంతేకాదు "సాక్షిమాత్ర సుందరమైన సఖ్యశక్తి" అన్న రాయప్రోలు వారిలా

పట్టేరి స్వార్థానికి ఛత్రం"—

అంటూ ప్రదర్శిస్తారు.

అలాగే మనిషి తన తృప్తిని ప్రకటించటానికి నవ్వేకంటె ఎదుటివారి బాధనుండి నవ్వును పొందుతున్నాడు. ఇది ఘోరం. ఈ ప్రవృత్తి మారాలి. అందుకే-

"తోటివారి బాధలు చూచి నవ్వితే

అది నవ్వుకాదు, నాగుపాము విషం"—(నవ్వు)

ఇది మాలకొండయ్యగారి గుండె పలికినమాట.

అలా విషపూరితంగా మనిషి నవ్వితే మానవత్వానికి మనుగడ లేదు. మరి నవ్వు ఎలా వుండాలి? నవ్వు ఏమిటి?

"నవ్వే వెన్నెలకు మూలం

నవ్వే చీకటికి శూలం

నవ్వే నవనందనం భోగికి

నవ్వే దివ్యౌషధం రోగికి"—

ఇది "నవ్వు - నవ్వించు" కవితలో ఆయన చేసిన తీర్మానం.

ఈ విషమత్వం పోవాలి. వర్ణ, వర్గ, భాషా విభేదాలు పోయి సమసమాజం రావాలి. ఎలా? మాలకొండయ్యగారి నడిగితే ఇలా అంటారు-

"ఆకలి ఆకలి ఎందరికో

మరి, ఆ మాటే తెలియదు కొందరికి!

+ + + +

ఈ అందరితో ఆ కొందరు

పాలు పంచుకో గలిగితే

మనసు కలుపుకో గలిగితే
ప్రపంచమంతా శుభోదయం
మనిషి బ్రతుకే కాదా సుఖమయం"—

ఐతే యిది సాధ్యమా? అలా కలుస్తారా? కలుస్తారు. దానికి ప్రజలు విద్యావంతులు కావాలి. సంస్కారవంతులు కావాలి. "ఈత" అనే కవితలో ఆయన—

"అన్ని విద్యలు నేర్చిన నాడే
మనిషి మనిషిగా తయారు కాగలడు—"

అంటూ "విద్య లేనివాడు వింత పశువు" కాబట్టి, ఆ పశు స్వభావాన్ని వొదులుకొని - భాషలెన్నో నేర్చి, చదువులెన్నో నేర్చి, నలుగురితో మెలగాలి. మాలకొండయ్యగారు "జోల"—గా యిలా ఈమాటే చెప్పారు:-

"భాషలెన్నో నేర్వరా నాన్న
చదువులెన్నో నేర్వరా నాన్న
దేశానికి మేలు చేయరా బాబు
చక్కగా నలుగురిలో మెలగరా బాబు"

ఇది మాలకొండయ్యగారు పాడిన జోలపాట కాదు, మానవతకు పాడిన మేలుకొలుపు.

కాబట్టే "చదువు" అనే కవితలో—

"చదవటం జీవించటం

చదువు మానటం మరణించటం"

అని ఖరాఖండిగా చెప్పారు. మానవతా సాధనకి చదువు అంత ముఖ్యం.

వ్యర్థంగా జీవితాలు వెళ్ళిపోకూడదు. కాలాన్ని వాడుకోవటం తెలియాలి. ఆ కాల ప్రాముఖ్యాన్ని ఆయనిలా నాణెంగా చెప్పారు: -

"నిన్న చెల్లని నాణెం—పారవెయ్యి
రేపు ప్రామిసరీ నోట్—దాచుకో
నేడు నగదు రొక్కం—వాడుకో!"

కాలం అమూల్యం; అగమ్యం, ఒక మహా తత్త్వం.

వెలుగు వెంట చీకటి, చీకటి వెంట వెలుగు! ఆశ - నిరాశ; అభ్యుదయం-పతనం. పశుత్వం - మానవత్వం.

అంతా కాలనిర్ణయం. ఎంత చీకటిగా ఉన్నా ఏదో ఒక ఆశ. కవి ఆశాజీవి. అందుకే అభేదం అందుకే ప్రసన్న గొంతుతో మాలకొండయ్యగారు—

"ప్రతి చీకటి రాత్రికి
ప్రమిద ఒకటి దొరుకుతుందని
ప్రతి ప్రయత్నానికి
ఫలితం కొంత దక్కుతుందని"

నమ్మి మానవతా శక్తికి విశ్వాసాన్ని ఎగరేశారు. ఆ నమ్మకంతోనే మానవతా వరస్ఫూర్తితో-

"తుడిస్తే పోయే సిరాతో రాస్తే
ఉండేవా మన సాహిత్య కళాఖండాలు
మన ఇతిహాసాలు, కావ్యాలు"—([illegible])
అంటూ వెల్లడించారు. ఈ వెల్లడింపు అక్షర సత్యం.



Sri Malakondayya, Secretary, A. P. State Photographic Academy,
Speaking at its annual function.

Others seated : His Excellency K. C. Abraham, Governor of A. P.,
Dr. N. Bhagawandas, I. A. S. (Retd.), President and
Sri K. S. R. Murthy, I. A. S., Treasurer of the Academi

మాలకొండయ్యగారు మానవతావాది. ఒక్కమాటలో చెప్పాలంటే "కాలం వెంట కవి". ఆయన ఆశయం "హంసధ్వని", ప్రపంచానికి ఆయన ప్రశ్న "హహ! నీకు తెలుసా?" జవాబు ఆయన వ్యక్తిత్వం, ఆయన కవిత్వం!!

ఆయనకున్న అపారమైన లోకజ్ఞతని, పరిశీలనా పాటవాన్ని, అలతి అలతి మాటల్లో ఆయన విశ్లేషించి వచన కవితల రూపంలో, పాటల రూపంలో [illegible]నికి అందించారు. మానవత్వం కోసం మహాయాత్ర సాగించారు.

---

# తరంగ మృదంగ నిస్వనం-
# మాలకొండయ్యగారి
# హృదయ స్పందన స్వరం

**—ఆవుల సాంబశివరావు**

సారస్వత రంగంలో, ఉద్యోగుల్ని చూస్తే చిన్నచూపు. అధికారం కన్ను కప్పగా, మదం హృదయ ద్వారాల నన్నిటినీ మూసివేయగా, అహంభావులుగా మాత్రమే మిగిలి ఉంటారని వారిని గురించిన అభిప్రాయం. అందువల్లనే దేనికీ స్పందించరని వారిమీద కినుక.

వారి తరపున నేనేమీ 'వకాలతు' పుచ్చుకోలేదు. పై ఆరోపణలో మాత్రం సత్యంలేదని కూడా నేను అనబోవడంలేదు. కాని ఏ రంగంలోనైనా అధికులమని అనుకున్న వారిలో 'అహంభావం' పిసరంత వుంటూనే వుంటుంది. అందులో అధికారంతో కూడుకున్న అధిక్యతలో అది హెచ్చు మోతాదులో ఉండటం మామూలు. అది, చాలావరకు, చుట్టూజేరే భజనపరులు కల్పించే భ్రాంతి.

అయితే అధికారంలో ఒక వసతి, వనరు ఉన్నాయి. ప్రజలను దగ్గరగా చూడవచ్చు. వాళ్ళ జీవితాలు పరిశీలించవచ్చు. వాళ్ళ ఇక్కట్లు ఏమిటో తెలుసుకోవచ్చు. వాళ్ళ గోడు వినవచ్చు. ఆర్ద్రత ఏమాత్రమైనా ఎండిపోకుండా మిగివుండాలే కాని, వీటిని కన్నప్పుడు, విన్నప్పుడు, ఏ హృదయం చలించదు! స్పందించదు!

అలా స్పందించే హృదయం మాలకొండయ్యగారిది. ఉద్యోగి అయినా, అధికారాన్ని అనేకఏండ్లుగా అనుభవిస్తూవున్నా, మాలకొండయ్యగారి హృదయం స్పందిస్తూనే ఉంది. ఆమాటకువస్తే, ఉద్యోగి అయిన పిమ్మటనే ఆ స్పందనం తీవ్రతరమయింది. వేదనాభరితమయింది. మానవతా పూరితమయింది.

అందులోనుండి పుట్టుకువచ్చిందే వారి కవిత. సామాజిక జీవిత పరిశీలన నుండి ఆయనకు ఎన్ని ప్రశ్నలుదయించాయి? ఎంత ఆవేదన పుట్టింది? ఎంత జిజ్ఞాస పెరిగింది? ఆయన గుండెలు ఈ అనుభూతులకు ఎలాప్రతిధ్వనించాయో వారి కవనం చూపుతుంది. వారి కవిత ఒక ఆర్ద్ర హృదయ స్పందనానికి దర్పణం.

తనది అనుభూతి గీతమని ఆయనే చెప్పుకున్నారు. ఏ ఖండిక చదివినా అది వెల్లడవుతూనే వుంటుంది. అనుభూతుల పంట మాలకొండయ్యగారి కవిత. అవి అధికారిగా తాను సంతరించుకున్న, అనుభవించిన అనుభూతులు. పరిపాలనలో పాల్గొనే ప్రతివారికీ అట్టి అనుభూతీ, అట్టి అనుభూతిని పొందే స్నిగ్ధ హృదయమూ వుంటే, మనదేశం ఎలా వుంటుందో! ఆ స్థితిని ఊహించుకుంటేనే మధుర స్వప్నాలు కమ్ముకుంటున్నాయి నా మనస్సులో.

'జీవితవలయాల'తో ఆరంభమయింది మాలకొండయ్యగారు తన అనుభూతుల్ని అందరితో పంచుకోడం. చాలామంది మనసుల్ని ఆకర్షించింది ఆఖండ కావ్య సంపుటి. ఆకర్షించకుండానూ, ఆకట్టుకోకుండానూ వుంటుందా అది!

"చూసేవన్నీ చేసేవన్నీ
తనివితీర చెప్పాలని
మనసులోని ఆలోచనలను
ఆవేదనలను
ముసుగువిప్పి
కలం కుంచె రంగులతో

కథలుగా, కవితలుగా
కాలం గుండెల్లో వెదజల్లాలని-
ఆపేక్షిస్తుంది నాకు..."

అని మొదలుబెట్టిన కవిని, నాందీవచనం పలికిన కవితను ఎవరు కాదనగలరు! అందులో 'పెండింగు ఫైళ్లు' 'పెరగని రైతు', 'అరువు కళ్ళు' 'దొరగారిదర్శనం' 'దుఃఖం' 'నవ్వు' మొదలైన కవ్వించే కవితలున్నప్పుడు. 'నడుంకట్టి నడు' అని ప్రబోధిస్తున్నప్పుడూ...

"నీ సమాజం బూజుపడితే నష్టపడే దెవరు?
నీ వాతావరణం కుళ్ళిపోతే జబ్బుపడే దెవరు?"
అందుకని:

"ఇంత భారమా అని క్రుంగిపోకు
అంత దూరమా అని ఆగిపోకు
నీవు యువకుడవు! తరుణ వయస్కుడవు
కావోకు అకాల వృద్ధుడవు!"

కనక 'నడుంకట్టి నడువు' అంటున్న కవిని ఎవరైనా విస్మరించగలరా? కనకనే ఆ పుస్తకం మూడు ముద్రణలు పొందింది.

'జీవితవలయాలు' తరవాత, మరెన్నో రచనలు మాలకొండయ్యగారి కలం నుండి స్రవించినై. స్రవిస్తూ వున్నాయి. 'మనిషికి మనిషి' 'కాలంవెంట కవి' 'హాహా నీకు తెలుసా' 'న్యాయానికి నోరు' ఒకదానివెంట మరొకటి శరపరంపరగా వచ్చినై. ఇంకా, ఇంకా వస్తాయి.

మాలకొండయ్యగారు, అట్టి భావుకులు, స్వేచ్ఛాప్రియులు, సంకల్పిస్తే

న్యాయానికి నోరూ వస్తుంది-పేరూ వస్తుంది. రావలసిన ప్రతిష్ఠా వస్తుంది. అంతే కాదు, కాలంవెంటబడి పోయే కవికుమారుల్లుకాక, కాలాన్నే తమవెంట, తమబాటన నడిపించుకొని వెళ్ళే భావుకులు, మేధావులు, తాత్వికులు వస్తారు. 'మార్చాలి. మార్పుచు, మంచిని తేవాలి' అనే నిశ్చయం వుండాలి. అందుకు ప్రయత్నం వుండాలి.

ఈ రెంటినీ ప్రబోధించే మాలకొండయ్యగారి కవిత చిరకాలం నిలిచే కవిత.

# జనంనుంచి జనంలోకి

—ఎల్లోరా
(అధ్యక్షులు, జానపద సాహితీసమాఖ్య)

"మనిషిని తెలుసుకుని
మసలుకోగలిగితె
అమానుషత్వం మాని
మనిషిని మనిషిగా చూడగలిగితే-
మనుషుల మనసులు
అమృత కలశాలు కాగలిగితే-
మారదా మానవలోకం
కాదా శాంతికి నిలయం
మానవతకు ఆలయం..."

ఈ వాక్యాలు చదివినప్పుడు మనసుకు అనిపించేది, వినిపించేది, ఆలోచింప చేసేది—ఒక్కటే.

ప్రాచీన కాలంలోకి ఒక్కసారి దృష్టిని సారించినప్పుడు-ఇటువంటి భావనా తరంగాలు కోకొల్లలు.

"ఆనోభద్రాఃక్రతవోయంతు
విశ్వతః"—

"సర్వేజనాః సుఖినోభవంతు"

ఇలా ఆణిముత్యాల్లాంటి నాదవేదాలు మనలను మానవతా లోకంలోకి తీసుకుని పోతాయి.

"అమృతం పంచిపెడుతున్నాను
అందరూ రండి"

అని మంటలమధ్య మండిపోతున్న మానవుడి భుజం తట్టి, మంటలు చల్లారే సమయం వుంది, మానవుడా రేపు నీ విజయం అమృతానందకరం - అంటాడు సినారే ఒకచోట.

ఇటువంటి వాక్య శకలాలను పరామర్శించినప్పుడు—

కవి సమాజాన్ని నడపాలా? సమాజం కవిని నడిపిస్తుందా?? అనే ప్రశ్న ఎదురవక మానవు.

వస్తువు ఏదైనా కావచ్చు, వెన్నెల వెన్నెలే, అగ్ని అగ్నే, సమస్య సమస్యే—

కవి క్రాంతిదర్శి !

ఈ సమాజం ఏమైతేనేం - నేను బాగుంటేచాలు అనుకొని - తన విధ్యుక్త ధర్మాన్ని మరచి నేలవిడిచి సాముచేయడం జరిగేపనా?

అందుకే మాలకొండయ్య అంటాడు - అనగలిగాడు—

"ద్వేషం హృదయంలో రగిలే
వెర్రి జాడ్యం.
మనిషిని మనం ద్వేషిస్తే
ద్వేషం దహిస్తుంది మన హృదయాన్నే" అని!

గెథే మాటలు ఇక్కడ జ్ఞప్తికి తెచ్చుకోడం అప్రస్తుతం కాదనుకొంటాను.

మానవుడు బాధతో మూగవడినయపుడు

వ్యక్తపరచెడుశక్తి నాయందు కలదు”

దాశరథి అన్నట్లు ఇది ఒక్క గెథేకే పరిమితం కాదుకదా.

ఇక్కడ మాలకొండయ్య శబ్దస్ఫూర్తిని ఎలా వింగడించాడో చూడండి

“విప్పితే ఊహానేత్రం
సముద్రపు లోతును కొలువవచ్చు
ఆకాశపు ఎత్తును అంచనా కట్టవచ్చు
అణువును చీల్చవచ్చు”

ఇటువంటి శబ్దవాహికల విన్యాసం ఆయన ప్రత్యేకత.

మనసు ఉన్నవాడు కావాలి - మనిషంటే, ప్రేమ ఉన్నవాడు కావాలి - జనంమీద, సమాజంమీద అవగాహన కాస్తంత కావాలి.

మాలకొండయ్యకు కవిత్వంమీద ఎందుకు దృష్టి మళ్ళింది? హాయిగా తిని కూర్చోలేక? ఇది ఒక ప్రశ్న.

నా సమాధానం:

మనిషిలో కాస్త సమాజంమీద ప్రేమవుండి, మంచిమనసు ఉన్నవాడు-జనంలో తిరుగుతూ సమాజ పరిస్థితులను చూస్తూన్నవాడు- ఎలా ఊరుకోగలడు-

అందుకే మాలకొండయ్య కూడా తన పరిధిలో అక్షరాస్త్రాలను ఆయత్తం చేశాడు. చీకటిని తరిమి, వెలుగుని ఆవిష్కరించే కవితా గాండీవధారణం చేశాడు.

అందుకే - తన భావప్రకటనకు కవిత్వాన్ని వాహికగా మలచుకొన్నాడు.



Sri Malakondayya, receiving All India Red-Cross Merit Award for humanitarian services from Sri V. V. Giri, the then President of India.

తాను చేయదలచుకొన్న పనిని, తన ఆశల ఆశయాల అమలుకోసం-సహాస విన్యాసం వదిలి సూటిగా ధాటిగా చెప్పగలిగాడు.

ఈయన జనంకోసం వాళ్ళ సమస్యలను వారికే సునాయాసంగా అర్థం అయ్యే భాషలో చెప్పడానికి సాహసించాడు.

ఈయన కవితలో ఎక్కడా సర్కాస్‌ఫీట్లు తారసపడవు. అర్థంకాని వాక్ చిత్రాలు దర్శనమివ్వవు. ఇమేజరీలు అడ్డుపడవు.

సరదాగా రాస్తాడు, నిష్ఠతో రాస్తాడు. ఇదే నా ఆశ, నా ఆశయం అని ఢంకా మ్రోగిస్తాడు.

ఒకటా, రెండా-ఎన్నో రాశాడు. "జీవితవలయాలు" "మనిషికి మనిషి" "న్యాయానికి నోరు", "పాపా! నీకుతెలుసా?" "కాలంవెంట కవి", 'హంసధ్వని', "మధువాణి" "Niagaras of New Age" ఇలా ఎన్నో, ఎన్నెన్నో, మరెన్నో!

భాషాకుటీరం అంటే పూజ్యులు శ్రీ రావూరి వెంకట సత్యనారాయణ. వారి మాటలు - "కాలాన్ని అంటిపెట్టుకొని నడుస్తున్నాడు. ఒకప్పుడు కాలాన్ని కాసిస్తున్నాడు. ఒకప్పుడు బుజ్జగిస్తున్నాడు. ఒకప్పుడు తన మనస్సును పూల గుచ్ఛంగా చేసుకొని ప్రజానీకంపై ఆ పూలజల్లులు కురిపిస్తున్నాడు. వారి కష్టాలు మరిపిస్తున్నాడు. అందువల్ల కవి ప్రయాణం ఎల్లప్పుడు కాలంవెంటనే..."

ఇలా 'కాలంవెంట కవి' అయిన మాలకొండయ్య - ప్రజలతో, ప్రజాసమస్యలతో సాగిపోవాలని ఆశిస్తున్నాను.

కవిత్వం అంటే స్లోగాన్స్‌గా చెలామణీ అవుతూన్న, అపప్రథకు లోనవు

తూన్న, ప్రస్తుత సంధి యుగ ఘడియల్లో - మాలకొండయ్య తన కవితావాణి స్లో-గన్స్‌గా మరింత వేడిని, వాడినీ రంగరించి, తెలుగువాడిని ముందుకు నడిపించే ప్రయత్నానికి పచ్చతోరణం ఆవిష్కరించాలని ఆశిస్తూన్నాను.

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిం"

# ప్రజాకవి - రోజా కవితలు

ఈ కవి—

తొలికవిత ఏనాడు కురిసిందో
అది ముత్యాల తొలకరిగా మారింది-
కాలంలో తొలకరి ఏటేటా వస్తుంది
కలంలో తొలకరి పూట పూటకూ వస్తుంది-
ఆ మాటకొస్తే, మాటి మాటికీ వస్తుంది!

ఔను—

కవనంలో తొలకరి కలకాలం నిలుస్తుంది
మూలకొండయ్యగారి కలం
వర్షాంబుద సదృశమై హర్ష సంభరితమై
కురుస్తూనే వుంటుంది - ముత్యాల జల్లులు!

కురిసేదీ కలవాళ్ళమీద కాదు
కలిమి బలిమి లేనివారి తలలమీద
దోసిళ్ళతో గుమ్మరించే సేసలుగా కురుస్తయ్
వాళ్ళందరినీ దగ్గరకు రమ్మని పిలుస్తయ్
ఎండిన గుండెల్లో ఆశల పంటలు పండిస్తయ్

ఈయనగారి కలం——

కలవారిని పల్లకీ ఎక్కించి మోయదు
ఓహోమ్ ఓహోమ్ పాటలు పాడదు
అసలు వారి వంకే చూడదు
చూసినా ఆ చూపులు సూదులుగా చేసి చూస్తుంది!
వారిలోగల స్వార్థాన్ని దూస్తుంది.

ఈయన కలం——

కాలంవెంట నడుస్తుంది
కష్టజీవుల కన్నీరు తుడుస్తుంది
చిక్కుపడిన హృదయాన్ని చక్కచేసి ముడుస్తుంది
ఆలింగనంలో దాచి ఆదరిస్తుంది
సోదరత్వాన్ని క్షణక్షణం బోధిస్తుంది
సంఘంలో గల అపశృతుల్ని, అవినీతిని
అహంకారాన్ని, ద్వేషాన్ని, మోసాన్ని
వెలికిలాగి భోగిమంట వెలిగిస్తుంది!

స్వప్న సౌధాలలోకి చొరబడదు
ప్రణయ జ్యోత్స్నలలో విహరించదు
ఖాళీ జగత్తులో పల్టీలు కొట్టదు
ఊరికే తూలిపోయే గాలిమేడలు కట్టదు
నేలమీదనే నడుస్తుంది
జాలిగా అందరినీ పలకరిస్తుంది
ప్రజా హృదయాలలో పన్నీరు చిలకరిస్తుంది
అందుకే ఈయన ప్రజాకవి

ఈయన రచనలు రోజా కవితలు

హామాల కొండయ్య సదా

మాలకొండయ్యను కాపాడాలి

ఇంకా ఇంకా కవితలు వ్రాయించాలి

వ్రాయించాలి! వ్రాయించాలి!!

నా 71వ జన్మదినోత్సవ సందర్భంగా మిత్రులు మాలకొండయ్యగారికి, నాకు గల గౌరవానికి సూచనగా అందించిన అక్షరమాల.

—రావూరు వెంకట సత్యనారాయణరావు

# Sri Malakondayya's "Folk Poetry"

— J. M. GIRGLANI, I.A.S.

We normally hear of folk-lore, folk-dances and folk-songs. Seldom do we hear of "folk-poetry', We even often hear of folk-arts. But, 'folk-poetry' seems to be taboo. Mr. L. Malakondayya with his lucid and simple poetry on contemporary folk themes has broken this taboo. In any language, poetry always remains a private preserve of the intellectual elite, rather the intellectual monopolists. Much more is it so in India where even before writing began, all thought, history and wisdom was clothed in the form of verse, so that the rythm may help memorisation. From then onwards, began the monopoly of all knowledge and literature. When the language of the learned slowly became more and more obsolete, the monopoly over poetry however increased and the strangle-held on it was maintained by using an archaic language distinct from the popular language that was used as a general means of verbal communication. Even till today, the tradition of using incomprehensible language or "elite language" as the language of poetry continues. When folk songs broke this monopoly in the early stages of human history, the learned pandits distinguished it from poetry by giving it the seperate lable of "folk-songs". The credit of breaking the monopoly on poetry goes to pioneers like Vemana in Telugu language. In the contemporary literary world of Andhra Pradesh, Mr. L. Malakondayya is one who has emerged as the breaker of this monopoly not only as he has choosen simple common man's language and idiom for expressing his poetic thoughts but also as he has selected popular themes. For the traditional poet there is no other theme for poetry but erotie

love, philosophy and mythology and of course the repetitive presentation, or rather the distortion, of the beautiful Epics. There is yet another field in which Mr. Malakondayya has broken the traditional taboos and traditional hold over poetry and thought; in doing away with hackneyed imagery. A million times over, the moon, the flowers and beauty of nature and anatomy of woman have been the imagery used by poets claiming undeserved originality. t may be said to the credit of Mr. Malakondayya that he has discarded this practice and resorted to original and fresh imagery for his poems. In fact, he has set himself free from the yoke of imagery itself; for thought and feeling need not always depend on imagery for effective and lucid expression. Even to-day, atleast in India, poetry has become a slave of imagery and continues to be so in the eyes of the learned literary critics who cannot jump out of their traditional literary skin. Mr. Malakondayya has shown that the same effect that imagery creates, can be created by patterns of thought woven together in meaningful form to present their own inherent imagery without having to borrow it from outside through metaphor or simile -- which is all that imagery has been reduced to by most of the poets.

I have had occasion to read Mr. Malakondayya's poetry right from the very beginning of his poetic career; of course with the help of learned friends, in view of my handicap of not being too well-versed in Telugu. With their help and with his own help, I have also had occasion to translate some of his poems into English.

Mr. Malakondayya's poetry deals with life as it is, not as it was or as ought to be; and in that sense it can be called existentialist. Even his philosophical poems pulsate with life. He is concerned more with man than with abstract or natural phenomena. He is not a dreamer but at the same time he is not purblind like most of the dreamers who having eyes see not the beautiful panorama of life and its events. He does not have to look at

the moon and stars to find beauty. He can find it in little hill-streams or in a pending file. As Jiddu Krishnamurthy has said, everything in life is beautiful if only you can see and feel it intensely. His love is not based on the libido. His love is universal which arises out of his capacity to see beauty in the every day things and experiences of life which he can watch and see with the keenness of a child. For him, everything is a discovery. Indeed, he discovers new meaning and new feeling in the mundane facts and artifacts of life. He is indeed a poet who treads this world with his eyes, ears, senses and his mind's windows wide open to receive all the messages that keep vibrating around these sensitive antanea at every step.

He is not one of those who write poetry to impress anyone with is erudition, nor is he one who would write poetry to be counted among the great. He writes poetry to give expression to feelings that arise within him through an Intensive observation of men and matters, events and non-events, happenings and occasions, as he also observes illusions and hallucinations make a mockery of man's reason. In that respect, his poetry is really an inter-action within himself, an interaction of his heart with his senses and his mind. Hence his poetry is essentially universal and strikes a chord in the heart of every reader who sees things in a similar light but is inhibitated from expressing himself, either by the tyranny of tradition or for mere lack of expression.

I remember that no greater tribute could have been paid to him than by an old illiterate villager who happened to listen to his poems as he was reading them in a car to a friend when the car was parked near a railway crossing waiting for the gate to open. This illiterate villager was so thrilled by his poems that they went right into his heart, and when he stopped reading, the villager begged him to continue.

One of the poems of Mr. Malakondayya is "Poetry in a Car". He really writes poetry spontoneously, sometimes while trave-



Sri Malakondayya along with the members of the Photograph Academi and local tribals, participating in their "Saffari" at "Papil Hills" on Godavari Banks, East Godavari District.

lling in a car, some times in a plane, some times in a train. He does not need the aid of wine or women to inspire him to write poetry, for the inspiration is within him and needs no external stimulae. In fact, the distinction between poetry and prose is that the former is spontaneous and comes from somewhere deep within a man, while prose is much more on the surface and on the rational and intellectual plane. It is not a difference in form, but really a difference in content, depth and source. In that respect many a prose is indeed poetry and a great deal of poetry is really no different from prose. Judged by this criteria, Mr. Malakondayya's poetry is better indeed than much of the metre-ridden verse though his poetry is in free verse.

If literature has to reach the common man, we need poets like Mr. Malakondayya and we need more poetry like his. In fact, he is in a way a trendsetter. It is only after a long time when the trend becomes a fashion, that we will realise that he has been a pioneer of popular poetry — "folk-poetry".

Mr. Malakondayya is essentially a man of action and not of words. As a man of action he also believes in poetry of action, without any unnecessary verbiage and without any unnecessary packaging material. If action is his philosophy his poetry reflects this philosophy. But, apart from being a man of action, Mr. Malakondayya is essentially also a man of compassion. You can see this compassion in his poems. His compassion is not that of a revolutionary or a radical which will shed blood to wipe tears or shed tears to wipe blood. His compassion is ather of the type of the good Samaritan. It is where action and compassion in a man form a harmonious blend. In his poetry too you can see the same blend. His poetry is an authentic reflection of his own philosophy and personality.

Mr. Malakondayya is not an ascetic, not even a votary of temperance. In fact, there is a bit of an epicurean in him and therefore his poetry has no pessimism in it. It has optimism in

it. But he is not an Aurobindo who believes that man is going to become a superman nor is he a prophet of Doom who believes that mankind will wither away into oblivion or end up in hell-fires. He believes in the dynamism of man and his poetry is a reflection of this belief. You will not find in him the intensity of love which the Urdu and Persian poetry present, nor the intensity of hate that the revolutionary Kavis represent. He is rather one who takes life as it comes with its joys and sorrows eternally interwined. He does not pontify nor does he, for that matter, preach any licentious liberalism. He observes and comments on what he sees, as Sanjay did to Drtrashtra, about the happenings on Kurukshetra -- with a poetic view of the great events that were unfolding themselves before his eyes not a mere news-man's narration.

It is therefore always a happy experience to read Mr. Malakondayya's poetry because it brings alive the realities and trivialities of life without painting them either glowing white or jet black or blazing red or dull saffron.

౬ రాగవల్లరీ
నా హృదయ పల్లవీ
నీ మూగ రాగాలె
మా కుగాదులు దేవి!
కొనగోట నీవీణ
కొసరిపాడుము తల్లి!

కవిత మెరిసినచోట
గానమొలకిన బాట
పలుకు ముత్యపు మూట
బ్రతుకు వెన్నెల తోట

---

"ఇందుకల దందులేదను సందేహము వలదు చక్రి సర్వోపగతుండు" అన్నాడు ప్రహ్లాదుడు. అలాగే ఆహ్లాదం, అనురాగం, ఆత్మోన్నతి, అమర భావన గల హృదయాలన్నిటికీ సంగీతం అన్నిటా గోచరిస్తుంది. - అన్నివేళల్లో అలరిస్తుంది- ఒకప్పుడు ఆదరిస్తుంది- సేద తీరుస్తుంది. ముఖ్యంగా కవుల గొంతుల్లో తంబురా లుంటాయి అవి కదిలి చేసే గానాన్ని పెదవు లందుకొని పాటలుగా పాడతాయి. వాటికి కమ్మని శ్రుతులు కల్పిస్తుంది కవితా హృదయం. కవనంలో గానం, గానంలో కవనం దాగి దోబూచులాడుతూ వుంటాయి. అందువల్ల ప్రతి కవీ సంగీతదర్శనం చేయకలుగుతాడు. మాలకొండయ్యగారి దర్శనాన్ని గురించి పెద్దలు చెప్పిన మాటలు వినండి.

# పరవళ్ళు తొక్కిన పాట

—చిత్తరంజన్

పాపికొండల నడుమ - పండు వెన్నెలలోన

పరవళ్ళు తొక్కేను గోదావరీ—

సంగీతం రానివాడైనా సరే ఇలాంటి గీతాన్ని తనకు చేతైనట్లు ఏదో ఒక బాణీలో పాడుతాడే గాని చదవడు, చదవలేడు కూడా. దానికి కారణం పాటలో భావంతోబాటు, బాణీకూడా పరవళ్ళు తొక్కటం.

రచయిత కొన్ని పాటలు ప్రయత్నపూర్వకంగా రాయవలసి వస్తుంది. వాటికి బాణీ కూర్చటం కూడా ప్రయత్నం చేస్తేకాని జరగదు. మరికొన్ని పాటలు చూడగానే గళం రాగం పలుకుతుంది. దానంతట అదే బాణీ కుదురుతుంది.

"కలం కుంచె రంగుల్లతో కథలు కవితలుగా

కాలాన్ని చిత్రించి కట్టివేయాలని"

శ్రీ మాలకొండయ్యగారిల్లో

ఆవేగం ఆవేశం ఉద్వేగం ఉత్సాహం

ఆవేదన ఆందోళన ఉద్రేకం ఉరకవేస్తూ

అడ్డుకట్ట లేకుండా తోసుకు వస్తుంది

అందుకే కలం దానంతట కదలి కవితావాహినిగా రూపొంది 'హంస ధ్వని'గా అవతరించిందేమో అనిపిస్తుంది.

అంతేగాదు, శ్రీ మాలకొండయ్యగారి తార్కికదృక్పథం సమ్యగ్దృష్టి, సంస్కారభావం, హృదయౌన్నత్యం వంటి ఎన్నో లక్షణాలు ఆయనను ప్రజా కవిగా నిరూపిస్తూ మనకి సాక్షాత్కరిస్తాయి ఈ పుస్తకంలో.

దైవాలను పేరుపేరునా స్తుతిస్తూ ఈయన—

ఏసుపేరున వెలసిన దతడే
కృష్ణుని పేరున చరించినదతడే
అల్లా పేరున అలరినదతడే
అన్నిట తానే అభయప్రదాత్రై

అంటూ అన్ని మతాలు ఒకటే అంటారు.

ఈయనలో ఉప్పొంగిన ఉత్సాహం, ఉద్రేకం ఉరకలు వేసే గోదావరిలా అప్పుడప్పుడూ గట్టులు దాటుతుంది. తాళానికి కట్టుబడనంటుంది. దాన్ని సర్దుకోటం ఏమంత కష్టం కాదనుకోండి.

"వేప నాటితే - చింత మొలచునా!
పాపం విత్తితే-పుణ్యం పండునా"! అని,
"వేసేది టోపీ-పెట్టేది నామం"

అని పంచాన్ని మనము విమర్శించే ప్రత్యక్షర సత్యాలు ఈ గేయాల్లో కొల్లలు.

మాలకొండయ్యగారిది వైవిధ్యాంగల రచన. ఇందులో స్పృశించని విషయం లేదు. కొండవాళ్ళను, కైతులను, వాళ్ళ జీవితాన్ని వాస్తవంగా చిత్రించారు.

రాజులు వెళ్ళారు, అనే గేయం చాలా చక్కనిది. సంఘంలో వస్తున్న మార్పుల్ని సునిశితమైన హాస్యపూర్ణమైన చమత్కారంతో వివరించారు.

'పొడుగు రవికలు పోయాయి
పొట్టి బ్లౌజులు వచ్చాయి
పొట్టి బ్లౌజులు పోవచ్చు
వట్టి శరీరాలే మిగలచ్చు' అంటే నవ్వు వస్తుంది—

ఇందులోనే-సాహిత్యాన్ని గూర్చి కూడా

'పద్యం పోయి గేయం
గేయంపోయి గద్యం వచ్చాయి'

మరి ఆ తర్వాత వచ్చే మార్పేమిటి? అంటే-
'పద్యం పోవచ్చు చోద్యం రావచ్చు' అంటారు.

ఇలా చెబుతూ పోతే ఒక గ్రంథం కావచ్చు. కాబట్టి ఒకటి రెండు అపూర్వ కవితా శిల్పాన్ని వెలార్చే కళాఖండాలు ఒకటి రెండు చూపి ఆపుతాను

'ప్రతి చీకటి రాత్రికీ
ప్రమిద ఒకటి దొరుకుతుందనీ'

అనే పంక్తులు. 'చలువచీర కట్టుకొని' అనే పాట మరచిపోలేము. ఇలా చెబితే చాలా ఉన్నాయి.

'నమ్మకంలో ఉంది శక్తి
నమ్మకంలో జీవితం వికసిస్తుందని

నమ్ముతాను నేను

నమ్ముగాదు నా నమ్మకము'

అంటారీయన. ఇలాటి ఆత్మవిశ్వాసం వ్యక్తి జీవనానికీ, సమాజ భవిత వ్యానికీ కూడా పునాది వంటిది. శ్రీ మాలకొండయ్యగారు ఈ నమ్మకాని నమ్మ కంతో ఇంకా ఎన్నో మంచి రచనలు చేసి సమాజాన్ని వికసింప చేస్తారని గట్టిగా నమ్ముతాను.





Sri Malakondayya, with the then Governor of A. P.
Sri Khandhubhai Desai, on receipt of State Red-Cross Gold Medal
for humanitarian service as Collector, Karimnagar

# రాగసుధ

—ఇందిరామణి

డైరెక్టర్, రాగసుధ

చిన్ననాటినుండి, సంగీత, సాహిత్యాలంటే నాకెంతో అభిలాష. ఎంతో ఉత్సాహంకూడ. క్రొత్తగా ఏదో చేయాలన్న ఉత్సాహం, ఆరాటం, నాలో ఉవ్విళ్ళూతలూగుతూ వుంటుంది. నా అదృష్టవశాత్తు, నాకు లభించిన నా భర్త గారు శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారికి, ఈతృష్ణ నాకన్న రెండాకులెక్కువకావడం, మా అభిప్రాయాలు ఏకమవడం మూలానా, మా పిల్లలకు అట్టి వాతావరణమే అబ్బినందువలన, మా అన్వేషణ కొనసాగుతూ, సత్ఫలితాల్నందిస్తూ వుందీనాటి వరకు. మా కుటుంబమే 'రాగసుధ'గా మారింది.

శ్రీ మాలకొండయ్యగారి గేయాలను, ఒక సమావేశములో, సినీ సంగీత దర్శకుడు, గాయకుడైన శ్రీ ఎస్. రాజేశ్వరరావుగారు పాడగా వినడం జరిగింది. ఆ గేయాలు మమ్మల్నెంతో ఆకర్షించాయి. భాగ్యవశాత్తు వారి పరిచయం లభించడం, వారి గేయాలను పరిశీలించడం ఏర్పడింది.

మాకు పరిచయం కాకపూర్వం, మాలకొండయ్యగారు, ఒట్టికవులు మాత్రమే నని అనుకొన్నాము. కాని వారు ఉన్నతపదవిలో ఉద్యోగనిర్వహణ చేస్తూ ఇంత గొప్ప కవితలను వ్రాయగలిగారంటే, వారి ఆసక్తి, కళాపోషణలను ఎంతో అభినందించక తప్పదు. నోరుతిరగని సమాసాలతో, శ్లేషాలంకారాలతో ఛందో బద్ధంకాక, సర్వసాధారణ, వ్యావహారిక భాషయందు, అతి చక్కగా అరటిపండు

పోసి పెట్టినట్లుండే, వీరి కవితాధోరణి, ఎంతో హాయిగా ఉన్నది. వారి కవిత్వానికి 'ఇది, అది' అనే తారతమ్యాలు లేవు. దేశభక్తి గేయాలైతేనేమి, భక్తిగీతాలైతే నేమి, ఇతరత్ర ఎన్నో విధాలైన గీతాలు, ఒకదానినిమించి ఒకటి గీటురాయిలా నిలిచాయి. మచ్చుకు- "అలలను, కలలను" పోల్చి ఒక చక్కటి గేయం వ్రాసారు. అది ఎంతో అనుభవపూర్వకమైనది.

ఇట్టి స్వచ్ఛంద భావాలతో తేలిక పదజాలంతో, పేద, ధనవంతులనే భేదములేక, అన్ని రంగాలు అన్ని వర్గాల వారికందుబాటుగా, హాయినిగూర్చే కవితలల్లిన వీరిని, ప్రజాకవి అనటంలో అతిశయోక్తి లేదు.

వీరు సంగీతానికి అనుగుణ్యంగా, లయ. మాత్ర కాలములతో వీరి కవితలను అల్లకపోవుటచేత వారి భావావేశపు పదజాలములను, బాణీగట్టుటలో కొద్ది శ్రమ ఏర్పడినను, సంగీతమునకు వీలుగా, పదజాలములను సర్దుబాటు చేసుకొనుటకు, వారు నాకిచ్చిన స్వాతంత్ర్యమును సద్వినియోగం చేయుటచే ఏర్పడినవే గీతసంపుటి. స్వర పరచిన బాణీలు, వినయింపుగానున్నవా, లేవాయని నిర్ధారణ చేసుకొనుటకు, టి.వి. ఆర్టిస్టు, రేడియో ఆర్టిస్టు అయిన మాఅమ్మాయి సి. పద్మజ చేత పాడించి విన్నాము. మాకు తృప్తిగా ఉండినది. అదిగాక, ఇటీవల "ఆంధ్ర ప్రదేశవతరణ" సందర్భంగా వీరి గేయాలకు నేను స్వరకల్పన చేయడం, అవి టి.వి.లో మా అమ్మాయిచేత పాడబడటం, ప్రజాదరణ పొందటం జరిగింది. ప్రజాకవి రచనల నామోదించిన ప్రజలు, నా సంగీతాన్ని ఆమోదించారని తృప్తి ఏర్పడ్డతర్వాత తక్కిన్న గీతాలకు బాణీలు కట్టి ప్రచురించడం జరిగింది. నాలో ఉరకలెత్తుతున్న కొత్తదనానికిదొక సవాలై, నాలో సంగీత ఝరులుగా ప్రవహించినది. అదే ఈ గీతమాలిక, ఈ రాగసుధ. ఇట్టి కొంగ్రొత్త గీతమాలికలు ఇంకా ఎన్నో మాలకొండయ్యగారి కలంనుండి వెలువడాలని ఎదురుచూస్తూ ఆహ్వానిస్తున్నాను.

# మనసును నవ్వించి కవ్వించే పాటలు

—మురళీకృష్ణ

శ్రీ మాలకొండయ్యగారి రచనల్లో మొట్టమొదట నాకు నచ్చిన "నవ్వు, నవ్వించు ఈ లోకాన్ని" అనే పాటకు స్వరకల్పన చేశాను. తరువాత వారు నాకు వైవిధ్యంగల అమూల్యమైన పదిహేను పాటలకు స్వరకల్పన చేసే అవకాశం కలిగించారు. ఆ పాటలు విన్న ప్రతివారూ మరోసారి పాడమని అడిగి పాడించుకున్నారు. అందులో ముఖ్యంగా "మృగం కంట నీరుకారితే" అనే కరుణారసం తొణికిసలాడే పాట ప్రతిఒక్కరి హృదయంలో నాటుకుపోయింది. ప్రతి కవి శైలియి వ్రాసే పాటలు కొన్ని ఉంటాయి.. కాని శ్రీ మాలకొండయ్యగారు అలా కాక ప్రతిపాటలో తన అనుభవాన్ని అద్దంలోలాగ కనబరుస్తారు. అందుచేతనే అవి కేవలం పండితులకే కాక పామరులకు కూడా తేలికగా అర్థమయేటట్లు ఉంటాయి. నాకు వారి పాటల్లో బాగానచ్చింది "బాల్యం ఒక పవిత్ర స్వర్గం" "నమ్ముతాను నేను" అనేవి. ఎందుచేతనంటే చిన్నతనం గురించి ఊహించడం చాలా కష్టం, జీవితంలో గట్టినమ్మకం చాలామందిలో అరుదు. అలాంటిది వారు ఎంతో హాయిగా మళ్ళీ బాల్యదశవస్తే బాగుండును అనిపించేలా వ్రాశారు. జీవితం మీద నమ్మకం కల్గించారు. ఇలా చెప్పుకుంటూ, వారి పాటలను సమీక్షిస్తూ పోతే అది ఒక మహాగ్రంథం అయినా ఆశ్చర్యపడనక్కరలేదు! ఒక్కమాటలో చెప్పాలంటే వారి పాటలు మనసును నవ్వించి, కవ్వించేవి!

# వాడుక భాషలో

—పెండ్యాల నాగేశ్వరరావు

శ్రీ మాలకొండయ్యగారి కవితలు చదివాను. ఆయన కవిత్వములో స్వతంత్రమైన బాణీవుందని, పాండిత్య ప్రదర్శనకంటే పండిత పామరులకు సూచిగా తమ మనోభావాలను వాడుకభాషలో అందివ్వాలన్న ప్రయత్నం ప్రస్ఫుటంగా కనిపించింది.

ఆయన రచనలలో లౌకికమైన అన్ని భావాలను స్పృశించారు.

ఒక భావకవిగా - "అనిపిస్తుంది. నాకు అనిపిస్తుంది.

ఆవేశం, ఆవేశం, ఉద్వేగం, ఉత్సాహం, అడ్డుగట్లు లేకుండా తోసుకు వస్తుంటే, కలం, కుంచె, రంగులతో, కథలు, కవితలుగా కాలాన్ని చిత్రించాలని" అంటారు.

ఎంతో అర్థంతోకూడిన భావాన్ని అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లుగా చెప్తారు. మరియొకచోట - కలాన్ని అలంకు పోలుస్తూ -

"అలంకు లేదు అలసట - కలంకు లేదు వేసట"

"ముద్దుమురిపెం ముగియకముందే,
కౌగిలి గిలిగింతలు పొందకముందే
కడలి ఈసూయతో అలను వెనక్కి లాగేస్తుంది,
కళ్ళెం వేస్తుంది."

"కలలో కన్న అనుభూతి పొందకముందే
చుప్పనాతి నిద్ర, ఓర్వలేక చప్పున యీర్ష్యతో
మేల్కొల్పుతుంది"

నిత్యానుభవాన్ని కవి తనభాషతో కట్టెదుట నిలిపారు

అందాల గోదావరిని గురించి చెప్తూ-

"సరస కిన్నెరసాని, శబరి చెలికత్తెగా
ఒయ్యారములతోడ వెయ్యిమెలికలు తిరిగి
గలగలా మెరిసేను గోదావరి
మిలమిలా మెరిసేను గోదావరి"

అని ఎంత శృంగారంగా చెప్పారో చూడండి!

మరియొక గేయంలో రైతునుచూసి బాధపడుతూ-

"మట్టితో మణులు పండిస్తాడని
పరిశ్రమలకు పట్టణాలకు ప్రాణం పోస్తాడని
అంతా రైతుదే రాజ్యమని పొగడి అతణ్ణి ఉబ్బేస్తారు"

శివునిగూర్చి స్తుతిస్తూ—గ్రామీణ భాషతో
"ఈశా అంటే కాసునయా
శంకర అంటే శమించునయ్యా
దేవదేవుడు ఇతడేనయ్యా,
అందరి దైవము ఇతడేనయ్యా"

ఇంకా ఆదిపరాశక్తిపై, పార్వతీ పుత్రుడు గణేశునిపై, మీదు మిక్కిలి యేసునాధునిపై కూడ రచించారు భక్తిగీతాలు. తారతమ్య భేదాలు లేకుండా.

ఇంకా "ఎవరో నీవెవరో చల్లగ వీచే గాలివి నీవా? పెనుగాలితో, బలము నీవా? వడగాలిలో వేడివి నీవా ఎవరో నీవెవరో" అని చైతన్యాన్ని ప్రశ్నిస్తే-

"కైలాస శిఖరం ఉన్నతి నేను, కన్యాకుమారి అగ్రగం నేను
మనిషి మమతతో పెరిగే మమతను నేను
మానవ క్షేమం కోరే ప్రేమమూర్తిని"
అని సమాధానం చెప్పిస్తాడు కవి.

శ్రీ మాలకొండయ్యగారి కవితలలో గల చమత్కారాన్ని నాకు తెలిసిన భాషలో విపులీకరించటానికి ప్రయత్నించాను.

గగన తలంలో వెలిగే

తారల తళతళలన్నీ

కవి తన కలంలో విరిసిస్తాడు

అమల మందాకినిలో తూగే

తరగల గలగలలన్నీ

కవి తన కలంలో కదిలిస్తాడు

నందన వనంలో విరిసే

పూల మిలమిలలన్నీ

కవి తన కలంలో చిందిస్తాడు

కవి కలం విశ్వవిపంచి

కవి సౌందర్యసృష్టికి విరించి

---

భావాలు పట్టుదారాలు. పలుకులు నవ పారిజాతాలు. కవితలు వాణి మెడలోవేసే సుమ దామాలు. ఆమె ముంజేతి కంకణాలు-ఆమె చరణ మంజీరాలు. అంత అందమైన ఆభరణాలు ధరించి ఆమె కవిని దీవిస్తుంది. అతడు సంఘానికి ప్రతినిధిగా నిలిచి ఆమెకు నివేదికలందిస్తాడు-అవి నిజంగా సౌందర్య నివేదనలు. ఆ సౌందర్యాన్ని కవి నిత్యం దర్శిస్తాడు-కలంతో చిత్రిస్తాడు.



Sri. & Smt. L. Malakondayya, on his taking over charge as Collector and District Magistrate, East Godavari with the out-going Collector, Sri P. S. Krishnan and Mrs. Krishnan

# జీవితవలయాలలో కవితా సౌందర్యం

—డా॥ దివాకర్ల వెంకటావధాని

కాలమునుబట్టి కవితా ప్రక్రియా విధానములందు మార్పు గోచరించుట సహజము. ఆంధ్రమున పురాణ ప్రబంధ భావ కవిత్వముల తరువాత గేయ కవిత్వము, అభ్యుదయ కవిత్వము, వచన కవిత్వము అనునవి వెల్వడినవి. రసాత్మకమైన వాక్యము కావ్యమను కవితా నిర్వచనము ప్రాచీన కాలమునకువలె ఇప్పటికిని యెప్పటికిని అన్వయించును. రసము బ్రహ్మస్వరూపమగుటచే ఆనందమయమైనది. సద్యః పరనిర్వృతి కావ్యముయొక్క పార్యంతిక ప్రయోజనము. దానిని కలిగించు రచన ఏ భాషలో వ్రాయఁబడినను, ఏ రూపమున వ్రాయఁబడినను, ఛందోమయమైనను నిశ్ఛందమైనను కావ్యమేయగును. ఆ గుణము లేనిచో నితర లక్షణ విశేషము లెన్నియున్నను అది ఉత్తమకావ్య మనిపించుకొనదు. ఉదాత్తమైన భావము, తదనుకూలమైన భాష, రసానంద ప్రదత్వము అనునవి సత్కావ్యమున కపరిహార్యములైన లక్షణములు. ఆధునిక కాలమున పలువురు గేయ కవిత్వమును వచన కవిత్వమును వెలయించుచున్నారు. అందును వచన కవితా రచన లసంఖ్యాకములుగా వెలువడుచున్నవి. ఇది సంతోషించవలసిన విషయమే. కాని, ఈ రచనలు పెక్కింట భాషా ప్రయోగౌచిత్యము కాని, భావ వైశద్యముకాని కనఁబడదు. అసమాసమైన వ్యావహారిక భాషలో ఛందోరహితముగా రచింపఁబడినను వానియందలి భావసౌందర్య మనుభూతికందని కారణమున రసానందమునకు భంగము వాటిల్లుచున్నది. అందుకు చాలవఱకు వ్యక్తీకరణ

లోపమే కారణము. ఆ లోపమునకు గురికాక చదివినంతనే భావములను హృదయమున హత్తించి రసానందమును చూరలిచ్చు ఇటీవల వెలువడిన వచన గేయ కావ్యములలో శ్రీ ఎల్. మాలకొండయ్యగారి 'జీవిత వలయాల'ను కావ్యసంపుటము చుక్కలలో చంద్రమసివలె నా కెంతో మెచ్చు గొల్పినది.

ఈ సంపుటమం దిరువదియైదు ఖండకావ్యము లున్నవి. ఇవన్నియు ఆధునిక జీవితమునకు సంబంధించినవి. అది గాక ఇందు జీవితవలయ మను పేరుగల కావ్యము కూడ ఉన్నది. వలయ మనగా వృత్తము. దాని పరిధిపై పయనించువారు ఘట్టకుటీ ప్రభాత న్యాయమున మరల బయలుదేరు చోటికే వచ్చుట సంభవించును. "ఎందుకు జీవించడం ఉద్యోగాలు చేయడానికి" అనునట్లుగా ముక్తపద గ్రస్త విధానమున ప్రశ్నోత్తరములు సాగించినచో మరల మొదటికే వత్తుము. ఈ శిల్పమను బట్టియు, సంపుటము నందలి కావ్యములకు జీవితముతో గల సంబంధమును బట్టియు దీనికి 'జీవిత వలయా'లను సమర్థమైన పేరు పెట్టబడినది. జీవితమును కేంద్రముచుట్టు ప్రవర్తిల్లిన చిన్న పెద్ద వలయము లిందలి కావ్యములు.

ఈ సంపుటమునందలి కావ్యములలో కొన్ని ఆత్మాశ్రయములు, కొన్ని ఉపదేశాత్మకములు, కొన్ని హేళన గర్భితములు, కొన్ని విమర్శన ప్రయోజనములు. కొన్ని ప్రకృతి వర్ణన ప్రధానములు. కొన్ని సాంఘికములు, కొన్ని స్వభావోక్తి మయములు, కొన్ని హాస్య రసస్ఫోరకములు, కొన్ని పౌరాణికములు, కొన్ని కవితా స్వరూప నిర్దేశకములు. శ్రీ మాలకొండయ్యగారు వృత్తిచే కలెక్టరు. కలెక్టరు మండలాధికారి. మండలమున జరుగు అన్ని కార్యములలో అతనికి సంబంధముండును. నిజముగా ఆ బాధ్యత గ్రహించినవారికి 'కలెక్టరు కడగండ్ల'ను కావ్యమున చెప్పబడినట్లు 'తమకాయం తమకాలం తమవి కానేకావు'.

ఆప్తివారి కా పదవి ముక్తకిరీటము. "అయితే ప్రజల కష్టాలే తన కష్టాలుగా, ప్రజల కోర్కెలు తీర్చే ప్రతినిధిగా భావించే కలెక్టరుకు ఈ తీరికలేని పనులే తీరంలేని ఆనందం ఇస్తాయి." కళా కవిత్వములను ప్రజలే అవలంబములనియు, సంస్కృతిని కూడ పోషించు కోరిక యున్నపుడే కలెక్టరుకు శాంతి సుఖములు లభించుననియు వారి నిశ్చితాభిప్రాయము. వారింత కవి యగుటకీ అభిప్రాయమే కారణము.

వారి కావ్యములలో పెక్కు కారులలో ప్రయాణము చేయుచున్నప్పుడే వ్రాసినట్లు కనిపించును. "కారు సీటు ఉయ్యాలలో ఊగేకొద్దీ చర్మ చక్షువులు మూసుకుంటాయి". సాధారణముగా నందరకిని, ఊహ చక్షువులు తెరచుకొనుట యనున దెవ్వరికో సుకృతవంతులకు మాత్రమే జరుగును. శ్రీ మాలకొండయ్యగారు అట్టి వారిలో నొకరు. కారులో పయనించు వారెంత పెద్దలైనను చిన్నవారై పోవుదురనియు, వారికి కనిపించున దంతయు కవితామయ మగుననియు వారి కనుభవసిద్ధముగా తెలిసిన విషయము. బారులో తత్త్వము పుట్టుటయేమో మాకు తెలియదు కాని కారులో కవిత్వము పుట్టుటకు మాత్రమీ జీవిత వలయాలే ప్రత్యక్ష నిదర్శనము. కవయతీతి కవిః. కవియైనవాడేదో చెప్పకుండ నూరకుండ జాలడు. శ్రీ మాలకొండయ్యగారియందు "కవితనము" పుష్కలముగానున్నది. అందుచేతనే "చూసేవన్నీ, చేసేవన్నీ తనివితీర చెప్పాలని, మనసులోని ఆలోచనలను ఆవేదనలను ముసుగువిప్పి కలం కుంచె రంగులతో కథలుగా కవితలుగా కాలం గుండెల్లో వెదచల్లా"లని వారికి తీరని యుబలాటము. ఆ యుబలాటము ఈ "జీవిత వలయాల" రూపమునొంది పఠితల ఆనందమునకు కారణమయినది.

కావ్యమానందముతో పాటు ప్రదేశమును కూడ నందించిన బంగారమునకు తావి అబ్బినట్లుండునని పలువురు విమర్శకుల అభిప్రాయము. శ్రీ మాలకొండయ్యగారి కావ్యములలో యువకులకు చక్కని ప్రగతి హేతువులైన ఉపదేశము

లొసంగియున్నారు. “నీ సమాజం బూజుపడితే జబ్బుపడేదెవరు? నీ వాతావరణం కుళ్ళిపోతే చచ్చిపోయే దెవ”రని ప్రశ్నించుచు, పెద్దపులులు గాండ్రించినను పెను పాములు బుసకొట్టినను భయపడక మానవశ్రేయస్సునే కలములో నింపు కొని వ్రాయుమని యువకవిని వారు బోధించుచున్నారు. ‘తక్కువే ఎక్కువ’ అను కావ్యములో ‘కుటుంబాన్ని పరిమితంచేసుకొని ఆనందాన్ని అపరిమితం చేసు కో’మ్మని వారు కుటుంబ నియంత్రణావశ్యకమును కవితామయముగా నిరూపించి యున్నారు. ‘తక్కువ పిల్లలు కన్నందుకు కుటుంబ పండిత బిరు” దీయవలె ననియు, “ఏకైక పుత్ర పుత్రికాప్రాప్తిరస్తు’ అని వర్ధమాన వధూవరులకు క్రొత్తరకపు దీవెన ఈయవలెననియు వారు సూచించి యున్నారు. క్రొత్త ఉగాదితో మనుగడలో కొంచమైన మార్పు రాకపోయినచో పండుగ దండుగే అని వారి అభిప్రాయము. అందుచేతనే వారు “సొంతలాభం ‘కొంత మానుకొందాం పొరుగువాళ్ళకు ఇంత తోడుపడదాం” అని గురజాడ కవికోకిలతో కంఠము కలిపియున్నారు. “ఏనాడు—ఆనాడు” అను ఖండకావ్యము వారి ఉపదేశ రత్నములకు రత్నాకరము. అది వారి విశాల దృక్పథముతోపాటు హృదయ వేదనను కూడ సూచించుచున్నది. వారి దృష్టిలో చెప్పునట్లు చేయగలుగుట, చేయునది చెప్పగల్గుట-మానవతా సార్థక్యమునకు గుర్తు. ‘చెప్పడం-చేయడం’ అను ఖండ కావ్యము కూడ ఈ సత్యమునే నొక్కి చెప్పుచున్నది. చెప్పినట్లు చేయలేకపోవుట కంటె చెప్పకూరకుండుటయే చాల మంచిది. అలవాట్లకు మానవులు దాసులు కారాదనియు. అలవాట్లే వారికి సేవకులు కావలెననియు వారు కావించిన ఉపదేశ మెల్లవారికిని శిరోధార్యమైనట్టిది. స్వయంకృషితో మనవారుపాధి కల్పించుకోవలె నని వారి మఱొక ఉపదేశము. పనితోనే ప్రగతి ఉన్నది. వారన్నట్లు పనిచేయ కుండ దేవుడుకూడ బ్రతుకలేడు. “ఆశాపాశము తాకడున్నిడు”పని భాగవతము. ఆశను పలువురు దురాశయముగా భావించి నిందింతురు. కాని శ్రీ మాలకొండయ్య

గారు ఆశయే ప్రగతికి ప్రాణము పోయుననియు, అదియే మానవుల నందరిని నడిపించుచున్న దేవతయనియు చక్కగా నిరూపించియున్నారు. 'ప్రేమ' అను కావ్యమున వారు ప్రేమ యందలి భేదములు వివరించి "ప్రేమకు కరగని హృదయం పెంకుకన్నా రాయికన్నా హీన"మనియు, ప్రేమించు దేవునిలో ప్రతి ఫలము "నిరంతరం ఆయన్ని ప్రేమించడమే" అనియు, వారు చక్కగా చెప్పియున్నారు. అట్లే వారు స్నేహమునందలి రకములు వింశదించి "స్నేహంలేని జీవితం ఎడారిలో మొక్కలాంటి"దని సిద్ధాంతీకరించినారు. "పుట్టడం ఎందుకు" అను కావ్యమున వారు "పుట్టేది బ్రతికేది పరమార్థం కోసమే"అనియు, 'మానవ సేవయే మాధవసేవ" అనియు సూటిగా చెప్పియున్నారు. ఒక విధముగా చూచినచో సృష్టిలోనే సమత్వము లుప్తమైపోయినట్లు కనిపించును. ఒకరికాకలి, ఒకరికకీర్తి, ఒకరికి దుఃఖము, ఒకరికి సుఖము మనము చూచుచునే వున్నాము. ఒకరితో మరొకరు పాలుపంచుకొనగలిగినచో నసమత్వము తొలగి హాయికలుగునని శ్రీ మాలకొండయ్యగారు నిర్దేశించియున్నారు. చాడీలు చెప్పుట చాల హానికరమైన దురభ్యాసము. చెప్పువారి యందువలెనే వినువారి యందును దోషమున్నదని శ్రీ మాలకొండయ్యగారి అభిప్రాయము. ఈ దోష నివారణమునకు "చెప్పేవాడి నాలుక చీల్చడం వినేవాడి చెవుల్లో సీసం కరిగించిపోయడం" వారు కనిపెట్టిన మందు. అదృష్టమనునది లేనేలేదనియు, పరిశ్రమ పరిణామమే అదృష్టమనియు వారు చక్కగా ప్రతిపాదించినారు. స్త్రీపురుష భేదము పాటించి స్త్రీని హీనసగా చూచుట వారికిష్టములేదు. "అన్ని పనులూ చేయాలి, ఆడా మగా తేడాలేకుండా" అని వారి ఆశయము. "ఆరుగురు మిత్రు"లను కావ్యము వారు బాలబాలికల కొసర్చిన మహోపదేశము.

శ్రీ మాలకొండయ్యగారు వర్తమాన సంఘమును నిశితముగా పరిశీలించి, అందలి లోపములను విమర్శించి, అభ్యుదయమున కుపాయములను సూచించి

యున్నారు. అనాస్థితో, అప్పటితో బాధపడుతూ పెనుగొని బ్రతుకు స్థితి వారి హృదయమున కించింపరాని వేదన కలిగించును. సంఘము వారు బ్రతికి ఉన్న మనుష్యులతో నిండిన శవపేటికతో పోల్చి ఆ పేటిక మానవులపై పెత్తనము సాగించుటకు విప్లవించుచున్నారు. "అన్యాయాన్ని ఎదుర్కొని న్యాయాన్ని నిల బెట్టా"లని వారి ప్రబోధము. పాప మెరుగని వారిని మహాత్ములుగను, నీతివర్త నులను దుర్నీతి పరులుగను లోకము ప్రచారము చేయుట కీర్త్యాద్వేషముచే కనిపింపని కారణమునని వారు రహస్యము బయటపెట్టినారు. స్వార్థముతో చేయు పూజా పురస్కారములను వారు తీవ్రముగా విమర్శించినారు. "దేవుడు గుళ్లోనె ఉన్నాడా ఆ గబ్బిలాల గిడ్డంగిలో" అను వారి వాక్యము "Whom deat thou worship in that dark corner of a temple" అను టాగూరు వాక్యమును స్మరణకు తెచ్చుచున్నది. మంచిపేరు మానవునికి వెలుగు నిచ్చుననియు నది అతనికి మకుటప్రాయమనియు. వారి అభిప్రాయము "జనరేషన్ గేప్" అను వాక్య మున వారు తరమునకు, తరమునకువంతెన కట్టవలసిన ఆవశ్యకతను సూచించినారు మానవు డంగి, హస్తపాద నేత్రాదు లంగములు. ఏ అంగము చెడిపోయినను అంగికి బాధ తప్పదు. అట్లే సమాజ మంగి, వ్యక్తు లంగములు. వ్యక్తులలోని అసమత్వము సమాజమునకే చేటు అందుచేత "చిన్న చిన్న చికిత్సలు పనిచేయవు కనుక కావాలి మేజరు ఆపరేషను"నని సాంఘిక వైద్యులుగా వారిచ్చు సలహాలు.

"పెండింగు ఫైళ్ళు" వృత్తాంతమును శ్రీ మాలకొండయ్యగారు అనుభవ పూర్వకముగా చమత్కారముగా వర్ణించి యున్నారు. అందలి ప్రతి వాక్యములో పేదవారిపై వారికి గల సానుభూతి వ్యక్తమగుచున్నది. శకునములు, ముహూర్త ములు మున్నగు వాని విషయమున కనిపించు మూఢ విశ్వాసములను వారు 'మన పాలిటి సైతానులు'గా పేర్కొనియున్నారు. అవి అజ్ఞానులనంధకారంలో ముంచడా నికో అమాయకులవల్ల లాభం పొందడానికో చిత్రంగా కల్పింపబడిన'వని వారి

హెచ్చరిక. "బ్రతుకని బిడ్డ" అను కావ్యము బ్రతికిఉన్నవారి గుణగణములను పాటింపక చచ్చినవారిని మాత్రము పొగడు సమాజమునందలి అలవాటుపై మంచి హేళన. 'మన ఘనత తెలుసుకోవాలంటే చచ్చి చూడాలి' అను వాక్యమెంతో హేళన గర్భితమై ఉన్నది. 'వేట' అను కావ్య మాయికములైన మృగ పక్షులను వేటాడు మృగములనే కాక, మాయ మెఱుగని దీనుల్ని పీడించు దుష్టులను కూడ చమత్కార పూర్వకముగా నధిక్షేపించుచున్నది. ప్రజా సేవకులని పేరు పెట్టుకొన్నవారు తమ్ము నమ్ముకొని ఉండు ఉద్యోగార్థులను వంచించు విధము "ఇంటరువ్యూ"లో బయట పెట్టబడినది. 'కమేరాక్ష'బ్బను కావ్యము పనిలేని పెద్దవారు చేయు వ్యర్థ వినోదములను విమర్శించు చున్నది. 'ఆట-విమర్శ' అను కావ్యము విజ్ఞానముతో కూడిన విమర్శ ఆవశ్యకతను, విమర్శకుడు చూపవలసిన మెలకువను వివరించు చున్నది. శ్రీ మాలకొండయ్యగారు మంచి-చెడ్డలు చీకటి వెలుగలనియు, మంచికి చెడ్డ-చెడకు మంచి కొలబద్దలనియు, చక్కగా చెప్పియున్నారు. మలమూత్ర విసర్జన విషయమున భారతీయులు పాటించు దురభ్యాసమును విమర్శించి వారు 'ఇండియాకు ఇంగ్లండు కన్న ఎందులో ఉన్నా లేకున్నా ఈ విషయంలో మాత్రం గొప్పతనం ఉన్న'దని హేళన పూర్వకముగా చెప్పియున్నారు. అపజయము కలిగినప్పుడు తమ అసమర్థతను కాక విధిని నిందించుట మానవులకు పరిపాటి. అది 'ఆడరాక మద్దెల ఓడ నడం' వంటిదని శ్రీ మాలకొండయ్యగారి వ్యాఖ్య. వారు చెప్పును- నీచముగా చూచుట ఉటంకించి 'తప్పుచేసిన వారి నుద్దేశించి కొట్టాలిచెప్పుతో' అన్నప్పుడు 'చెప్పు సంతోషిస్తుందో సిగ్గుపడుతుందో' అని దోషుల నీచత్వమును వ్యంగ్య పూర్వకముగా వెల్లడిచేసి యున్నారు. హేళన విమర్శల రెండింటి ప్రయోజనము సమానమేయైనను తన్నిర్వహణమున హేళన శక్తిమత్తరము. సంస్కరణాభిలాషగల వేమనాదులు విరివిగా విరివిగా వాడియున్నారు. శ్రీ మాలకొండయ్యగారు దానిని వాడినవిధము ప్రశంసా పాత్రముగా నున్నది.

ఈ సంపుటము నందలి కొన్ని కావ్యములు లోకమున నున్న విషయము లను, నిత్య సత్యములను అతి విశదముగా వ్యక్తీకరించుచున్నవి. పొగడ్త, దొరగారి దర్శనం, నిజంకాని నిజం, కోపం, ఎరువు సొమ్ము, ఇటుక, ఇల్లు, కలం మున్నగు కావ్యములు యథార్థ కథనమునకు దృష్టాంతములు. "పొగడక పోతే దేవుడు కూడా కరుణించడు-పొగడ్తను కళగా వాడుకో గల్గినవారు లోకంలో విజయం సాధిస్తారు" అమాయికంగా కనిపించే అభ్యర్థనల వెనకాల దాగిఉండే మాయ మర్మాలను పసిగట్టి జాగ్రత్తగా మసలుకోవాలి దొరగారు. "అబద్ధానికున్న విలువ నిజాని కెన్నడూ లేదు-నిజం ధర్మమైతే అబద్ధం ధర్మసూక్ష్మం" "కోపంలేని మనిషి దేవుడి మరోరూపం" "ఇటుకలోనే ఉంది కిటుకు మానవ నాగరికతకు" "కలం కదిలించింది జగాన్ని-అందించింది మానవ చరిత్రను మనకు" "ఇల్లు బాధను తొలగించే వెన్నెల" మొదలైనవి మాటని శాశ్వత సత్యములు.

ప్రకృతి వర్ణనాత్మకములైన కావ్యములలో సెలయేరు నిద్ర, కొండ వాళ్ళు, అందరాని ఆనందం, ప్రయాణం, సిగ్గు, నవ్వు, విమానయానం ముఖ్య ములైనవి. ఇవి కవిగారి ప్రకృతిపరిశీలనను, వర్ణనా వైశారద్యమును వ్యక్తము చేయుచున్నవి. వారి సెలయేరు వర్ణన మత్యంత సహజముగా నున్నది. జాగృతి జీవనమనియు, నిద్ర మరణమనియు వారు చక్కగా చెప్పియున్నారు. నిద్ర గుణములు వారు గుర్తింపక పోలేదు. "నా అనేవారు లేనివాడికి నిద్ర ప్రాణమిత్రం" అనునది నిద్రవిషయమున వట్టి పొగడ్త కాదు, సత్యము "కొండవారు మిన్నుకు మన్నుకు మధ్య గాలిలా జీవిస్తుంటారు" రనుటలో కవిత యెంతో యథార్థ కథనమంత. "అందం-ఆనందం" అను శీర్షికయే కీట్సు మహాకవి సౌందర్యానందములను గూర్చి చెప్పిన ఆ పద్యపాదమును జ్ఞాప కమునకు తెచ్చుచున్నది. ప్రకృతి సౌందర్యమున కాకరములైన వస్తువులన్నియు నానందప్రదములే అనువిషయమును శ్రీ మాలకొండయ్యగారు హృద్యముగా చెప్పియున్నారు. ప్రయాణము ప్రకృతి సౌందర్యమును ప్రదర్శించి పరవశింప



Iranian Officers undergoing training in Community Development with Sri L. Malakondayya, when he was the principal, Orientation and Study Centre, Rajendranagar.

జైయము పరమ సాధనము. ప్రయాణమును భరింపలేనివారు కొందరుందురు. వారు నిజమైన గ్రుడ్డివారు, కుంటివారు, చెవిటివారు, మూగవారు. "వైవిధ్యం జీవితానికి ప్రాణం ప్రాణానికి ప్రాణం ప్రయాణం" నవ్వొండమునకు నానందమునకు నిలయము. అది చీకటిని చీల్చు శూలము. నవ్వులలో పలురకములున్నవి. వెకటపు నవ్వులు వికృతఫలముల నొసంగును. "పీపానిండా మందునీళ్ళు డబ్బానిండా మందుబిళ్ళలు, సాటిరావు ఒకనర్సు చిరునవ్వు ముందు" అనుటలో కొంత హాస్యమున్నను సత్యము లేకపోలేదు. కవిగారు చెప్పినట్లు, "అందంతో ఆనందంలో అన్నిటికన్న సిగ్గువే మొగ్గు - సిగ్గే సింగారం - సిగ్గే బంగారం - శ్రుతి మించితే మాత్రం అంగారం." సిగ్గెవరెవరికెప్పుడెందుకు కలుగునో వారు వివరముగా రమణీయముగా చెప్పియున్నారు. విమానయానమానంద ప్రదమైన అనుభవము. అది ఆకాశమునుండి అంతములేని ప్రకృతి సౌందర్యమును చూపించును. స్వర్గము పైనెక్కడనో ఉన్నదని పలువురి విశ్వాసము. "శూన్యంలో స్వర్గం ఎలా ఉంటుం"దని కవిగారి ప్రశ్న. ప్రకృతి వర్ణ నాత్మకములైన యీ కావ్యములలో కవిగారి లోకపరిశీలనముతో పాటు పరమార్థ దర్శనము కూడ చక్కగా వ్యక్తమగుచున్నది.

కర్ణుడను కావ్యమొక్కటే యీ సంపుటమున పురాణములకు సంబంధించినది. ఇది మిక్కిలి యుదాత్తముగా నున్నది. కర్ణుడు మహావీరుడు, మహాదాత, రాజభక్తాగ్రణ్యుడు, ప్రతాప పరాక్రమ నిధి. కవిగారన్నట్లు శౌర్య ధైర్య విక్రమములలో నందరికంటె నాతడే మిన్న యైనను పేరు ప్రతిష్ఠలు పార్థునికబ్బినవి, ఆ అన్యాయమును కృష్ణపరమాత్మ సన్నిహితుడై యుండియు నాపలేకపోయెనని కవిగారు పొందిన ఆవేదనతో ఏకీభవింపని వారుండరు. అందుచేతనే కర్ణుడు గొప్ప విషాదాంత నాయకుడుగా పరిగణింపబడు చున్నాడు. "ఆ చంద్రార్కం నిలిచే (అతని) కీర్తి ఎన్నటికీ మిన్నయే" నిజముగా నాతని కన్న దేశము దివ్యభూమి.

శ్రీ మాలకొండయ్యగారి కావ్యములలో హాస్య చమత్కారములను హేళనను పెక్కుచోట్ల ప్రదర్శించియున్నారు. "పిల్లి బల్లి కాకి నక్క మనకు పురోహితులా-అవి ముహూర్తాలు పెడతాయా" "నీకు లాంటివాడు బ్రతకలేక చస్తే మేకులా బ్రతికాడంటారు." "తీసేటప్పుడు ప్రాణాలు తీపి తమవి-వినేటప్పుడు తీపి యితరులవి" "బూతుమాటలే మనకు నిషేధం-బూతుపనులు కాదు" మున్నగునవి యిందుకు నిదర్శనములు. చెప్పు, పొరుగింటి పుల్లకూర అను కావ్యములలో హాస్య చమత్కారములు పుష్కలముగా కనుపించు చున్నవి. 'వెల్లుల్లి శాస్త్రి' అను కావ్యము హాస్యమునకేకాక హేళనకును ఆట పట్టైయున్నది. "చెప్పే ఉపన్యాసం లోకులకు, చేసే ఆచారం మనకు" "ఉపోషలు ఇతరులకు, ఉల్లిపాయలు మనకు" అనువాక్యము లీ కావ్యమందిచ్చు ఆనందమునకు హేతువులు. చెప్పినట్లు చేయుట యెఱుగని శ్రీరంగనీతిపరుల కిది చెప్పుదెబ్బ.

"అదీ-ఇదీ" అనునదీ సంపుటమునందలి చివరి కావ్యము. ఈ కావ్యమంతయు అది, ఇది అను పదములతోడను, వానికి సంబంధించిన పదముల తోడను సాగినది. 'అది ఇది' అను పదములు మిక్కిలి సులభములైనను బహుళార్థ సాధకము లైనట్టివి. అనిర్వచనీయము. అవ్యక్తములైన విషయములను చెప్పుటకు సాధారణముగా పలువురీ పదములను వాడుచుందురు. ఈ కావ్యమొక విధముగా అద్వైత భావమును, ఇంకొక విధముగా ఆశ్చర్యకరమైన జగద్వైచిత్రిని సూచించుచున్నట్లు కనబడుచున్నది. ఇది పుష్పక విమానమువంటిది. ఏ భావమునైన తనలో నిముడ్చుకొని యించుక శేషించి యుండును.

ఈ సంపుటమునందలి కావ్యములలో కవితామయములైన భాగములనేకము లున్నవి. ధ్వని గాంభీర్యము, రసప్రచురత్వము, వ్యక్తీకరణ చమత్కారము, ఆలంకారిక సౌష్ఠవము ఆ కవితామయత్వమునకు మూలములు. "కలం కుంచె రంగులతో కథలుగా కవితలుగా కాలం గుండెల్లో వెదచల్లాలని అనిపిస్తుందినాకు"

"నక్షత్రాల్లాలే రేముక్కలు కొన్ని ఫైళ్ళ మందగమనాలముందు" "ఆ కుంభ కర్ణుల్ని లేపడానికి అంకుశాల్లాంటి రన్నింగునోటు ఫైళ్ళున్నాయి" "ఆఫీసులనే గుడుల మంటపాల్లో మాత్రం పడిగాపులు పడి ఉంటారు పలురకాల అర్జీల యాత్రికులు" 'ఇవ్వాళ నిద్రపోతేనే రేపు చైతన్యం" "నిలవాలి ధైర్యంతో నీట ద్రోసి నీలోని కుంభకర్ణుణ్ణి" "పెద్దపులులు గాండ్రిస్తాయి, పెనుపాములు బుసకొడతాయి" ఆమ్లెట్ రుచి చెప్పాలంటే గ్రుడ్డు పెట్టనవసరమా" "సిల్కుదారం తెగకపోతే ఉక్కుపగ్గం తెగుతుందా" "తెల్లని మొగ్గలతో నిండిన మల్లెపొద వన్నెవన్నెల పింఛము విప్పిన నెమలి...అందాలకు ఆకారాలు కాదా ఆనందాలకు ప్రాకారాలు కాదా (పుట 57)" ఎద్దులులేని బండిప్రయాణం బుద్ధిలేని ఆశ అనిపించిందొకనాడు" "దుఃఖాలులేకపోవటమే సుఖం దుఃఖించకపోతే మానవుడు అవుతాడు దేవుడే" "అన్నం తిని వెళ్ళకూడదా భోజనానికి రాకూడదా'' "ఎవరా చిన్నది" యందలి చాల భాగము, "పోరులేని ఇల్లు పొగలేని నిప్పు'' చాడీలువినే చెవులు" శ్మశానవాటికలే అవుతాయి'' "ఆడ మగ అర్ధనారీశ్వరులైతే తేలదా వివాదం పడకగదిలో'' మొదలైనవి అందుకు నిదర్శనము.

ఈ కావ్యములన్నియు వచనగేయములుగనే వ్రాయబడినను వీనియందంతర్లయ పుష్కలముగా ఉన్నది. కొన్నిచోట్ల యతిప్రాస లప్రయత్నముగా సిద్ధించినవి. కొన్నిచోట్ల అంత్యాను ప్రాసములున్నవి. ఇందలి ఛందోరాహిత్యము భావవ్యక్తీకరణ స్వాతంత్ర్యమునకు తోడ్పడినదేకాని శ్రవణసుభగత్వమున కెచ్చటను భంగము కలిగించి యుండలేదు. ఈ కావ్యములన్నింట కవితాత్మ సర్వతో ముఖముగా గోచరించు చున్నది క్లిష్టతలేని భావవైశద్యము, ఆడంబరములేని పదప్రయోగము ప్రసన్నతతోడి వ్యక్తీకరణము ఇందు సర్వతో ముఖముగా గోచరించుచున్నవి.

శ్రీ మాలకొండయ్యగారెందు వాడిన పదములన్నియు సర్వ సుబోధములును, సరళసుందరములును, సరసములునై యొప్పారుచున్నవి. 'భూతల నరకం' అను సమాసమొకటి తప్ప అర్థమునకై సామాన్యులు కూడా నాగి ఆలోచింపవలసిన పదముకాని సమాసము కాని యింకొకటియు కనిపింపదు. వారెందు సామెతలను, నానుడులను కొల్లలుగా వాడియున్నారు. అవి కావ్యముల కెంతెంతనరాని యొయ్యారము నావహించినవి. "అంగట్లో అన్నీ ఉన్నాయిగాని అల్లుడి నోట్లో శని" "ఈనగాచి నక్కలపాలౌతున్న ఆయన జీవితం" "ఎక్కడవేసిన గొంగళి అక్కడే" 'బ్రతికిన బిడ్డలికపోయినా బెత్తెడంత చావగానే బారెడంత అయిపోతుంది' 'నిజంచెప్పి నిష్ఠురం తెచ్చుకోకుండా' "కంచెయే చేను మేసినట్లు" మున్నగునవి నిదర్శనములు. అచ్చటచ్చట వాడబడిన ఆంగ్ల పదము లా సందర్భమున్న చక్కగా అతికి సొంపు చేకూర్చుచున్నవి. శ్రీ మాలకొండయ్య గారు పుంఖానుపుంఖముగా వచ్చు పైళ్ళను చూచుచునే, నిరంతరము సాంస్కృతిక కలాపములలో పాల్గొనుచునే, కలెక్టరులకుండు కడగండ్లన్నియు కిమ్మనకుండ భరించుచునే మధురము, ప్రసన్నము, భావగంభీరము, ఔచిత్యశోభితము, సరసము, సరళము, సర్వ సహృదయ హృదయానంద సంధాయకము, ఉపదేశభరితమునైన యిట్టి కవిత్వము వ్రాయగలిగినందుకు వారి నభినందించుచున్నాను. వారీ కావ్యసంపుటిమును - తన భావనారూపమును - అనుభూతి గీతమును - కవితా కమలాల మాలను తమనెంచి పెంచియున్న కన్నవారికి భక్తితో నంకితముచేయుట పైడికి పరిమళ సంపదను పరికల్పించుచున్నది.

# మధువ్రతుడు శ్రీ మాలకొండయ్య

—డా॥ పోచిరాజు శేషగిరిరావు
ఎం.ఏ.పిహెచ్.డి.

గాలి కెరటాలలో-సాగర తరంగాలలో-చంద్రజ్యోత్స్నలో-కార్మికుని నొసలి చెమటలో - రైతుపట్టే నాగలి కర్రులో - బెస్తవాళ్ళ పేదరికంలో - కోనలలోని కొండవాళ్ళల్లో - చిరు మీలలో - చెట్లు చేమలలో - 'కులూ' లోయలో - కవితా దర్శనం చేసినవారు శ్రీ మాలకొండయ్యగారు. ఆయన కవితకు ఆలంబం 'జీవిత వలయాలు' 'మనిషి మనిషికీ ఉండవలసిన రాగబంధాలు' చూస్తూ కాలం వెంట నడచిన కవి. 'న్యాయానికి నోరు' తెరచిన ప్రగల్భుడు. శ్రీ మాలకొండయ్యగారు కవితా ప్రపంచంలో లబ్ధ ప్రతిష్ఠులు. సాహిత్యాధ్యయనం - కవితలు వానజల్లుల లాగ కురిపించడం వారి ప్రకృతేకాదు, ప్రవృత్తి కూడా. కవిత్వానికి మేధకంటె హృదయంతో ఎక్కువ అనుబంధం ఉండటం దీనికి మూలకందం. ఎంతగా ప్రయత్నించినా, అనుభూతిని దిగజార్చి కవిత లల్లలేము. సుప్త చేత నానుభూతికి భాషా గత ముద్రయే కవిత్వం.

గోథే అనుకుంటాను "బాధ్యత కలిగిన ఏ కవీ కూడా రాజకీయాలే కవిత్వమని కాని లేక కవిత్వానికి చక్కని వస్తువు రాజకీయాలని కాని చెప్పడం చాలా ప్రమాదమని" హెచ్చరించాడు.

ఉత్తమంగా కవిత్వం చెప్పడం, ఉత్తమంగా జీవించడం నేర్చినవారు శ్రీ మాలకొండయ్యగారు. అందు మూలాన కవిత్వపు మూల్యాలను నిలువబెట్టగా

నికే సర్వత్ర యత్నించారు. వారి కవితావాహినికి మూలస్రోతస్సు మానవుని మనుగడ.

శ్రీ మాలకొండయ్య గారు ఒక దశాబ్దం క్రిందట (1970) తూర్పు గోదావరి జిల్లా కలక్టరుగా వచ్చారు. డా సి. నారాయణరెడ్డి గారన్నట్లు (ఆయన) 'ప్రవృత్తి రీత్యా రకరకాల అనుభవాలను సేకరించే కలెక్టరు (మధువ్రతుడు) 'రత్నహారీతు పార్థివః' అన్నట్లు జిల్లాలో బహుముఖీనంగా ఉన్న కవితా సంప్రదాయాలను నిలువరిస్తూ కవితలు వెలార్చే కవిరత్నాలను వెదకి వెలికి తీసి మెరుగు పెట్టిన కవితా ప్రియం భావుకుడు. ఆయనకవి, సహృదయుడు, సాహిత్య సభలను నిర్వహించడంలో - రచయిత మహాసభలకు చేయూత నివ్వడంలో - రచనలకు ప్రోత్సాహమిచ్చుటలో - సర్వ కళారంగములలోను అందెవేసిన చేతులకు కరావలంబ మిచ్చుటలో ఆయన మిన్న. నామావశిష్టంగా ఉండిపోయిన వీరేశలింగ వర్థంతులకు పునరుత్తేజం కల్పించడమేకాక, వాటికి నవచైతన్యాన్ని ప్రసాదించారు. కందుకూరి వారి ఆదర్శాల విస్తృత ప్రచారానికి కంకణం కట్టుకొన్నారు. అందుచేతనే పెక్కు కవితా సంపుటాలలో వీరేశలింగార్చన కావించారు. తాను నమ్మిన ఆదర్శాలను నిర్భీకంగా, భావతీవ్రత స్ఫుటంగా కన్పించే లాగున చెప్పడం వారి కలవాటు.

శ్రీ మాలకొండయ్యగారి కవితను అనుశీలిస్తే ప్రకృతి పరిశీలనా చణత్వం-సౌందర్యారాధన - సామాజిక స్పృహ - అచ్చమైన వాస్తవికత - అభ్యుదయ దృక్పథం - బాధాపరితప్తుల యెడ సానుభూతి-సమసమాజ నిర్మితికై ఆవేదన - మూఢవిశ్వాస నిరాసనం - ఆర్ద్రతామహితమైన హృదయం - సంస్పందసుందరమైన ఉక్తి చాతురి - హృదయాంతర్గతమైన తపనను వెల్లడించాలనే తహతహ - అప్రియంగా ఉన్నా సత్యప్రకాశం చేసేధైర్యం ప్రస్ఫుటంగా దర్శనమిస్తాయి.

ఆయన తొలి కవితా సంపుటి 'జీవిత వలయాలు'. 1971లో కాకినాడలో ఉండగానే ప్రచురితమయింది. తొలిరచన అయినా అది కవితా రసలోలుపులనే

కాక సామాన్యులమూ అదే తీరుగా ఆకట్టుకుంటుంది. వచన కవితోద్యానంలో వాడని పువ్వు. ఇందులోని స్వచ్ఛంద కవితలు డా॥ నారాయణరెడ్డి గారన్నట్లు "జీవితానికీ మనిషికీ జరిగే నిరంతర సంఘట్టనంలో పుట్టిన చెకుముకి రవ్వలే". పెక్కు కవితలు వారి అనుభవ కేదారంలో అంకురించి పెద్దవైనవే. రాజకీయ దందడులపైగాని, 'ఇజా'లపై గాని వారికి మోజులేదు. జీవనాడులు కదిలేలా కవితలు వ్రాయడమే వారికి విలాసం.

శ్రీ మాలకొండయ్యగారి కవితా సరస్వతి 'జీవిత వలయాలు' 'మనిషికి మనిషి' 'కాలంవెంట కవి' 'పాపా నీకు తెలుసా?' 'న్యాయానికి నోరు' సంపుటాల్లో కానవస్తుంది. తొందరలో తెలుగు సాహిత్య రసికలోకం "మధువాణి" రుచి చూడబోతున్నది.

'జీవిత వలయాలు' జీవిత వాహినిలో సుళ్ళు తిరిగినవే. మచ్చుకు 'పెండింగు ఫైళ్ళు' (పుట 3,4) ఆయన మాత్రమే చేయగలిగిన అద్భుత రచన.

గుమాస్తాల చేతుల్లో
అనేక అంతస్తుల్లో
అవి పరీక్షించబడతాయి
చూస్తారు ఆఫీసర్లు 'రూల్సు' ప్రకారం
వేస్తారు ఆర్డర్లు క్రిందివాళ్ళు "సరే" అంటే

.............

పైవాళ్ళు క్రింది వారికి వేస్తారు ఏవేవో,
క్రింది వారు పై వారికి జవాబులు వ్రాస్తారు తమకు తోచినట్లు
(జీవిత వలయాలు-పుట3)

అలాగే 'పొగడ్త' అనే ఖండికలో
ఏ ఖర్చూలేని పొగడ్తలతో
ఎవరినైనా సంతోషపెడతారు ఎందరో!
ప్రమోషన్లకు పాస్‌పోర్టుగా
స్వలాభాలకు సాధనంగా
అభిమానార్జనకు ఆధారమాత్రంగా
ఉపయోగిస్తారు పొగడ్త కొందరు! (జీవిత వలయాలు-పుట 9)
నిజం నిజం!!

'షాంపూ' అన్న కవితలో నేటి సమాజపు కుళ్ళును జలకడిగి పోసారు

ఒక లక్ష్యశుద్ధితో ఆయన కవిత్వం వ్రాస్తారు, 'మాతృసమ్మానాలు,' 'పారుగింటి పుల్లకూర', 'వెల్లుల్లి రాత్రి' సమాజదృష్టితో వ్రాసినవే వేమన, వీరేశలింగాల ప్రభావం వీరి మీద పుష్కలంగా ఉంది. వితంతూద్వాహాన్ని గూర్చి ఒకచోట ఈలా వ్రాశారు.

జీవిత భాగస్వామిని మట్టిలో కలిస్తే
మళ్ళీ సుఖజీవనానికి
మగవాడికున్న హక్కు
మగువకెందుకుండకూడదు? (మనిషికి మనిషి-పుట 31)
నేరస్థుడి నేరం దాచరాని దన్నారొకచోట

'తడినేల మీద అడుగు జాడల్లాగ
అన్ని రజువులు అద్దుకుంటాయి అడుగుజాడల్లాగ'

ఇందలి ఉపమానం ఆలోచనా రమ్యమైంది. 'సంగి-నేల' అన్న కవితలో చీకటి (నల్ల)బజారును దుయ్యబట్టారు.



Sri Bhavanam Venkatram, Minister for Education, releasing a poetry book of Sri L. Malakondayya, Sri Avula Sambasiva Rao, Chief Justice of High Court of A. P., presiding, also seen Sri Devulapalli Ramanuja Rao.

ఆశాజీవి :

ఈయన ఆశాజీవి. ఎన్ని ఎగుడుదిగుడులు సమాజంలో ఉన్నా మనిషికి మనిషే చేదోడుగా ఉండాలని, సుఖమయ జీవనం ఏనాటికైనా సమాజం పొందాలని ఆశిస్తారు శ్రీ మాలకొండయ్య.

'మనిషికి మనిషి చేదోడు వాదోడుగా ఉండగలిగితే
మనుషుల మనసులు అమృత కలశాలు కాగలితే
మారదా మన లోకం!'

అని ఆశామయంగా పలికారు.
ఇందు స్పష్టత, క్లుప్తత కొట్టవచ్చినట్లు కనబడతాయి.

సోషలిజం :

ఎప్పటికైనా సోషలిజమే మనకు శరణ్యమని కవి భావన. అందువల్లనే కాబోలు కవితా వస్తువులుగా బెస్తవాళ్ళు, కొండవాళ్ళు, కారణ కరణాలు, చాకిరేవు శిక్షకలు గ్రహించారు. 'త్రాగుడు, సీసా' వంటివి దుర్వ్యసనాలు పోవాలని ఉద్బోధించే రచనలు. 'క్రాంతి పథం'లో కార్మిక కర్షకులను కవి ఉద్బోధిస్తాడు. శాస్త్రజ్ఞుడు – శ్రామికుడు ఇద్దరూ సమాజాని కవసరమని ఇంకొక కవితలో చాటారు.

'జీవిత యాత్ర లక్ష్యం
తోటివారి హృదయ ప్రమిదల్లో
వికాసపు వత్తులను వెలిగించడమే'

బంగారు నక్కులాంటి వాక్కు.
మలిన మనస్కుడైన మానవునికంటె జంతువుల జీవితమే నయం అని

'గోతులు తప్పని జీవితంలో' కవి వాపోతాడు. 'అజ్ఞానికి నిజం తెలుసు' ఖండిక పేరే ఎంతో సొబగుతో రుచిరంగా ఉంది.

ప్రజాకవి:

ప్రజలు పాడుకోనే భాషలో ప్రజాకవి చెప్పిన ఆదర్శాలివి!

కవితకు అంశాలు
సమకాలీనం కావాలి
సమాజ జీవితం ప్రతిబింబించాలి
వ్రాసింది సామాన్యుడికి అర్థం కావాలి
... ... ... ... ...
అనుభవాలకు అద్దంలో
అర్థం చూపడం కవనం - (కాలంవెంట కవి-పుట 91)

అల్పాక్షరాలలో అనల్పార్థ రచన :

విప్పితే ఊహా నేత్రం
సముద్రపు లోతును కొలువవచ్చు
ఆకాశపు ఎత్తును అంచనా కట్టవచ్చు
అణువును చీల్చవచ్చు (మనిషికి మనిషి)
ఎంతైనా వ్యాఖ్యానించవచ్చు సూత్ర పంక్తుల్లాగ.
'రూల్సు' మీద నడిచే ఆఫీసర్లు గుడ్డిగా ఎలా నడుస్తారో చెప్పారు
కాగితాలు 'రూల్సు' ప్రకారం
తిరగేసి సంతకాలు పెట్టేవాళ్ళు

'రూల్సు'కు మేలు చేస్తారేమోకాని
ప్రజలకు మాత్రం చెయ్యలేరు మేలు.
అక్షరాక్షరమూ సత్యమే.

సూక్తిసుధ :

అలతి అలతి పదాలతో కూర్చి సుందరంగా సూక్తులు చెప్పడం చూస్తే వేమన గుర్తుకు వస్తాడు.

'ద్వేషానికి మందు ప్రేమ'
'ఆకారానికి విలువ వలువ'

'స్నేహంలేని జీవితం ఎడారిలో మొక్కలాంటిది'
'వెలుగు నిస్తుంది మంచిపేరు మెరుగు తీగలా'
'దుస్తులు శరీరం కానట్లే, ఛందస్సు కాజాలదు కవిత్వం'
'అధికారం వజ్రంలా మెరిపిస్తుంది
ధరించే వారి, చూచే వారి కళ్ళను'

ఇలా కోకొల్లలుగా ఉన్నాయి. ఎంతటి క్లిష్ట భావాన్నైనా పండు వలిచి చేతిలో పెట్టినట్లు చెప్పడం వీరికి సైజంగా అబ్బిన విద్య.

సౌందర్యారాధన :

'అందాన్ని ఆరాధించాలి, ఆనందాన్ని ఆస్వాదించాలి' అంటున్న శ్రీ మాల కొండయ్య లలితపద విన్యాసాలతో సౌందర్యారాధన చేయడం సహజం. రమణీయ ప్రకృతివల్ల పులకించి కవిత చెప్పారు.

'కులూ' లోయలో కవి విహరిస్తూ వ్రాసిన రసవత్ ఖండిక 'భూలోక స్వర్గం'. బొమ్మ కట్టినట్లు చూపారు తమ కవితావర్ణంతో.

మంచే కరిగి మల్లెమొగ్గల మాలలై
పాలవెల్లువలై పారుతున్న జలపాతాలే
సన్నని తెల్ల పట్టుదారాల వలె
ఆ సెలధారలు శాంతి కాంతులై —(కాలంవెంట కవి-పుట 18)

'వెన్నెల కన్నె' అన్న మరో రచనలో కూడా అంతే.

ఆ పండువెన్నెల కన్నె కౌగిలిలో
వెల్లివిరిసిన జాబిల్లి చిరునవ్వులలో
ఉంచిస్తుంది తరుణ హృదయం
ఆలపిస్తుంది తరుణ హృదయం

అందాలొలికే వెన్నెల మేలిముసుగు
వ్రేలాడ వేసికొని కౌగలించుకుంటూ
నా మెడలో తెలి మల్లెమాలలు వేయాలని
శరవేగంతో పరుగులు తీస్తుందే

... ... ... ...

ప్రతిబింబిస్తున్నాడొక చంద్రుడు
తొంగిచూస్తున్నాడు నీటిలోనుండి
వంగి నమస్కరిస్తున్నట్లున్నాడు---(మనిషికి మనిషి)

ఉక్తి చతురత;

తక్కువ ఉన్నవారిని పేదలనేకంటే
ఎక్కువ కోరేవారిని పేదలనడం సముచితం
—(కాలంవెంట కవి - పుట 13)

సముచితంకాదు, అత్యంత సముచితం కాదా!

ఋతువు కొకదుస్తులు మార్చి రకరకాల ఆకులతో
రంగు రంగుల పుష్పాలతో కలకలలాడుతాయి చెట్లు
సృష్టికే కళనిస్తాయి వృక్షాలు—(కాలంవెంట కవి - పుట 50)

ఇలా ఎన్నో చూపవచ్చు.

మరొకచోట కఠోరసత్యాలను వెలికితెడుతూ—

కోరికలు కొనసాగడానికి
మారుతాడు మానవుడు దానవుడుగా!
చేస్తాడు చెప్పరాని ఘోరకృత్యాలు
చంపుతాడు నీతి నియమాలను
రూపుమాపుతాడు న్యాయాన్ని, ధర్మాన్ని—(మనిషికి మనిషి-పుట 6)

అంటూ సమాజదర్శనం చేశాడు కవి.

నవ్వుగుప్పించే కవితలు :

అతివల అందాల చందాలెలా మారుతున్నాయో చెప్పారొక ఖండికలో.

ముంజేతుల క్రిందకు రవికెలు
నింగిని తిలకిస్తూ
భుజాల పైకెక్కాయి!
ఎవరెస్టును గెలిచినంత గర్వంతో
బొడ్డుపైకి పోయిన చీరకట్టులు
పతనమై పోతున్నాయి
అజంతా సుందరులతో పోటీపడుతూ! —(మనిషికి మనిషి-పుట 3)

ధ్వనించిన జీవితంలోంచి ఉపమలు సృష్టించడం శ్రీ మాలకొండయ్య గారిలో కనిపించే ఒక ప్రత్యేకత.

> నిద్రలాగ, స్వార్థం మనిషిని
> ఏ నిమిషంలో పట్టుకుంటుందో తెలియదు
> స్వార్థం ఆవరించిన తర్వాత
> అదే పరమార్థమై కూచుంటుంది —(కాలంవెంట కవి - పుట 16)

అనువాద కవిత:

అనువాదం కత్తిమీద సాములాంటిది. స్వాతంత్ర్యప్రియుడు విశ్వకవి 'ఖలీల్ జీబ్రాన్' రచనలలో తమకు నచ్చిన - తాము మెచ్చిన కొన్నింటిని రమ్యంగా తెలిగించారు, "న్యాయానికి నోరు" అనేకవితాసంపుటంలో. మూలకవితను హేతువాదం - మానవతావాదం - సౌందర్యారాధన - ప్రకృతి-దైవం, నీతి న్యాయం వంటి రచనలు చదివి ప్రభావితులయి శ్రీ మాలకొండయ్యగా రాంధ్రీకరించారు. ఆంధ్రీకర్తకుకూడా వీనిలో కొండంత విశ్వాసం ఉంది. సుప్రసిద్ధ రచయిత 'నార్ల' అనువాదంలో విజయం సాధించినట్లు తీర్పు చెప్పినారు. శైలిలో మూలకర్తకువలెనే అనువాదకునకూ ఆడంబరాలు లేవు. యత్నించి అనుప్రాస క్రీడలు చేయడం వీరికి కిట్టదు. మచ్చునకొకటి రెండు కవితలు చూడండి.

> జీవితం వెనుకకు నడువదు
> నిన్నటితో ఆగదు కనక
> మీరే విల్లులు అయితే
> మీరు వదలిన బాణాలే బిడ్డలు
>
> ... ... ... ...
>
> అనురాగం దాహం తీర్చే ద్రాక్షారసం
> అలాంటి మృదుత్వం లేనిది కవిత్వం కాదు
> కవిత్వం కావాలి చిరునవ్వుకు ప్రతిమ —(న్యాయానికి నోరు)

మూలమును గుర్తునకు రానీని చిక్కని చక్కని అనువాద సరణి.

కవితాదర్శనం:

మానవత మరువవద్దని అడుగడుగునా హెచ్చరించిన ప్రజాకవి. 'స్పష్టతకు - సరళతకూ మాలకొండయ్యగారు పెట్టింది పేరు. సాధారణ అక్షరాస్యుడికి బోధపడే రీతిలో రచనలు సాగించారు. ఎంతటి మహత్తర భావాన్నైనా అక్లేశంగా చెప్పగల ప్రజ్ఞ' అని మహాకవి దాశరథి అన్నమాటలు ప్రత్యక్షర సత్యాలనటానికి వారి కవితలే సాక్షులు. మానవ హృదయంలోని మధుర వేదనలను పలు కవితా ఖండికలలో మాటలలో మూట కట్టినారు. జనరంజకమైన ప్రజాభాషలో కవితలల్లి పండిత పామరులను ఏకకాలంలో రంజింపచేయగల ప్రజాకవి ఆయన. వీరి కవిత ఒకప్పుడు కనువిప్పు కలిగించే రోచిస్సు. మరొకసారి మహోషస్సు. ఇంకొకసారి ప్రభాసరస్సు. ఇంకా ఉన్నతోన్నత శిఖరాలు కవితాలోకంలో అధిరోహించాలని మనసారా వాంఛిస్తున్నాను. ఇది వారి కవితాసరస్వతికి దిఙ్మాత్ర ప్రదర్శనం. ఒక విహంగావలోకనం మాత్రమే.

# స్వేచ్ఛా వాణి

—రావూరి భరద్వాజ

మంచి కవిత్వమంటే - నామట్టుకు నాకేమో కొన్ని 'పిచ్చినమ్మకాలు' ఉన్నాయి. అది చదవగానే, మెదడులో దీపం వెలిగినట్లుండాలి. శరీరంలోకి కొత్తనెత్తురు ఎక్కించినట్లుండాలి. మనకు తెలీకుండానే, జ్ఞానేంద్రియాలన్నీ ఓ సున్నితమైన చెటుకుతో, చైతన్యపూరితం కావాలి. కొన్ని క్షణాలపాటు అప్రయత్నంగా ఎగసినట్లుండాలి. ఇంకా, ఇంకా ఏవో, ఏవేవో జరగాలి.

కృష్ణశాస్త్రి, నండూరి, శ్రీశ్రీ ఆ పని మనచేత చేయించారు. వచనంలో, వచన కవిత్వంలో, చలం చేయించారు. ఈ 'మధువాణి'లో ఆదే పనిని, మాలకొండయ్యగారూ చేయించారు.

పారసీ భాషలో ఉమర్ 'రుబాయత్' ఎంతబాగా రాశాడో నాకు తెలీదు. ఆ పారసీ 'రుబాయత్'ను, ఫిట్జ్ గెరాల్డ్ ఏమేరకు అంగ్లీకరించాడో కూడా నాకు తెలీదు. కాని ఫిట్జ్‌గెరాల్డు ఆంగ్లకృతిని, మాలకొండయ్యగారు మాత్రం హాయిగా అనువదించారు.

రవీంద్రుడనుకొంటాను - కవితనుగురించి మాట్లాడుతూ. "Poetry is the shadow of poe'ts imagination" అంటాడు.

కవి తను దర్శించిన భావప్రపంచాన్నంతా అక్షరబద్ధం చేయలేడు. ఏ భాషకూ వొదగని భావప్రపంచం, దృశ్యప్రపంచం, ప్రతి కవిలోనూ అపా



Dr. Bezwada Gopala Reddy, releasing 'Manishiki Manishi', poetry book, written by Sri Malakondayya, who is seen reliting his poetry. Others sitting are Devulapalli Ramanuja Rao, Dr. Dasarathi and Dr. Bhoyi Bheemanna.

రంగా ఉండక తప్పదు. సమర్థుడైన కవి-తన మనో ప్రపంచాన్ని, సాధ్యమయి నంత విస్తృతంగా, మనోహరంగా, మనకు దృశ్యమానం చేస్తాడు. ఇక అను వాదమందే- ఆ శ్రమ అనుభవైక వేద్యం! మాలకొండయ్యగారు మూలంలోని ఏ అందమూపోకుండా అనుసరించారు.

ఉమర్ ఖయ్యామ్‌ను, పద్యాల్లోకీ, గీతాల్లోకి అనువదించినవారు చాలా మందే ఉన్నారు. మాలకొండయ్యగారు, ఆ మార్గంలో కాక 'వచనపద్యం' ఇందుకు ఎన్నుకొన్నారు. ఇలా ఎన్నుకోవడానికి వారు చెప్పిన కారణం ఇది—

"నేను స్వేచ్ఛాప్రియుణ్ణి. ఈ స్వేచ్ఛ-వైయక్తికరంగంలోనే కాదు; సాహిత్య రంగంలోకూడా ఉండాలని, నేను అభిలషిస్తున్నాను. ఖయ్యాం బోధిం చింది కూడా స్వేచ్ఛనే! (దాన్ని మనం 'విశృంఖలత్వం' కింద మార్చుకొన్నా మనుకోండి. అయితే, ఆ స్వేచ్ఛ ఎటువంటిదో, ఎంతటి ఉన్నతమయిందో, ఎంత సుసంపన్నమయిందో సామాన్య పాఠకునికి సులభంగా బోధపడదు. విష యమూ, అభివ్యక్తీకరణమూ కూడా, జటిలంగా ఉండకూడదన్న అభిప్రాయం తోనే, ఈ పద్ధతిలో రాశాను. ఖయ్యాం తత్వచింతనను, సామాన్య పాఠకుని చేరువలోకి నేనెంతమేరకు తీసుకురాగలిగితే, అంతమేరకూ, నా కృషి ఫలించినట్లే భావిస్తున్నాను" అన్నారు మాలకొండయ్యగారు.

కవిత్వం గురించి మాట్లాడటమంటే భయపడే నేను; "మాలకొండయ్యగారి కృషి ఈ మేరకు ఫలించింది" అనడం న్యాయంకాదు.

మీరు కవితాప్రియులు. ఈ 'మధు' వనంలో ప్రవేశించి, ఖయ్యాం వాణిని ఆలకించండి! తీర్పు చెప్పండి!!

# చూసిందే రాసింది

నేనెరిగిన మాలకొండయ్యగారు ఓ పథకం వేసుకుని కవిత్వం రాయరు ప్రభుత్వాధికారిగా ఆయన పనిచేసే శాఖల్లో ఎన్నెన్నో పథకాలనూ, ప్రణాళికలనూ నిర్వర్తించినా కవిత్వం దగ్గరకి వచ్చేసరికి ఆయన స్వచ్ఛందశీలి. ఒక్కసారి ఈ సంపుటిని తిరగేస్తే నేనన్న విషయం రుజువవుతుంది.

పువ్వును సంబోధిస్తూ ప్రారంభమైన ఈ సంపుటి మృత్యువివేచనతో ముగుస్తుంది. అసలు ఆ శీర్షికలు చూస్తేనే ఇందులోని వైవిధ్యం పుష్కలంగా కనిపిస్తుంది. ఆకాశకన్య, ఆంధ్రవ్యాసుడు, అందాల దొంగ, అలితో అబద్ధం, గోవా గొప్పలు, డార్జిలింగ్ డార్లింగ్, పాపం పుణ్యం, హతం కతం— ఇలాఇలా.

మాలకొండయ్యగారు లోకంలోని ప్రతిసంఘటనకూ, అగుపించిన దృశ్యానికీ స్పందించే గుణమున్న నాజూకు మనసున్నవారు. చివరికి తాము ఉన్నతాధికారిగా వుంటూనే కార్యాలయాల ఫైళ్ళ మడతల్లో మగ్గే ప్రజల అర్జీల గురించి ఇలా వ్రాస్తున్నారు—

"కలాలు వ్రాస్తూనేవుంటాయి తీరిక లేకుండా
కాగితాలు పెరుగుతూనే వుంటాయి
జూజుకంబళి కప్పుకుని ఆఫీసు అల్మారాల్లో
ప్రజల గోడులు పడివుంటాయి అలాగే"

ఇది కాల్పనిక కవితా సత్యం కాదు. ప్రతిదిన ప్రత్యక్ష పరమ నగ్నసత్యం. మాలకొండయ్యగారి ప్రవృత్తి కల్పనకంటే శిల్పంకంటే వాస్తవికతపట్ల, సచ

గాఢ వ్యక్తిపట్ల మొగ్గుచూపుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ అభివ్యక్తి వచన సూక్తిగా మారిపోతూ వుంటుంది. అయినా కవితాస్పర్శ ఉన్న కలం అస్తమానం సూక్తుల్నే ప్రసవించదు. గుండెను హత్తుకుపోయే ఆలాపనలను కూడా ప్రసవిస్తుంది చూడండి ఈ సంపుటిలోని 'కాలం కుంచె'లోని కొన్ని పంక్తులు—

"తెరపు ఇసుకపై
ప్రాణాను బాధలగాథలు.
అలల వెల్లువలు
హత్తుకున్నాయి వాటిని హృదయానికి.
కడిగివేశాయి నాలోని కల్మషాన్ని."

ఇందులోని తీరం కాలప్రవాహం ఒడ్డు. అలలు సంఘటనలు. బాధలగాథల్ని అవి లోబరుచుకున్నాయి. కవిగుండె కడిగివేసినట్టయింది. ప్రశాంతత. సమచిత్తత.

ఈ సంపుటిలో అక్కడక్కడా మెరిసిన మెరుపుల్ని ఈపీఠికపైకి ఎక్కించడం నా అభిమతం కాదుగానీ అందరూ అనుకునే ఒక సార్వజనీన సత్యాన్ని మిత్రులు మాలకొండయ్యగారు ఎంత ఆప్తంగా చెప్పారో చూడండి.

శీర్షిక 'ప్రత్యక్ష దైవం'.

"దేవుడు సర్వత్రా
ప్రత్యక్షం కావడం
దుర్లభం కనుక—
ఎల్లవేళల పిల్లలకు దైవంగా
తల్లిని సృజించాడు."

ఇది ఒక సుపరిచిత సుప్రతిష్ఠిత సత్యానికి చేసిన వ్యాఖ్య.

పాలకొండయ్యగారు కవిత్వం నిర్మించడానికి ప్రయాస పడ్డట్టు అనిపించదు. అలవోకగా వెలువడిన అభిప్రాయాలను, అంత సూటిగా అందరికీ అర్థమయ్యే శైలిలో చెప్పాలనే తపన ఉన్నవారు. వారి ఈ తపన రానురాను కవితా రూపంలో మరింత చిక్కబడి వెలువడుతుందని ఆశిస్తున్నాను.

—డా॥ సి. నారాయణరెడ్డి
అధ్యక్షులు
అధికారభాషా సంఘం

# "మాలకొండయ్య మాట నిజం"

రేట తెలుగులో సూటిగా సీటుగా గద్యాన్ని పద్యంగా మలచే గడుసు దనము మాలకొండయ్యగారి ప్రత్యేక శిల్పం.

కవిత్వానికి ఎన్నో నిర్వచనాలు. ఎందరో ఎన్నో విధాలుగా విశ్లేషించారు, వివరించారు.

"వాక్యం రసాత్మకం కావ్యం"

"చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
కలిగినను సౌరభముఁ జలువయు దలిర్పం
బోలు పెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభము జలువ పసయుం గో
మలతయును గలిగి జనముల మిగుల బెంపెసఁగ
మలయ పవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మరి కలదనఁగవచ్చుఁ గడు
వెలయఁగల యీ సుకవి పలుకులను నెంచన్."

"పూత మెరంగులున్ పసరు
పూప బెండగులు జూపునట్టి వాకై తలు
జగ్గు నిగ్గు నెనగావలె ...............
దా తొడ డున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ వాకటిన్

కమ్మని వాతెర దొంతపంతువలె
వాచవి గావలె పంటమాదినన్"

"హరచూడా హరిణాంక వక్రతయు కాలాంత
స్ఫుర చ్చండికా వరఘు ద్ఘాఢ పయోధర
స్ఫుటతటీ పర్యంత కాకిన్యమున్"

"నత్కావ్యము దిక్కులన్ సరసత్వంబును సంభవించెననగా
చిరకాలంబు నటించు అవిరాజీ గేహ రంగంబులన్"

ఇలా ఎన్నో విధాల కవిత్వ ప్రయోజనాలను ప్రవచించారు.

కవిత్వతత్వంలో నవీన యుగంలో విశ్వసాహిత్యంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆంధ్ర వాఙ్మయంలో ఎన్నో విప్లవాల పోకడలు ప్రతిఫలించాయి. తత్ఫలితంగా సులక్షణసారముతో నిమిత్తములేని సలక్షణ వచన కవిత్వ సాంప్రదాయం నేటికి మేటిగా ప్రాముఖ్యాన్ని, ప్రాభవాన్ని, ప్రచారాన్ని పొందింది. వచన కవితకు స్వంత రాగం, స్వంత తాళం, స్వంత బాణీ సంపాదించుకొన్న వారిలో మాలకొండయ్యగారు ఒకరు. ప్రౌఢ సమాస విన్యాసాలు కాని పాండిత్య ప్రకర్ష గాని, నర్మోక్తులు, వక్రోక్తులు, అలంకార ప్రయోగము అవసరములేని సగటు పాఠకుడు సంపూర్ణంగా పరిగ్రహించ గలిగే కవిత వీరి ప్రత్యేకత.

"ఒకనాటి వ్రాతలు" ఖండికలో తన కవితాశయాన్ని కొట్టవచ్చినట్లు చెప్పారు.

"వ్రాశారు కావ్యా లనేకాలు
గీశారు గీతలు చాలా

అందున్న సారాంశమేమిటి ?
ఆడదాని అంగ వర్ణన
కాళ్లు చెవులు లేని కట్టు కథలు..........."

" అన్నిట్లో అతిశయోక్తి మిన్న
అనుభవ దూరమైన వ్రాతలు
ఆపైగా అన్నీ అనువాదాలు ! అనుకరణలు !
అయినా చేశారు సాహిత్య సేవ
మరచారు మానవ కల్యాణం........."

"కవి - అక్షరం" అన్న ఖండికలో:

" కాలం ఇక్కడ, కవి ఎక్కడో కాకుండా
పదంతో గళం కలిపి
కలంతో కదం తొక్కేలా
అక్షరమా నమకూర్చు
సతి గమల తోరణాల నమాధానం
ప్రజా శ్రేయస్సు కాధారం. "

"కలం - గళం" అన్న ఖండికలో:

" కదం తొక్కుతుండే కలం
పదం పాడుతుండే గళం
కాదా కవిత్వం ... ... ... ...
... ... ... ...
పొందలేదా కవి అమరత్వం "

వచన కవితలో కూడా పంచనా శిల్పానికి పాల్పడే మహానభావు లెందరో! అర్థం కాని అయోమయమైన ఊహల రూపకల్పన

"అగమ్యతమో రహస్యాంగణాలలో"

అంతర్ధానమయే పద్ధతిలో కాక లలితమైన భాషలో సహజంగా, సాకల్యంగా చెప్పడం ఈకృతి, ప్రతీ ఖండికలోను వినిపిస్తుంది, కన్పిస్తుంది.

ఉదాహరణకు "ప్రేమ" అనే ఖండికలో:

"తప్పొప్పుల జాబితా వేయకుండా
మనిషిని మనిషిగా ఒప్పుకోవడమే ప్రేమ..."

—ప్రేమకు నిర్వచనం.

"అబద్ధానికి ఉన్న విలువ
భార్యలముందే కాక
ఎవ్వరిముందూ ఎన్నడూ
నిజానికి లేనేలేదు!
మరి ఆలితో అబద్ధం ఆడకుంటే
కాదా సారంలేని సంసారం!"

ఇది "ఆలితో అబద్ధం" అనే ఖండిక.

"మనిషికి దేవుడు మనిషిలా ఉంటే
చీమకు, దోమకు ఎలా ఉండాలి?"

"దేవుడు – మనిషి" అన్న ఖండికలోనిది.



*Sri Malakondayya presenting tiger cubs (caught during his Shikari as Collector, East Godavari) to the Nehru Zoological Park*

"పనిని పూర్తిచేయటమే విశ్రాంతి
సమయాన్ని సరిగా ఉపయోగించడమే విశ్రాంతి
అవసరమైన విశ్రాంతి జీవితానికి క్రాంతి !"

" విశ్రాంతి - క్రాంతి " అనే ఖండికలో.

" ఆఫీసర్ల నెందరినో వేశారు
ప్రమోషన్లు ఎందరికో వచ్చాయి
కాగితాలకు సిరాలకు ఖర్చులు ఎన్నో పెట్టారు.
కలాలు వ్రాస్తూనే ఉంటాయి తీరిక లేకుండా
కాగితాలు పొదుగుతునే ఉంటాయి
బూజు కంబళి కప్పుకొని ఆఫీసు అల్మారాల్లో
ప్రజల గోడులు పడి ఉంటాయి అలాగే
పేదవాళ్ల కోరికలు మూలుగుతూ ఉంటాయి చిరస్థాయిగా !"

" నల్ల దొరలు " ఖండికలో.
" అత్తల దృష్టిలో కోడళ్లు కొంటె వాళ్లైనా
మనుమళ్లు మహానుభావులే !"

" అత్తలు - కోడళ్ళు " ఖండికలో

" నేటి ప్రపంచంలో
అన్నీ అద్దెకే
చివరకు పెళ్లి, పెళ్లాం, పిల్లలు
అద్దెకు కావాలంటే
అలుసుగా దొరికే రోజులొచ్చాయి !"

" అన్నీ అద్దెకే !" అన్న ఖండికలో

" విమర్శను విశదంగా పరిశీలించాలి
ఆలోచించాలి అందులోని అంశాలను
నేర్చుకోవాలి పాఠం
విమర్శ వల్ల
మంచి మాటలు మనలను
సంతోష పరుస్తాయి
కానీ ఆలోచనలకు
అభివృద్ధి కీ అడ్డుగోడలుగా నిలుస్తాయి"

" అడ్డుగోడలు " అనే ఖండికలో.

" గురిలేని కాల్పులకు
అర్థం లేని నరుకుళ్లకు
ఆహూతి అయినారు
అమాయక ప్రజలు
అర్థమేమిటి దీనికి
ఆ మతంలో ఒకడు హతం
ఈ మతంలో ఒకడు ఖతం
అని తప్ప ? "

" హతం – ఖతం " అన్న ఖండికలో.

" మంచిగా మనసులతో నువ్వు
మనిషి నిన్ను మక్కి చూస్తే ఒట్టు
తిట్టు, కొట్టు, తిప్పలెన్నో పెట్టి చూడు
ప్రతి దినం నీకు పూజ చెయ్యకుంటే ఒట్టు "

" వేటి సమాజం " అనే ఖండికలో.

" అందరినీ మెప్పించడమే ఆశయమైతే
ఎవరినీ నొప్పించ రాదనే సూత్రముంటే
పరిపాలన సాగే దెలా ?
సంసారం చక్కబడే దెలా ?
అధికారం అంతా స్వంతానికే అయితే
అవకాశాలన్నీ బంధుమిత్రులకే అంకితం అయితే
పేదల బ్రతుకుల ప్రమిదెలు వెలిగేదెలా?
బీదల కడుపులు నిండేదెలా? "

"కన్నులు అద్దెకు ఇస్తే" అన్న ఖండికలో.

ఇలా అక్కరకురాని మాటకాని, అర్థంకాని, భావం కాని లేని ఖండికల సంపుటి— తప్పని మంగింపు.

అందమైన ఆటవెలదిలో అందరికీ అర్థమయ్యే దేశకవితలో తెలుగునాట వేమన నాటిన కవితా సాంప్రదాయాన్ని సమన్వయం చేసుకొని సహజంగా వ్రాశారు మాలకొండయ్యగారు. " మాలకొండయ్య మాట నిజం " అనే మకుటంతో వ్రాస్తే బాగుంటుందేమో !

— ఇ. అయ్యపు రెడ్డి
న్యాయవాది మరియు ఎం.ఎల్.ఏ.

# శ్రీమాలకొండయ్యగారి పుస్తకాలు - పరిశీలన!

కవితాదృష్టి, కరిగే హృదయం, భావావేశం, భాషాజ్ఞానం వుంటేనే అక్షరాలు పుడతాయి. ఆ అక్షరాల పరంపర కవితలు కావొచ్చు, కావ్యాలు కావొచ్చు, కథలు కావొచ్చు, రాగాలు చేదుకున్న గేయాలు కావొచ్చు! మాలకొండయ్యగారిలో అది పుష్కలంగా వుందనే చెప్పాలి. అసలు జుట్టుంటూ వుంటే, జడల్లుకోవచ్చు, కొప్పెట్టుకోవొచ్చు, విరబోసుకోవచ్చు, ఏమైనా చెయ్యొచ్చు. అలాగే భాషా సంపద కలిగివుంటే, చెమ్మగిల్లే గుండె వుంటే, కలం కదలడంకాదు-కాలంతో సమానంగా పరుగెడుతుంది. 'జీవిత వలయాలు' లో మొదలు పెట్టి, 'మనిషికి మనిషి' లో ఎదిగి 'కాలం వెంట కవి' గా పరుగులు తీశారాయన.

ఇందులో ప్రతి రచనలోనూ ప్రణాళికాన్ని తలచి, తరచి, కొలిచి పిలిచే స్పందన, ప్రతి గేయం అందంగా అమర్చిన తీరూ అగుపిస్తుంది. రచయిత యొక్క పరిశీలనా శక్తి, విమర్శ, మనోహరమైన కల్పన, పాఠకుడిను పఠింప జేస్తాయి. 'నిన్న-నేడు-రేపు' అంటూ గేయం వేదాంతం, 'సమాజం సౌఖ్యవంతమయ్యే దెన్నడూ?' అంటూ తపన, 'కళ్లు తెరచి లోకాన్ని చూడు, కళ్లు మూసుకొని నిన్ను నువ్వు చూడు అంటూ 'చవి చూడు'లో హెచ్చరిక, 'పోరాటం' లొ ఆవేదన, 'ఉత్సాహం' లో ఆశ. ఇలా ప్రతి సంఘటననూ తర్కించి, సంఘర్షణకు ద్రవించి రచించిన గ్రంథం 'కాలం వెంట కవి'-మాలకొండయ్యగారి పుస్తకాల్లో మణిపూసే !

'పాపా నీకు తెలుసా?' పుస్తకం, పసిపాపల పాలమనసులాగా,

జాబిల్లి పల్లెకాంతి లాగా, విజ్ఞానంతో, వినోదంతో కూడిన కవితల సంపుటి! 'మిత్రులు లేని జీవితం, ఎడారిలో మొక్కలాంటిది, స్నేహంలేని జీవితం, చమురులేని దీపం లాంటిది' అంటారు 'మిత్రులు' అనే కవితంలో కవి! 'పిల్లలు - పెద్దలు' అనే కవితలో 'ప్రతి పెద్దలోనూ ఒక శిశువు దాగి వున్నట్లే, ప్రతి శిశువులోనూ ఒక పెద్ద అణిగి వుండడం సహజం '- అంటారు. ఇది ఎంతటి సత్యం! ఈ సత్యాలు గ్రహించాలంటే లోకజ్ఞత, గొప్ప పరిశీలనా శక్తి కవికి కావాలి! ఆ రెండూ సమపాళ్లలో ఉండబట్టే, మాలకొండయ్యగారు మంచి కవి అయ్యారు! అంతే కాదు! ప్రజాకవయ్యారు!

వీరి గేయాల్లో ఆకాశవాణి ద్వారా, అనేక సంస్థల ద్వారా ఆలకింపబడ్డ గీతాలు బహుళ ప్రజాదరణ పొంది, కవికి కొత్త ప్రేరణ కలిగించాయి. అలా ఉదయించిన పాటల్లో ఒక వస్తువనీ, ఒక భావమనీ కాదు, అనేకానేక వస్తు వైవిధ్యంగల పాటలు వెలువడ్డాయి వీరి కలం నుంచి. మాధవ గీతాలు, మానవతా గీతాలు కలబోసుకుని పలుకరకాల పాటలుగా ఈ సంపుటిలో పలుకరిస్తూంటాయి. రసరమ్యంగా ఇందిరామణిగారు, హంసధ్వని రాగంలో వీటిని పొందుపరచి, పాటలకు ప్రాణం పోశారు. కిన్నెర వారి ప్రార్థనా గీతంతో పాటు, మరెన్నో గీతాలు, ఎన్నెన్నో రాగాలతో లయబద్ధం చేయబడ్డప్పటికీ, మొదటి పాటకు అమర్చిన హంసధ్వని రాగాన్నే ఆకావ్యానికి నామకరణం చెయ్యడం ముదావహం!

ఏ విషయాన్నైనా అతిగా పొగడటం నాకు చాతకాదు. ఉన్నది ఉన్నట్టు కుండ బద్దలుకొట్టినట్టు మాట్లాడటం నాస్వభావం. అందుకే ఇంకొక్క మాట మాత్రం చెప్పి ఈవ్యాసం ముగిస్తాను.

శ్రీ మాలకొండయ్యగారి రచనల్లో పాండిత్య ప్రదర్శన కంటే పండిత పామరులకు సూటిగా కవిమనోభావాలను వాడుక భాషలో అందివ్వాలన్న ప్రయత్నం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అది పాట కావొచ్చు! కవిత కావొచ్చు, కవి చెప్పదలుచు కున్నది, స్పష్టంగా చెప్పినప్పుడే అది ప్రజల్లోకి పోతుంది

ఆదరణ లభిస్తుంది. అంతేకాదు, కవి ప్రయోగానికి సార్థకత దొరుకుతుంది! మాలకొండయ్యగారు అలా ప్రజల్లోకి చొచ్చుకుపోయారని చెప్పడానికి సంతోషిస్తూ, వారింకా అలాగే ముందుకు మునుముందుకు సాగిపోవాలని కోరుకుంటూ, నాకీ అవకాశం కల్పించిన భావన సంస్థకి నాకృతజ్ఞతల తెలుపుతున్నాను.

— శారదా అశోకవర్ధన్

ఉపాధికోసం ఉద్యోగాలుచేయడం పరిపాటి. కాని కొన్ని కొన్ని ఉద్యోగాలలో సాహిత్యసేవ, సంఘసేవా, ఇంకా చెప్పాలంటే మానవసేవా చేసే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఆ బలమంతా పదవులలో నుంచే వస్తుంది. వారు చెయ్యవలసినదల్లా తమ హృదయాన్ని ఆ సేవకు అంకితం చెయ్యడమే. అలాటి సేవాహృదయం ఏ కొద్దిమందికో మాత్రమే వుంటుంది. వారు తమ పదవులను భావ బంధురం చేసుకోగలిగితే ఎంతో కీర్తిగడిస్తారు-ప్రజల మన్నన లదుకొంటారు. వారిపేరును చిరస్థాయి చేసుకుంటారు. ప్రజల హృదయాలలో చిరుజ్యోతులు వెలిగిస్తారు. ప్రజాసాహిత్య సంస్థలలో చిరుగంటలు మోగిస్తారు.

అలాటివారిని ప్రజలు ప్రత్యక్షదైవాలుగా భావిస్తారు. పూజిస్తారు. వారిపైన వెన్నెల జల్లులు కురిపిస్తారు. మాలకొండయ్యగారిపైన అలా కురిసిన కవనాల జల్లులు ఇవి. —

# భాషా బంధువు

మాలకొండ సుధీమణిన్, శం
పాలతా భు మనస్వికిన్, రస
లాల సాంచిత ధీనిధిన్, గుణ
లోల చారిమ హేతువున్, కవి
తా లసత్ సువిలాసునిన్, బుధ
మాలికా సుమ సౌరభున్, సత్
కళల ప్రోచు రసజ్ఞునిన్ - కవి
వలయ మధ్య నివాసునిన్
వచన కవితా నీరధిన్, మృదు
వచ స్సౌరభ సంభృతున్, ధీ
రుచి ర సత్ పరిపాలకున్, భా
షా చిరంటీ సేవకున్ - సా
హిత్య గౌతమి పాలకున్ - నిజ
భృత్య భృంగ మరందునిన్ - సౌ
హిత్య మొదిగిన సౌహృదున్ - తా
నిత్య భాషా బంధువున్
కొనియాడ నేరక యున్నచో, బుధ
మనః కుంజము వాడదా ? రస
రాజధానిగ 'కాకినాడ' కు
తేజ మొసగె కలక్టరై.

— పోచిరాజు శేషగిరిరావు

# ఆంధ్రీ రమ్య దీపింపగా!

శా॥ సల్లోకంబులనిండి నిండు మహమై
పూర్ణ ప్రభావాఢ్యమై
అల్లాయేసును క్రీస్తు రాముఁడును కృ
ష్ణాఖ్యుండ టంచున్ యశో
సల్లల్ పెంచిన యేకమై వతము న
ర్మ్య శ్రేయముల్ గూర్చె సం
సల్లాభంబుల తోడఁ బ్రోచుత భవ
ద్భాషా మ తల్లిన్ సదా ॥

మ॥ ప్రియ లక్ష్మీ రమణీ సమేత ! పరమ
ప్రీతిన్ వసంతాఖ్య వా
జ్మయ లీలా మధుమంతమై పరమ ర
మ్యం బైన యీ రాత్రిఁ గ
ప్రమ యశోమూర్తి మదాంధ నత్కవి కదం
బంబుజ్వాలాశీర్వచః
ప్రియ నాదంబు లొనర్చు నందఱికి నాం
ధ్రీరమ్య దీపింపగన్॥

తే॥ తెనుఁగు పొలాలు దున్ని మను
దియ్యని కావ్య ఫలాలు గూర్చి పం
చెను రస లోకమంతటికి.
శ్రీ కరుణానిధి మాలకొండయా !
వినుత రసార్ద్ర కావ్యమిది !
విశ్వహితమ్మగు ; మేటి కావ్యముల్
బొనరిచి గాంచుమా సకల,
భూనుత కీర్తి ప్రశంసలిమ్మహిన్

— జి. యం. శర్మ

# వీడ్కోలు పద్యములు

జీవితవలయాల గ్రంధకర్త, రచయితలకోవకు చెందిన శ్రీ యస్. యం. కొండయ్య, యం.యే., ఐ.ఎ. యస్., P.G. Dip. Naples, G.R. Dip. రష్యా, తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు, కాకినాడనుండి ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదుకు పరిశ్రమల డైరక్టరుగా ట్రాన్స్ఫర్ అయిన సందర్భమును పురస్కరించుకొని, కవులు, రచయితలు ది 29-4-72 న జరిపిన వీడ్కోలు కూటములో చదువబడిన పద్యములు.

కం॥ చెలిమి కవకాశమియ్యని కలెక్టరుల గాంచినాము గతకాలములో
కలివిడిగ ప్రజల మధ్యను మెలగిన యుత్కృష్టకీర్తి మీకే దక్కెన్॥

కం॥ పిల్చించి కవుల నందఱి నల్పాహారంబు విందు నందున ప్రభువుల్
తెల్పిన లక్ష్యము తెల్లన్ కల్పాంతము వఱకు నిల్చు కవుల యెదలలో॥

కం॥ బదిలీ మీకని వినగా హృదయంబులు కలతజెంది రేయింబవలున్
పెదవులకు మూత పడగా నిదురింతయు పట్టదయ్యె నిశలందు సహా॥

ఆ.వె॥ మండలాధిపతిగ మామండలంబున మీరొనర్చినట్టి మేటి సేవ
కెఱ్ఱ శిలువ సంస్థ యియ్యనై యున్నట్టి బంగరు పతకంబె ప్రజల
సాక్షి॥

కం॥ సేవా భావము మీలో స్థావరమేర్పర్చుకున్న సంతోషముతో
భావుకులంతా మిమ్మును సేవించుట నిశ్చయంబు చిత్తంబులలో॥

ఆ॥వె॥ వీధులూడ్చువారు వెవరెంచి యొక్కెడ సమ్మెకట్టినట్టి సమయమందు
చేతబట్టి వెదురు చీపురు, చేటయు, నడుము కట్టలేదె? తుడుపు పనికి॥

గీ॥ రాష్ట్రపతకంబు గొన్నట్టి ప్రముఖులందు మొదటివానిగ పేర్గన్న
బుధుడవీవు
కేంద్రమునకును కీర్తిని గూర్చగల్గు చేవదేరిన ప్రజాసేవకుడవు॥

గీ॥ కందుకూరి వీరేశముకవినిబోలి ప్రజలకవసరమైనట్టి రచన జేసి
వెట్టి మొట్టి యాచారాల వెడలనంపు సంఘ సంస్కర్తగా
మిమ్ము సన్నుతింతు॥

గీ॥ దండగా పూల గుచ్చిన దారమునకు సుమల సౌరభ్యమొక్కింత
సోకినట్లు
సంఘసేవలో మీయొక్క సాధ్వీమణికి చాలినంతగా నభిలాష
సంక్రమించె॥

గీ॥ దైవగుణములైన దయయు, దాక్షిణ్యంబు నెన్నదగిన జ్ఞానమున్న
కతన
సాధ్వి మీరు కలిసి సాగించుచున్నట్టి ప్రథిత సేవకు మిము
ప్రస్తుతింతు॥

"దీనబంధు నిలయము" మాతృభాషా సేవకుడు,
గాంధీనగరము, కాకినాడ-4. మధురకవి, గొల్లపల్లి జేమ్సు శామ్యుయెల్

# హితుడా! స్నేహితుడా!

మనసులు కలిసిన
మానిసి మనలవీడి
దూరంగా వెళిపోతున్నప్పుడు
హృదయం ద్రవిస్తుంది
నయనం చమరుస్తుంది !
హృదయాన్ని హృదయం చూరగొంటుంది
మనస్సుని మనస్సు
చేరబిలుస్తుంది !
కాలం మనల్ని దూరంచేసినా
కవిత్వం మనల్ని దగ్గరకు చేరుస్తుంది !
చల్లని పిల్లగాలులు
మెల్లగా వీచునపుడు,
ఉల్ల మలరే మంచి వాక్కుల
మల్లెలు మామధ్య విరిసినపుడు
చర్చిస్తాము నీకావ్యాన్ని గూర్చి
అర్చిస్తాము నీకవితాకన్యలను బంగరుపీఠాన్ని చేర్చి.

మాతో చిరకాలం కవితా
వ్యవసాయంచేసిన కృషీవలుడా!
హితుడా ! స్నేహితుడా!
పలుకులరాణి వాణి
నీగుండెల నెలకొన్న వేళ
మాలకొండయ కవీ!
నీహృదయమే కవనమై ప్రవహించుతే !
నీ కవితలో రంగులే ప్రసరించుతే !

— ఎస్. ఎ. పద్మనాభశాస్త్రి

# సైసై మాలకొండయ్యా

సైసై మాలకొండయ్యా
నీ పేరే బంగారు కొండయ్యా ...... సైసై

జిల్లా ధర్మపాలనమే సాగించినారు
అధర్మ రీతులెన్నో హతమార్చినారు
అన్యాయాలెన్నో అరికట్టినారు
ప్రజాహిత కార్యాలెన్నో సాధించినారు...... సైసై ...

పరభాషలెన్నో నేర్వగల్గారు
పుస్తకాలెన్నో వ్రాయ గల్గారు
నాటకాలెన్నో వేయించినారు
కవుల నెందరినో ఆదరించారు ...... సైసై ...

బడుల భవనాలెన్నో కట్టించారు
ఆఫీసర్ల క్లబ్బునే స్థాపించారు
బోటు క్లబ్బునే ప్రారంభించారు
కల్చరల్ ఫెడరేషన్ నిలబెట్టారు ...... సైసై ...

విజ్ఞాన వికాసాలే విరజిమ్మినారు
వీరేశలింగ జయంతులే నడిపించారు
యుద్ధ విజయోత్సవాలే జరిపించారు
యుద్ధనిధినే వృద్ధిచేశారు ప్రజల ప్రేమనే చూరగొన్నారు...
సైసై ...

గడియారము కన్నా మీనడకయే మిన్నయ్యా
కొండయ్యా మీగుండె నిండయ్యా
మీకు మా నిండిన గుండె దండలయ్యా
సరస హృదయా నవరస సదయా...... సైసై ...

విరివిగ ఛలోక్తులే విరజిమ్మినారు
దండిగ చతురోక్తులే దంచేసినారు
అందంగ లోకోక్తులే అందించినారు
నవన కవిత్వానికే కరువు తీర్చారు ...... సైసై ...

— శ్రీ జి. రామకృష్ణయ్య,
జిల్లా విద్యాశాఖాధికారి, కాకినాడ.

# ప్రశంస

కవికిలేదు ముక్తి కవికి లేదుర! భుక్తి
కవిని జూచువాడు కానరాడు
కవియగుటగనంగ కావ్యపు శాపమా?
వింజమూరి రామ విజయనామ

ఇక్కడ-

మాలకొండవరుడు మంచి కోవిదు డౌట
మాలకొండ మీకు మేలుకొండ
మాలకొండ దరయ మార్గదర్శకుడురా
వింజమూరి రామ విజయనామ

గాయకుండౌ కవియు 'గ్రామ' నాయకుండో మ
హా త్రజనులగాచు ఆర్యవరుడౌ
అంత తానె యగుచు ఆవేశముగ జేయు
వింజమూరి రామ విజయనామ

కలియుగాన కవుల కల్పభూజంబయ్యె
కాకినాడ కవులు గర్వమొంద
స్వంతముగనె నేడు సభకు రమ్మన్నాడు
వింజమూరి రామ విజయనామ

కవిగనెంచి మనకు గబురంపె మర్యాద
కావ్యరచన పరత సవ్యసాచి
కలుషరహితునతని భగవతి ప్రోచుత
వింజమూరి రామ విజయనామ.

— వింజమూరి రామరావు

# మానవత్వమే మతం

మానవత్వమే మతమని ఎంచిన
మహనీయుడవు నీవు
దీనులపాలిటి దీనబంధుగా
ఖ్యాతిని గాంచితివయ్యా
నిరుపేదలపై కనికరముంచిన
కరుణామయుడవు నీవు
లేరోయి ఇల నీసాటెవ్వరు
త్యాగశీలుడ వీవు.

ఇన్ని నాళ్ళుగ-మాలో తిరిగి
కన్న తండ్రిగ మెలగి
పేదప్రజల బాధలెన్నో
తీర్చి మరిపించినావు
నిండు ప్రేమతో చేసితివయ్యా
మెండుగ మేలుల నెన్నో
దైవమె నిన్ను ధరలో కాయును
తోడునీడగ నుండి

— డి. సంజీవరావు

# మా హృదిలో బందీ

ఏడుకొండలవాడు ముడుపులనుగొని మ్రొక్కులనుతీర్చు
మా(ల)కొండయ్య తీర్చు మక్కువనూపి మ్రొక్కినవాలు
ఏమి ప్రజాసేవ్యమ్మువో ఇది; నచ్చినవానిని ఈయరు
ఎటులిత్తురు మరి, పలువురుకోరిన గోపాలుని.

దండకారణ్య కోనలలో విహరించిననాడు
పాపికొండల నడుమ పారాడిననాడు
సతి సమేత కో(ద)ండయ్య వెనువెంట తిరిగిననాడు
స్వామి మమ్ము కపిగాగాను సోదర లక్ష్మణులుగా చూసె.

ఏతేటలో జలకములాడిననాడు
ఎవరనుకొంటిమి మీరు కలెక్టరని?
ఈనాడు సార్థక నామధేయులైతిరి
ఈ మా మనముల కలక్టు చేసుకొని.

ఏమని కోరుదుము మేము పొమ్మనవలదన
ఏమారిన మామనసుల గొనిపోవద్దన
ఏదియుగాదు; చెలికానిగ కలకాలము
ఏతావున మీరుండిన మా హృదిలో బందీరే.

మా(ల)కొండయ్యను, సతి లక్ష్మిని
మము మరువకుండ దీవింపుము
మాలక్ష్మిని బొందిన వానికేమిచ్చెదవు?
మరి నూరేండ్ల జీవితమీయుము (మహదేవా).

— జె. కృష్ణమూర్తి
కెమేరా క్లబ్ సభ్యులు.

# మానవసేవే మాధవసేవ

పరమకృతజ్ఞభావమున స్వాగతమిచ్చెద మెల్లవారమున్
సరసులు మెచ్చ మండలము సర్వసుఖంబుల వృద్ధి నొందఁగా
స్థిరతరదీక్ష మానవులసేవయె మాధవసేవయంచు సం
బరముగ నిర్విరామకృషి వర్తిలు మాండలికాధికారికిన్.

కమనీయంబగు నీదు దర్శనము వేడ్కం గూర్చె మా కెల్ల నీ
విమలోదారమహోపకారము ముదావిఖ్యాతిఁ గల్గించె; నీ
సుముహూర్తంబున శంకుపున్ నిలిపి యిచ్చో పాఠశాలామత
ల్లి ముదంబార నొనర్చు మాన్యునకు నర్పింతున్ నమోవాకముల్.

లలితస్వాంతులు బాలబాలికలు, లీలాశారదానాట్యమం
జులరంగస్థలపుష్పవల్లికల రోచుల్, నవ్యవిజ్ఞాన దీ
ప్తులు, భావ్యభ్యుదయంబుఁగోరిన మహాత్మున్ నిన్నుఁగీర్తింత్రు; ని
స్తుల సంతోషకృతజ్ఞతాభరితచిత్తుల్, వీరి దీవింపవే!

ఎల్లన్ బాలురు వృద్ధినొందుటకు సాహిత్యార్జనావేశయం
దుల్లంబుల్ ముదమంద నూత్నభవనం బొప్పారఁ గట్టింపఁగా
నుల్లాసంబున వచ్చి యింజరపురం బుప్పొంగఁగాఁజేయు నీ
జిల్లాపాలకసన్మహోదయు సమర్చింపందగున్ వేడుకన్.

సువిశేషోపకృతుల్ పొనర్చి మునుపే, శోభిల్లినా వైన, నీ
భవదీయాగమనమ్ముచే నవశకప్రారంభమై యుంక, నె
వ్వివిశేషంబు లొనర్తువో యనుచు నువ్విళ్ళూరుచున్నాము, నీ
వవియుం జేసి మముం గృతార్థులుగఁ జేయంగోరుచున్నా మొగిన్.

శ్రీసరస్వతీ యువజన సంఘము

# దీనహితవిలాస

సీ. మానిత రత్నాలమాల కొండయ్య్య పా
లక పరేణ్యుల కీర్తి సకల దిశల
లాలిత సుమముల మాల కొండయ సూరి
సన్నుత చరితంబు సకల దిశల
రమణీయ ముత్యాల రాజితమాల కొం
డయ్య నరాధిపునాజ్ఞ దిశల ;
పద్మరాగవిలాస భాసుర మాలకొం
డయ్య పల్కులుభువినలరు దిశల;

తే.గీ॥ మండలాధిప! బుధజన! మాన్యచరిత!
తమదు నామము పేదల ధనము దిశల
మాలకొండయ్య శుభనామ మహిత చిత్త!
యేలికా! పాలకా! దీనహితవిలాస!

తే.గీ॥ అన్నమును కోరివచ్చిన యర్థిజనుడ
అమల లింగము వంశాబ్ధి సమ్మతకిరణ
తమదు కరుణ లభించిన ధన్యజీవ
నంబు లభియించు శుభమందుడయ్య తమరు.

నూకరాజు వెంకట లక్ష్మీనరసింహరాజు

# ఉమ్మెత్తలో అత్తరులా?

అందరిలో నుండి మైత్రి
సుందరమై వెలుగొందున?
కోమల మైత్రీ మధురిమ
కొందరినె వరియించున?

కుక్కుటాల కొక్కురోల
కోయిలస్వన మిననగున?
మిక్కిలి గర్వాంధు నెడల
నిజ మక్కువలరయనగున?

ఫణి పడగను మణిశోభగ
అణుకువతో అనువగున?
దనుజులైన మనుజులందు
అనుజులనె కననగున?

చిత్తశుద్ధిలేని నరుని
నిత్యశుభము లరయనగున?
వత్తుగ ఉమ్మెత్త పూసి
అత్తరువుల నందించున?

కసి మెసవెడి కనుల కరుణ
పసి వాడక కుసుమించున?
శిశిరములో చెట్లులన్ని
సింగారము లొలికించున?

మంచివాని పంచింపిన
మమత వాని విడిపోవున?
కొంచమైన మణిని కాంతి
ఎంచి ప్రకాశించననున?

కరుణను కురిపించు కనులు
తరతమ భేదములరయున!
నీలి మేఘముల నీరము
నింగి దాటి రాననున?

ఉన్నవాడు దాతయైన పేద
విన్నపాలు విననున?
వెన్నెల భవనాల కురిసి
వెనలిపోవ సాధ్యమగున?

కల్లకు చోటీయని నరు
చల్లదనం కరువగున?
మల్లెలు తమ పరిమళాల
వెల్లడిచేయక మానున?

—కొండపల్లి కోటేశ్వరమ్మ

# సాహితీ బంధువు

విశాల హృదయుడు మాలకొండయ
విమల చరితుడు మాలకొండయ॥

ప్రజాహిత కార్యములు చేసినాడు
'ప్రజాబంధు' అనిపించుకొన్నాడు॥

సాహిత్య కలాపములు చేసినాడు
సాహితీబంధు అనిపించుకొన్నాడు॥

ఉపన్యాసములు ఎన్నో యిచ్చినాడు
ఉపన్యాస కేసరి అనిపించుకొన్నాడు॥

ఆఫీసర్ల క్లబ్బు ఆరంభించినాడు
బోటు క్లబ్బు ప్రారంభించినాడు॥

వార్ మెమోరియల్ వాటంగా పెట్టినాడు
పల్లెవాళ్లకు పల్లెలు కట్టించినాడు॥

రెడ్ క్రాస్ డబ్బు రోగులకు వినియోగించినాడు
ఫామిలీప్లానింగ్ ప్రాక్టీసుచేయమనినాడు॥

జీవితమును జల్సాగా గడుపుచున్నాడు
జీవితవలయాలలో జీవించుచున్నాడు॥

"సాహితీ బంధు", రొటేరియన్
అల్లంరాజు సత్యనారాయణరావు

# నిండిన సౌజన్యత

అనిపిస్తుందనిపిస్తుందంటూనే
ఆరంభించాడు కవిత
అక్షరాక్షర న్యాయం చేసే
అపురూప భావనా ప్రభుత
ఆది ఆంధ్ర సారస్వతి
లలిత పద విన్యాసత
గతంలోన ఒకరచయిత
వ్రాసినవన్నీ కవిత
వెలయించిన వ్యవహారత
నిత్యసత్య వాస్తవికత
పరిశీలనా దక్షత
నిండిన సౌజన్యత
నిజంగానే రూపించిన
నిరత ప్రజాహిత
కరుణ రసప్లావిత
సాహిత్య సేవాచరిత
సుఖ జీవన భరిత
మహిత మాలకొండయాఖ్య
విరచిత 'జీవిత
వలయాలు' కవిత
నవచేతన పురస్కృత
నవ జీవన సంశోభిత.

నవనవో జ్వల భావ నవ్యాంధ్ర జనయిత్రి
అదృష్టమనగ నీయవని వెలసి
జేగీయ కావ్యంబు జీవితవలయాలు
సృష్టి గావించిన స్రష్టయితడు
వాడుక భాషలో వచన కావ్యము వ్రాసె
కవి జనాశ్రయుడైన కవివరుండు
ధర్మమూర్తియును నాదర్శ మానవ సమ
తావాది యగు మహాభావుకుండు
పేదల వ్యథ తొలగించు పేర్మి జూచు
మాన్యుడు రమావిభుండగు మహిత గుణుడు
మాలకొండయ్యకో నుమా నమస్సుమాలు
లలిత హృదయ కొనుమ సుమాంజలి ఘటింపు.

— 'శివసత్య'

# స్వాగత పద్యమ్ములు

సభకు సభాధినేతకును సభ్యుల కెల్లర కంజలించి వా
గ్విభవుల వెంకోత్తములు గీతనఁ జేసి హృదంతరంబునన్
శుభముల నూర్పుగా సకల శోభన దేవతలన్ స్మరించి యీ
సభకు జయం బొసంగుమని శారదకున్ గరమెత్తి మ్రొక్కెదన్.

స్వాగతము సభాధ్యక్ష! స్వాగతంబు
స్వాగతము ముఖ్యఅతిథికి స్వాగతంబు
స్వాగతము లక్ష్మిదేవికి స్వాగతంబు
స్వాగతం బెల్లజనులకు స్వాగతంబు.

మధుర మందారమకరంద మధిగమించి
మధుర మధురాతిమధురమౌ సుధనుమించి
సరళ సరళాతి సరళమై సురభిళించి
లలిత లలితాతిలలితమౌ కళల చిందు
తెలుగు కవనమ్ము వెలుగమ్ము చిలుకుచుంటి
అందుకొనుడయ్య అక్షరమక్షరముగ.

పరిమళ పద్య పుష్ప ఫలవర్గ చయంబును వేడ్కమీర చం
దురునకు నూలుపోగు పరితోషము మీరనొసంగురీతి గా
గరమనురక్తి తోడ నిటుఁ గాన్కలొసంగగ స్వీకరింపుమా
మరువకుమయ్య మమ్ము బుధమాన్యుఁడ! లింగము మాలకొండయా!

యం.యస్. నాయకర్

# దుమ్ముపట్టిన లేఖిని

తే॥ మాలకొండయ్య తియ్యనిమామిడిచిగొ
పల్లవములతోఁ జక్కఁగఁ బరిఢవిల్ల
నవ్యకవి కోకిలమ్ములు హృద్యమౌచు
కావ్యకుహూ నాదములతోడఁ గానవచ్చె.

తే॥ నగను మేల్కొని యొక్కఁడు నగిషిచెక్కె
దుమ్ముపట్టిన లేఖిని దులిపెనొకఁడు
కలకబాఱగ సవరించె గళము నొకఁడు
మాలకొండయ్య వీరుఁడై మసలుచుండ.

తే॥ మాలకొండయ్య యుగమిది మనసులుబ్బ
నవ్య కావ్యకన్యక యిది నాట్యమాడె
స్వర్ణయుగమంచుఁ గూడిరి సభలలోన
కాకినాడ భూషణమగు కవులగుంపు.

సీ॥ ముద్దుల నొక్కడి మోహన లేఖిని
పరిపాలనాశక్తిఁ బ్రబలెనెంతొ
మకరంద మాధురీ మహితమౌ గళమున
సంతత వాగ్ఝరి జయముఁగూర్చె
రాజాధిరాజుల పూజలు దేహము
రాజశాసనముతోఁ బరిఢవిల్లె.

..ంభి కుంభము గొమరొప్ప కవిమూర్తి
జీపు మీద జిల్లా మంతఁ జెన్నుఁగూర్చె

..వి ..కలెక్టరు! మాధురీ కవితకింక
..కి యేమటంచుఁ గవులు తల్లడిల్లి
..పడి ...కాన్సఫరు మాకు దాపురించె
..లకొండయ్య! యీరీతి పోలదెందు.

విద్యాప్రవీణ, విద్వాన్
— జి. ప్రభాకరశర్మ

కరుణగల గుండెల్లు
కరిగి పారేవేళ...
కన్నీటి సెలయేర్లు
కలసి కురిసేవేళ
మానవాళికి సేవ!
మహనీయులకు త్రోవ

పదవులుండవచ్చు - ప్రాభవాలుండవచ్చు - అధికారాలుండవచ్చు- ఇవి వ్యక్తిచుట్టూ తిరిగే కృత్రిమ వలయాలు. అహంభావానికి నిలయాలు. కరుణగల హృదయాలే కదిలి మానవాళివైపు పరుగులు తీస్తాయి. బీదగుండెల్లో ధైర్యాన్ని పిండిపోస్తాయి. చీకటి గుండెల్లో చిరుజ్యోతులు వెలిగిస్తాయి. నిస్సహాయుల గుండెల్లో ఆశాకిరణాలు ప్రసరింపచేస్తాయి.

# పదవులు - బంగారు పతకాలు

మన జిల్లా కలెక్టరు శ్రీ యస్. మాలకొండయ్య I.A.S. ప్రభుత్వో ద్యోగంలో వివిధ హోదాలో పనిచేసి యున్నప్పటికీ, తన వుద్యోగధర్మాన్ని సమర్థ వంతంగా, జనరంజకంగా నిర్వర్తిస్తూ, ఆ స్థానమునకు న్యాయం కలుగచేస్తూ యుండటమే గాక ప్రజలతో కలిసిపోయి రాత్రింబగళ్లు ఆయన చేస్తూయున్న సాంఘిక సేవ మన రాష్ట్రమునకే కీర్తిప్రతిష్ఠలను తీసుకొచ్చింది.

ప్రధానంగా కుష్ఠువ్యాధి నివారణకు ఆయన చేస్తూన్న కృషి మరువ గానిది. రెడ్ క్రాస్ సంస్థలద్వారా చేసిన అపార సేవకు చిహ్నంగానే కరీంనగర్ కలెక్టరుగా వుండగా మన రాష్ట్రగవర్నర్ గారిచే బంగారు మెడల్ పొందినారు. సాంఘిక సేవలో రాష్ట్రంలోని రెవెన్యూ అధికార్లందరిలోకి మిన్నగావచ్చి "రాష్ట్రపతి మెరిట్ సర్టిఫికేట్" ను పొందే భాగ్యం మన జిల్లా కలెక్టరుగా యుండగా లభించడం అఖిలభారతస్థాయిలో మన జిల్లా ప్రతిష్ఠను యినుమడింప చేసింది.

రెవెన్యూ సర్వీసులో ప్రవేశించినప్పటినుండీ బహుముఖంగా ఆయన చేసిన సేవను యీ సందర్భంలో పేర్కొనక తప్పదు. మన రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో కొద్దిరోజులు లెక్చరర్‌గా పనిచేసినతర్వాత అవిభక్త మద్రాసురాష్ట్రంలో 1949-50 సం॥రంలో సర్వీస్ కమీషన్ నిర్వహించిన డిప్యూటీ కలెక్టర్ పోస్టుల సెలక్షన్‌లో ప్రథమునిగా వచ్చి, తంజావూరు జిల్లాలో శిక్షణపొందిన పిమ్మట 1951-52 సం॥లో అమలాపురంలో ఆర్.డి.ఓ.గా ప్రవేశించిన రోజులలో రైతులు, సామాన్యప్రజలు నిత్యజీవితంలో ఎదుర్కొంటూ యున్న ఇబ్బందులను తొలగించుటకు నిర్మాణాత్మకమైన కృషి చేసినారు. కొన్ని సందర్భాలలో ముమ్మిడివరం ఐలండ్ పోలవరం లాంటి యేరియాలలోని

మారుమూల కుగ్రామములకు కూడా సైకిలుమీద పర్యటనలు గావించి, ఆ యా సమస్యలయొక్క యథార్థపరిస్థితులను తెల్సుకొని సామాన్యప్రజలకు న్యాయం కలుగచేసిన సంఘటనలెన్నో ఉన్నాయి.

విశాఖజిల్లా జాయింట్ కలెక్టర్‌గా, ఖాదీబోర్డు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా కరీంనగర్ జిల్లా కలెక్టర్‌గా...యింకా అనేక ప్రముఖ స్థానాలలో పనిచేసిన సందర్భాలలో తన మేధాశక్తిని, ప్రజ్ఞావిశేషములను ప్రదర్శించుటద్వారా ఉత్తమశ్రేణి రెవెన్యూఉద్యోగిగా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములచే పరిగణింపబడినారు.

తెలంగాణా ఆందోళన సందర్భంలో సర్వంకోల్పోయి, అనేక కష్టములకు లోనై ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని జీవించిన కరీంనగర్ జిల్లాలోని రామగుండం, గోదావరిఖని ప్రాంతములోని అభాగ్య ఆంధ్రులను రైళ్ళలోను, జీపులద్వారాను సురక్షిత ప్రాంతాలకు పంపించి ధైర్యము కలుగచేసి రాత్రింబగళ్లు ఎంతో మెలకువతో పనిచేయుటయే గాక, గత సంవత్సరం మే నెలలో సంభవించిన తుఫాన్‌వలన తీవ్ర నష్టములకు గురైన ఆంధ్రజిల్లాల సహాయార్థం కరీంనగర్ జిల్లా నుండి డబ్బు సేకరించి పంపించినారు. గ్రీస్, ఇటలీ, పశ్చిమ జర్మనీ, నెదర్లాండ్స్, బ్రిటన్, ఫ్రాన్స్, ఆస్ట్రియా మున్నగు విదేశాలలో 1965-66 సంవత్సరములో పర్యటనచేసి, నేపిల్స్ యూనివర్సిటీనుండి 'ఎకనమిక్ డెవలప్‌మెంట్ కోర్సు'లో పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ పొందినారు.

—పాలాటి అప్పారావు

# మనసు మంచిగంధం

"దయాళువుగా, మానవీయతతో తోటివారిని ఆదుకొని, ఆర్త ప్రాణాలను పరిరక్షించడంలో- "తానెవరు - పరులెవరు" అనే భావం లేకుండా అంతా 'వ్యక్తిగా-సమిష్టిగా' తానే అయిన మనస్తత్వంతో వ్యక్తులు ముందుకురుకుతారు.

శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద జీవితాలు కారుణ్యం చివురించి అందరినీ తమలోనే రక్షించుకొన్నట్టివి. వివేకానందుడు తొలిజీవితంలో ఎన్నెన్నో లోకసంఘటనలు చూచి చలించి మమతలు రేగి-తోటివారికి తోడుపడి భగవదానందానుభూతిపొంది వివేకానందుడై తరించిన ధన్యజీవి.

కారుణ్యం-మమతలు కలసిన ధన్యజీవులు భారతదేశంలోనే యింకా తమ ప్రజల సేవలో తరిస్తూ, మురుస్తూ, జీవికను ఆనందభరితంగా భావించు కుంటున్నారని చెప్పడానికి మన చేరువలో-మనమధ్యనున్న శ్రీ ఎల్. మాల కొండయ్య (జిల్లాకలెక్టరు) తార్కాణం.

శ్రీ కొండయ్యగారిలో సాంఘిక చైతన్యం బాల్యంలోనే నాటుకొని చదివిన చదువులో ప్రతిభకనబరచి మొదటిశ్రేణిలోనే వుంటూ-తోటివిద్యార్థిలోకానికి నాడు ఆదర్శప్రాయులైతే-సమాజంలో కష్టాలతో బ్రతికే వ్యక్తులకు తాను చేయగల సహాయం చేస్తూన్న ఉదారతతో నేటి ప్రజాలోకానికే ఆదర్శప్రాయులైనారు.

అధిష్ఠానాలు-గౌరవాలు, గొప్పలు-మెప్పులు తాను కోరి యీ ప్రజాసేవ చేస్తున్నది కాకపోయినా, గుర్తించి లోకం ఆయన్నిగౌరవించడం ధర్మం. లోకాచారం.

ఉత్తమశ్రేణి జీవితం శ్రీ మాలకొండయ్యగారిది. మద్రాస్ లయోలా కాలేజీలో యం.ఏ. చదివి ఫస్టుక్లాసుతోపాటు పతకం బహుమతి పొందారు. డిప్యూటీకలెక్టరు పదవికి జరిగిన ఎన్నికపోటీలో పాల్గొని ప్రథమశ్రేణితో

విజేతలయ్యారు. మద్రాస్ యూనివర్సిటీ స్పీకర్‌గా రోలింగ్ కప్‌లు బహుమతులు పుచ్చుకున్నారు. ఏకాంకికనాటికలు వ్రాసి-ప్రదర్శించినందుకు ఎన్నో బహుమతులు పుచ్చుకున్నారు. వ్యాసరచన పోటీల్లో మొదటి బహుమతులు వీరివే. సోషల్ సర్వీస్‌లీగ్ విద్యార్థినాయకుడుగా, వయోజన విద్యాశాఖ విద్యార్థి నాయకుడుగా కూడా పేరుపొందిన శ్రమజీవి. ఆటలు, క్రీడలు వీరికి చురుకుతనానికీ, వికసితమనస్సుకు తోడ్పడ్డాయి.

అనేక జిల్లాలలో డిప్యూటీ కలెక్టరుగా పనిచేసి 1961లో ఐ.ఏ.ఎస్. కు ప్రమోషన్ వచ్చినతర్వాత విశాఖపట్నం జాయింట్ కలెక్టరుగా వచ్చారు. తెలంగాణా ఉద్యమం సాగిన 1969లో కరీంనగర్ జిల్లా కలెక్టరుగా వుండిన రోజుల్లోనే వారు రెడ్‌క్రాస్ సభ్యులుగాచేసిన ప్రజాసేవ, బీదప్రజలను ఆదుకోవడం, తగిన సహాయ, సౌకర్యాలు కల్గించి మనిషికి మనిషి తోడ్పాటు ఇచ్చే ఉత్తమ లక్ష్యానికి ప్రతీకగా శ్రీ మాలకొండయ్య పేరు తెచ్చుకున్నారు. ఎదుటి వారికి తోడుపడే సమయంలో తానెవరో - తన ఉనికేమిటో - స్థానమేమిటో (అధికారరీత్యా) మరచిపోయి-మానవత్వం-దయాళుత్వం-మమతలు-మనసుగల మనిషిగా-మనీషిగా-ముందుకురికి బాధితులు-రోషితులు కనిపించగానే తానేవారై - వారికష్టాలే తనవైనట్లు మథనపడి, వేదనపడి, తనకు వీలయినంత-చేయి సాగినంతవరకు సహాయపడే కారుణ్యంగల మనిషిగా శ్రీ మాలకొండయ్య గారిని (1969) మనప్రాంతంలోని తుఫానురోజుల్లో వారి అవిరళ, అకుంఠిత అసమాన సేవలు చవిచూచి వున్నాం. అట్టివారికి 'రెడ్ క్రాస్' అవార్డు ఇవ్వడంలో ఆశ్చర్యమేముంది? రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరిగారి చేతులమీదుగా యీ అవార్డు అందుకున్న ఘడియలు, యావత్ జనతాభినందనలతో మ్రోగిన శుభఘంటలు శ్రీ మాలకొండయ్యగారికి ప్రజాశీస్సులు పల్కిన ఘడియలు.

— రానూవా

# మహామనీషి

రవ్వలు చిందే తారాజువ్వలాంటి మనిషి మాలకొండయ్య. మాటలకంటె చేతలకే ప్రాముఖ్యమిచ్చే మనీషి సత్తముడు. అతడు I.A.S. ఆఫీసరు; అంటే పెద్ద ఉద్యోగి అన్నమాట అయినా క్రిందితరగతుల వారందరిని ఆప్యాయతతో పల్కరిస్తాడు. నిరాడంబరుడు. కలెక్టరుగదా అని మెరుపులా మెరిసేవాడుమాత్రం కాడు. అనవరతము హరిజన గిరిజన బహుజన మధ్యగతుడై ఉండుటే అతని ఇష్టము. చిరునవ్వుతో పల్కరిస్తూ ఎదిరి మనస్సుల నిట్టే పసిగట్టగల వివేకశాలి.

విధినిర్వహణలో అప్రమత్తుడు. అతిజాగరూకుడుకూడ. అందరికు రోజుకు 24 గంటలైతే, మాలకొండయ్యకు మాత్రము 48 గంటలు కావాలి. విధి విరామముల నెరుంగని సేవావ్రతుడు. నిర్మాణకార్యక్రమమాతని సొత్తు. దయార్ద్ర హృదయుడగుటచే ఇతరుల బాధల నతిసులభముగ గుర్తిస్తాడు. చేతనైన సాయం చేసి సంతోషము కలిగిస్తాడు.

హలం పట్టినా కలం పట్టినా, అటు కృషక్ పండితులను, ఇటు కవిపండితులను, సమానంగా ప్రేమిస్తాడు. కళాకారులన్నా, సరస్వతీఉపాసకులన్నా పరమాదరము. అంతేకాదు. సంస్కరణప్రియుడు కూడ. అర్థములేని మూఢాచారములకు గొడ్డలిపెట్టు. సంఘసంస్కరణలో శ్రీ వీరేశలింగం పంతులుగారికి ఏకలవ్య శిష్యుడు. పంతులుగారి సంస్థలన్నియు మాలకొండయ్య హయాములో నూత్నవికాసాన్ని పొందినాయి. వీరి ప్రోత్సాహము నూత్నసంస్థలకు పునాదులయినాయి కూడ. సక్రమంగా నడిచే అన్నిసంస్థలను చేయూతనిచ్చే పరమ దయామయుడు.

వెనుకపడ్డ తరగతుల సముద్ధరణము వీరి పరమలక్ష్యము. బీదలపాలిట పెన్నిధి. బీదవిద్యార్థులకు శరణాగతి. ఏపనిచేసినా గోరంతలు కొండంతలుగా

చెప్పుకోవాలని అవికత్థనుడు. అసలే నిరాడంబరుడు. దానికితోడు వినయ ధురంధరుడు కూడా. రాజకీయరంగంలోని చురుకుతనంతోపాటు కవితారంగంలోని కరుకుతనంకూడా అతనికి వన్నెతెచ్చినవి. ప్రాచీనకవిత్వంలోని రసభావాముల నాస్వాదించి ఆనందించగలడు. అట్లే ఆధునిక కవిత్వంలోని పరవశ్యతా క్షోరసోద్వేగాన్ని కూడా సమపాళ్ళలో చవిచూడగలడు.

ఒక్కమాటలో చెప్పాలంటే "మనిషిని అర్థం చేసుకోగలవాడు మా కొండయ్య" అని చెబితే చాలు. "సర్వేజనా స్సుఖినో భవంతు" అన్నకోవకు చెందినవాడు.

విద్వాన్, శిరోమణి
వై. మల్లికార్జునరావు P.O.L.

# అంతా ఇట్లా వుంటే...

దేశాభివృద్ధికి తను చేసిన సేవా, తన గుణగణాలే ఆ వ్యక్తికీర్తి ఆ చంద్రార్కము నిలబడుటకు దోహదం చేస్తాయి. దేశసేవ చేయాలని ఉపన్యాసాలిచ్చేవారు, నీతులుచెప్పేవారు అధికమైపోయిన యీ రోజులలో, సేవచేసేవారు చెప్పినవి చేసి చూపేవారు చాలాఅరుదు. అలా అరుదైనవారిలో శ్రీ మాలకొండయ్యలాంటివ్యక్తి మరీ అరుదు. పెద్దఅధికారులు ఎప్పుడూ ఫైల్సు చూడటంలోనూ, కాగితాలమీద సంతకాలు చేయడంలోను కాలం గడిపేస్తారు కాని, జిల్లా సర్వాధికారిగా ఉంటూ, తన విధ్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తూ కూడా వీలుచూసుకొని ప్రజలలో కలిసిపోతూ వారి కష్టసుఖాలలో పాలుపంచుకొంటున్న శ్రీ మాలకొండయ్య నామం, రూపం అందరిహృదయాలలో స్థిరస్థానం కల్పించుకొన్నాయంటే అతిశయోక్తి కాదు.

హాస్యాన్ని అందరూ హర్షించలేరు. అందరూ హాస్యాన్ని మెప్పించలేరు. కాని, శ్రీ మాలకొండయ్య హాస్యాన్ని హర్షించి, సమయానుకూలంగా హాస్యాన్ని పోషిస్తారు. ఇలాంటి సరసహృదయుడు అధికారులలో చాలా అరుదని చెప్పాలి.

తెలంగాణా-ఆంధ్రఉద్యమంలో, ఆంధ్రులకు అన్యాయం జరగకుండా రాత్రింబగళ్ళు తన ప్రాణాన్ని కూడా లెక్కచేయకుండా తిరిగి కృషిచేసిన శ్రీ మాలకొండయ్య విధినిర్వహణశక్తి, విధినిర్వహణలో ఆయన ధైర్యశౌర్యములు శ్లాఘనీయమైనవి. అట్టి మాలకొండయ్యగారు ఆంధ్రుల నడుమ ఉంటూ సేవచేస్తున్నారంటే ఆనందించని ఆంధ్రుడు ఉన్నాడా?

నలుగురిని మెప్పించే మాట, సంతోషాన్ని వెలిబుచ్చే చిరునగవు, అధికారిననే దర్పంలేని ఆతిచనువు అధికారులకు వస్తాయా?

కరీంనగరంలోని ఆయన సేవలనుగుర్తిస్తూ, మాలకొండయ్యగారికి రాష్ట్రగవర్నర్ రెడ్ క్రాస్ పతకం ఇచ్చారంటే సంతోషించేది ఆయనకాదు. మనం అందరం. అలాగే భారతరాష్ట్రపతి శ్రీ V. V. గిరి ఆలిండియా రెడ్ క్రాస్ మెరిట్ సర్టిఫికెట్టు ఏప్రెల్ 18న ఇచ్చారంటే వారి మానవతాసేవలగురించి వేరే చెప్పనక్కరలేదు. వారిసేవలను మన జిల్లావాసులు సక్రమముగా ఉపయోగించు కొని వారికి అండదండలు ఇవ్వాలి. ఇంకా ప్రపంచ రెడ్ క్రాస్ సంస్థచే కూడా సత్కరింపబడాలన్న మన అందరికోరిక తీరాలని వాంచిస్తున్నాము. ప్రతిఅధికారి శ్రీ మాలకొండయ్యలాగ ఉంటే జిల్లా, రాష్ట్రం కూడా బాగుపడుతుంది.

— ముద్రగడ సూర్యారావు

# శ్రీమాలకొండయ్యగారి విశిష్ట సేవలు

పద్దెనిమిది సంవత్సరాలు 'ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ'కి సభ్యులుగా, వివిధమండల శాఖలకు అధ్యక్షులుగా వ్యవహరించారు. 1958లో గుంటూరులో ఎక్కువమంది సభ్యులను చేర్పించినందుకుగాను ఒక బహుమానం వీరికి లభించింది. వీరు నిర్వహించిన యీ కార్యక్రమాల దృష్ట్యా శ్రీ V. V. గిరిగారు 1969 లో ఒక ప్రశంసాపత్రాన్ని బహూకరించారు. కరీంనగర్ జిల్లా కలెక్టరుగా ఉన్నప్పుడు 1968లో వీరి సేవానిరతికి 'స్టేటు అవార్డు' గా రజత పతకాన్ని ప్రభుత్వమిచ్చింది. 1971-72 కాలములో వీరి సేవకు ప్రభుత్వం ప్రత్యేకమైన స్థాయిలో ఒక బంగారు పతకాన్ని అనతికాలములో ఇవ్వబోతున్నది. ఇటువంటి గౌరవం ప్రభుత్వాధికారులకు ఇంతకుపూర్వం లభించలేదు.

తూర్పుగోదావరి జిల్లా కలెక్టరుగా చేసిన సేవలెన్నో యున్నవి. ఆంధ్ర కేసరి యువజన సమితిద్వారా 'కుష్ఠరోగ నివారణ పథకము'ను ప్రోత్సహించారు. ఈజిల్లాలో 6 కుష్ఠరోగ ఉపశమన కేంద్రాలను ప్రారంభింపజేశారు.

100 పడకలతో-స్త్రీ పురుషులకు వేర్వేరు వార్డులతో ప్లాస్టిక్ సర్జరీ ఆపరేషన్ థియేటరుగల ఆసుపత్రిని నిర్మింపజేశారు. ఇటీవల కడియంలో రెడ్‌క్రాస్ రిలీఫ్ సెంటరును ప్రారంభించారు.

ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమనిధి సహకారంతో రామచంద్రపురం తాలూకాలో బోదకాలు నివారణకు ప్రాజెక్టును నడిపారు.

కాకినాడలో 5000 మంది పిల్లలకు పోలియో మొదలైన వ్యాధులకు ఉచితంగా మందిచ్చే ఏర్పాటు చేశారు.

రాజమండ్రిలో శిశుసంక్షేమ కోర్స్‌పై పిల్లల శిబిరాన్ని నిర్వహింప జేశారు.

కాకినాడలో జూనియర్ కాలేజి నెలకొల్పడానికి, రాజమండ్రిలో V. T. జూనియరు కాలేజి ఆవిర్భావానికి సహకరించారు.

ఎంతోమంది బీదవిద్యార్థులకు స్కాలరుషిప్పులు ఇప్పించారు.

వీరేశలింగంగారి ఉద్యమం మీదనున్న అభిమానంతో హితకారిణి సమాజం లోని విధవల పునర్వివాహాల నిమిత్తం 2 వేల రూపాయలిచ్చారు.

రాజమండ్రిలో వీరేశలింగంగారి 122-124 జయంత్యుత్సవాలు జరిపించారు.

విశాఖపట్నంలో వైద్యవిద్య నభ్యసిస్తున్న ఒక గిరిజన బాలికకు సహాయాన్ని అందించారు.

1969లో వచ్చిన తుపానులో జిల్లా ప్రజలకు ఎన్నెన్నో సహాయాలుచేసి తోడ్పడ్డారు.

రాజమండ్రిలో జర్నలిస్టుల కాలనీ అపూర్వంగా సృష్టించారు. హరిజన గిరిజనులకు, వెనుకబడినవారికి బట్టలు ఇతర వస్తువులు సరఫరా చేశారు.

రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయానికి పదివేల రూపాయలు సహాయ నిధిగా ఇచ్చారు. వీరేశలింగం పరిశోధనాలయానికి నేదునూరి గంగాధరం గ్రంథప్రదర్శన విభాగానికి 5 వేల రూపాయలు మంజూరు చేశారు.

ఇవిగాక వీరి చేతులమీదుగా ప్రజలకు ఎన్నో సహకారములనందించారు.

# బహుముఖ సేవ

మనది అసలే వెనుకబడిన దేశం, అందులోనూ వెనుకబడిన జిల్లాలలో వెనుకబడినది కరీంనగరం జిల్లా. మొత్తంమీద అన్ని తాలూకాల యందు రెడ్ క్రాస్ సంఘములను ఏర్పరచి హెచ్చు ప్రజలను సేవాపరాయణులను గావించి ప్రబోధించిన ప్రజ్ఞ మాలకొండయ్యగారిది. సేవాభావమనేది హృదయగతం అయివుండాలే గాని సేవకు అవకాశాలే వుండవా! అందుచేతనే మాలకొండయ్య గారు రకరకాలుగా తమ సేవాభావాన్ని వ్యక్తంచేయగలిగారు. దైవవిధివల్ల ఆపదలో చిక్కిన విద్యార్థి లోకానికి ధనసహాయముచేసి ఆదుకొన్నారు. సరే బాగున్నది. అంతతో ఆగక ఎందరో విద్యార్థులకు ముఖ్యముగా బీదవిద్యార్థులకు, బి.ఎ., పి.యు.సి. వారికి విద్యార్థివేతనము లిప్పించారు. విద్యనొకదానినే ప్రోత్సహించడమే గాక, ఆటలను, దేహదారుఢ్యముతోపాటు క్రమశిక్షణ నిచ్చే ఎన్. సి. సి. వారికికూడ వేతనములిచ్చి వుత్తేజపరిచారు వీరు. కేవలం విద్యార్థులను మాత్రమే ప్రోత్సాహపరచడమే గాకుండా, లేడీస్ క్లబ్బులో సుమారు రు. 25000/-లు పెట్టి బాల బాలికలకు ఆటపాటలకు అన్ని సౌకర్యములు కలగజేశారు. మరి కేవలం యిటువంటివారికే ఆర్థికసహాయము అందజేయుడంతో తృప్తి చెందక, కళ్ళులేనివారికి, కాళ్ళులేని వారికి ఎందరికో చేయూతనిచ్చారు. అంధులకు నూతన జీవితాన్నివ్వడానికి సుమారు 1200 మందికి కంటిచికిత్స చేయించిన పుణ్యం వీరికేదక్కింది. వీరి సేవాఫలాన్ని ఒక వర్గంవారందుకొని, యింకొకవర్గమువారు పొందలేదనే మాటలేకుండా, పోలీసు వారి కుటుంబాల దగ్గరనుండి, బర్మాకాందిశీకులు, తెలంగాణాఅలజడి బాధకు గురిఅయినవారివరకూ అందరూ యింతో అంతో లాభం, సహాయం పొందారు.

ప్రభుత్వవైద్యశాలలో క్షయవ్యాధి బాధితులవార్డు దగ్గరనుంచి అవుట్ పేషంట్ వార్డువరకూ మాలకొండయ్యగారి సహాయము పొందాయి లక్షా యాభై

వేలకుపైగా ఈ వైద్యశాలకోసం ప్రోగుచేసి ఖర్చుపెట్టారు. ఇన్ని చేసినవారు హరిజనులను గిరిజనులను మాత్రం మరచిపోతారా! వారికోసం కూడా విద్యార్థి వేతనాలూ, ఉచిత పుస్తకదానం జరిగాయి.

ఈ జిల్లాకే వీరి సేవలు పరిమితంకాలేదు. ఇరుగు, పొరుగు జిల్లాలవారిని, రాష్ట్రాలవారిని కూడా వీరు ఆదుకొన్నారు. అవసరాలలో రాజస్తానంలో క్షామానికీ, గుంటూరు, కృష్ణాజిల్లాల వరదబాధితులకూ వీరిద్వారా సహాయము అందినది. గాంధీ శతజయంత్యోత్సవముల సందర్భముగా వారి బొమ్మలను వాడవాడల అమ్మించిన దిట్ట శ్రీ మాలకొండయ్యగారు.

అందువల్ల వారికి రాష్ట్ర పతకము, కేంద్రసంస్థ యోగ్యతాపత్రము లభించుట సహజము. వారి సేవాభాగ్యమును పొందగల్గడం మనజిల్లా అదృష్టం.

# పరిహాస ప్రభంజనం

"చూసేవన్నీ, చేసేవన్నీ
తనివితీరా చెప్పాలని-
మనసులోని ఆలోచనను
ఆవేదనలను
ముసుగువిప్పి
కలం కుంచె రంగులతో
కథలుగా, కవితలుగా
కాలం గుండెల్లో వెదజల్లాలని
అనిపిస్తుంది నాకు
నా ఆలోచనలను అనుభూతులను
పదిమందితో పంచుకోవాలని
అనిపిస్తుంది నాకు."

(జీవిత వలయాలు)

—అని నవ్యకవితా సామ్రాజ్యంలో పట్టంకట్టుకొని, నవీన మానవ ఆకాజ్యోతియై, ఉద్వేగం ఉరకలు వేయిన్నూ, ఆవేదన అంగలారుస్తూ, ఉవ్వెత్తునలేస్తూ ఉత్సాహం ఉదయాద్రి కుహర శిఖరపంక్తుల్లో నర్తిస్తూ, ఆవేశం, ఆందోళనలు మనసును క్షోభపెడుతూంటే వెనక్కుమళ్ళి మొదటికివెళ్ళి "జీవితవలయాలు" "మనిషికి మనిషి" "కాలంవెంట కవి" "పాపా నీకుతెలుసా" "న్యాయానికి నోరు" మున్నగు కృతులు శ్రీ లింగం మాలకొండయ్యగారు రచించారు. ఉన్నత పదవులు అధిష్టించినా ప్రజాసేవయే పరమావధిగా భావించిన మానవతావాది. ప్రజాసేవకు గుర్తింపుగా రాష్ట్రస్థాయి రెడ్‌క్రాస్ బంగారుపతకం, అఖిలభారత రెడ్‌క్రాస్ మెరిట్‌అవార్డు బహూకరించబడ్డాయి.

నేరాలతో, మోసాలతో విశ్రాంతిలేని లోకంలోని కర్షకుని కడగండ్లు, కష్టజీవి కన్నీరు, పేదల బాధలు, ఆఫీసుల ఫైళ్ళకుళ్ళు, కాయకష్టం చేయకుండా ప్రజలను పీల్చి పిప్పిచేసేవారి చరిత్రలను, చెవులు, కన్నులుంటే వినని కనని వాళ్ళ స్వరూపస్వభావాలను, కాళ్ళు కదపకుండా కండలు పెంచేవాళ్ళు, కండలు కరిగించినా కడుపు నిండనివాళ్ళ జీవితాలను అద్దంపట్టి కవితకు నవత కల్పించి వాస్తవికతకు నాంది వాక్యం పలికించారు.

కవిత్వం చచ్చిపోతున్నకాలంలో ఉత్తమకవితలు సృష్టించి, "మనం మనుషులం, సంఘం బ్రతికిఉన్న మనుషులతో కూడిన శవపేటిక" అని ధైర్యంగా చెప్పగల కవి శ్రీమాలకొండయ్యగారు. రచింపబడిన ప్రతి కవితాఖండిక నగ్న సత్యానికి గీటురాయిగా కన్పిస్తుంది. సామాజిక దృక్పథానికి స్వాగతవచనం పల్కుతుంది. మానవాళికి ఆదర్శమార్గం చూపి ముందుకునడిపిస్తుంది.

'జీవితవలయాలు,' 'మనిషికి మనిషి' అను రెండు కావ్యములందలి కవితలలో ఉన్న 'సెటైర్' ను గూర్చి వివరించటం ఈవ్యాసోద్దేశం.

ఆంగ్లభాషలో ఉన్న SATIRE అనే పదానికి తెలుగులో పరిహాసం, అపహాస్యం, అధిక్షేపం, ఎగతాళి, వెక్కిరింత, హేళన మున్నగునవి పర్యాయ పదాలుగా వ్యవహారానికి వచ్చాయి. ప్రభుత్వాలనను, అధికారుల అక్రమాలను, ప్రజాజీవనాన్ని పరిహాసపు పలుకులతో సునిశితహాస్యాన్ని మిళితంచేస్తూ చెప్పటం కవితాలక్షణం. ఈభావాన్ని దృష్టిలో ఉంచుకొని ఆంగ్లేయ విజ్ఞానసర్వస్వంలో ఈవిధంగా నిర్వచనం చేయబడింది: ' Satire-the term applied to any, literary form in Prose or Poetry which ridicules the situation, individuals or ideas. Its purpose is to correct manners and morals through mockery, broad humour, sophisticated Wit harsh invective Parody or Gentle irony. It may be humourous or serious but object is generally made to seem, rediculous rather than evil '.

( The eolumbia viking Desk Encyclopedia - Page 1635 )

కవిత్వానికి అధిక్షేపం ప్రధానాంగం. దీనికితోడు సుకుమారమైన హాస్యం ఉండటం చేత పాఠకుల ఆనందప్రాప్తికి హేతువయ్యింది. అర్థాన్ని గ్రహించిన వారు తీవ్రతను గుర్తించి ఆవేశపూరితులై సమాజం గుండెలపై నిలబడ్డారు. ఆ అర్థాన్ని గ్రహింపలేనివారు పదాల మాటున దాగిన హాస్యాన్ని నవ్వుకొన్నారు. చూచి.

నేటికవులు సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితిని చూచి అధిక్షేపిస్తున్నారు. సమాజం ముందుకుపోక వెనకంజవేస్తున్నదని గేలి చేస్తున్నారు. సమాజ సంస్కరణకు నడుంకట్టుకొని ముందుకు వస్తున్న కవులలో శ్రీరంగం మారి కొండయ్యగారొకరు. వీరి కవితలందు అధిక్షేపం ముసుగు వేసుకొని ముసి ముసినవ్వులు నవ్వుకొంటున్నది. సమాజంలో జరిగే అస్తవ్యస్తంపై తమ అసంతృప్తిని తెలియజేస్తూ అక్రమాలను ప్రతిఘటిస్తున్నారు. ఈ అధిక్షేప కవితలను ఆఫీసువ్యవహారాలు, కుటుంబ నియంత్రణము, ఫ్యాషన్లు మూఢ నమ్మకాలకు సంబంధించిన ఖండికలయందు చూడగల్గుతాము. ఇవేగాక ఇతర కవితలయందుకూడ ఉన్నా పైనపేర్కొన్న నాలుగంశాలను గూర్చి వివరిస్తాను.

ఈనాడు ఆఫీసుల చుట్టూ, ప్రజానాయకుల చుట్టూ తిరగని వారుండటం అరుదు.. జానెడుపొట్టకొరకు ఉద్యోగం చేయాలనే ధర్మాన్ని పురస్కరించుకొని ప్రజానాయకుల చుట్టూచేరి బరువుపెట్టి గుమాస్తాలముందు చేతులుకట్టుకొని నెలల తరబడి, సంవత్సరాల తరబడి తిరిగితిరిగి ఇంటర్వ్యూ సంపాదిస్తే, ఆ ఇంటర్వ్యూ కంటే ప్రజానాయకుడే మేలని వారిని ఆశ్రయిస్తే-

"ఉంచుతాడు ప్రజలను బయట
వస్తాడు ప్రజా సేవకుడు లోనికి
చూస్తాడు ఆఫీసర్లను ప్రజలకొరకు
చేస్తాడు సమాలోచనలు వారితో"

అని కవి ప్రజా సేవకుని పరమార్థతత్త్వాన్ని, ఉద్యోగం పేరిట నిరుద్యోగులను

మోసం చేసే ప్రజానాయకుని బండారాన్ని బయటపెట్టి, ఇలాంటి ఉదరపోషణ నాయకులు దేశానికి, సమాజానికి మంచివారుకారని వారి నిజస్వరూపాన్ని అక్షరాలలో పేర్చికూర్చి అతడు చేసే చేష్టలను కవి వెక్కిరిస్తూ-

"చెప్పాను మీకష్టాలను గూర్చి
విన్నారు వివరంగా
అన్నారు "తప్పక చేస్తాను మీ పనులు" అని
చూడండి త్వరలో ఫలితం
పిలుద్దాం వారిని ఒకశుభకార్యానికి
వేద్దాం పూలమాలలు, చేద్దాం టీపార్టీ విందులు"

అవి అరిగిపోయిన గ్రాంఫోను రికార్డులా కల్లబొల్లి మాటలతో మసిపూసి మారేడు కాయచేసి అరచేతిలో వైకుంఠం చూపిస్తానని సవాల్‌చేసే వారందరికిది చెంప పెట్టులా ఉండటమేగాక వారిని ఎగతాళి చేసారు.

అధికారులకు అడుగులొత్తే అణా కానీ రకమంతా ప్రజాసేవకులేనా? నిమిషంలో చెప్పవలసిన విషయం గంటసేపు చర్చించినంతమాత్రాన ఉద్యోగం లభిస్తుందా? అప్పటికప్పుడే పని అయినట్లుగా చిరునవ్వులు చిలకరిస్తూ తిరిగినస్తే ఆర్డరుకాగితం చేతికందినట్లేనా? మరునిమిషంలో నీజాతకం మారబోతోందని చెప్పేవాడు ప్రజాసేవాతత్పరత కల్గిన మహాసేవకుడుకాదని ఇంటర్‌వ్యూకు వచ్చిన జనానికి చెబుతున్నారు. ప్రతి బడుద్దాయి ప్రజాసేవకుడని ముద్రవేసుకొని బజారునపడి అరచినంతమాత్రాన ఆ మహనీయుని వెంటపడుకద్దు. ప్రజలంటేనే తెలియనివాడు ప్రజాసేవకుడు కాడని, ఈవిషయాలన్నీ మనం గ్రహించాలనే ఉద్దేశంతో కవి 'ఇంటర్‌వ్యూ' ఖండికను రచించారు. నిరుద్యోగుల పాట్లను, ప్రజాసేవకుల అలవాట్లను వివరిస్తూనే రాబోయే నిరుద్యోగ తరాన్ని కవి మనసా, వాచా, హెచ్చరిస్తున్నట్లుగాను, అవకతవకలను రూపుమాపి మంచితనం పెంచు కొని ప్రజలపాలిట కల్పతరువులా ప్రజాసేవకులుండాలని హితవు చెబుతూనే చురకులువేస్తున్నారు.

ఒక ప్రక్క 'ఇంటర్వ్యూ'లు ప్రక్కదారులు పడుతూంటే ఆఫీసుల్లోని ఫైళ్ళు పట్టీలుకొట్టి కుంభకర్ణులముందు ప్రణమిల్లుతాయి. ఈనాటి ఆఫీసుల్లోని ఫైళ్ళు కదలవు, మెదలవు. నోరువిప్పి పలకలేవు. మనం వ్రాసి ఇచ్చిన అర్జీలు కట్టలు కట్టలుగా ఆఫీసుల్లో పేరుకొనిపోతాయి - పాపం పేరుకొన్నట్లు. దీని కంతకూ కారణం అధికారుల అజాగ్రత్త, అశ్రద్ధ. ఆఫీసుల్లో పేరుకొన్న 'పెండింగ్ ఫైళ్ళ' కుళ్ళును తీసివేయాలనే ఉద్దేశంతో కవి ఆ ఫైళ్ళస్థితిని పరిహాసం చేస్తున్నారు.

పెండింగ్ ఫైళ్ళు అంటే
పేదవాళ్ళ కనీస అవసరాలకోసం
పెట్టుకొన్న కాగితాల కట్టల దొంతరలు.
బూజు దుప్పటి ముసుగుపెట్టుకుని
హాయిగా నిద్రపోతూంటాయి ఆఫీసు అలమారాల్లో అవి.

ఇది ఆఫీసుఫైళ్ళస్థితికి దర్పణంలా ఉంది. కవి యథార్థస్థితిని చెప్పుచున్నను అక్రమాలను తొలగించి పేదవాళ్ళ కనీస అవసరాలను ఆదుకోమని, బూజుపట్టిన ఫైళ్ళదుమ్మును దులపమని సూటిగా చెబుతున్నా ఫైవారు సరిగా ఉంటే అన్నీ సరిగ్గానే ఉంటాయంటారు గాని-

అంగట్లో అన్నీఉన్నా అల్లుడినోట్లో శని అన్నట్లు
ఆఫీసర్లు ఆర్డర్లు గుడ్డిగా వేసినా
అర్జీదార్ల కడగండ్లు అలాగే ఉంటాయి అనేకపార్లు
పేదవాళ్ల ఫైళ్ళు పెండింగగానే ఉంటాయి
ఉద్యోగస్థుల జీవితాలు నెలా నెలా వస్తూనేఉంటాయి
పెండింగ్ ఫైళ్ళు అనే ఎద్లబండ్లు
పడుతూ లేస్తూ ప్రయాణిస్తూనే ఉంటాయి
ఈ జాడ్యానికి ఆపరేషన్ ఎన్నడో
పేదప్రజకు మోక్షం ఎప్పుడో

అని కవి ఆవేదనా నిర్వేదాలకులోనై తనకునచ్చని విషయాన్ని సూటిగా పేర్కొంటూ ఫైళ్ళు వేసుకొని డిస్పాచ్ చేయలేని వారిని దుయ్యబడుతూ,

జ్ఞానానికి ఆపరేషన్ ఉంటేనేగాని ఆఫీసుఫైళ్ళు ముందుకు వెళ్ళలేవంటారు. ఉద్యోగస్తుల బద్ధకాన్ని, అధికారుల అశ్రద్ధను పెండింగ్ ఫైళ్ళుఅనేనెపంతో గట్టిగ ఎత్తిచూపగా చెప్పక మందారమకరంద మధుమధురీమధురపదాలను గంభీరంగా ప్రయోగించి ఆఫీసుల్లో జరిగే తతంగాలను, టక్కు టమారాలను, ఉన్నది ఉన్నట్లుగా చెప్పి ఆక్షేపిస్తూ పెదవాళ్ళఫైళ్ళు పెండింగ్ లేకుండా, అర్జీదార్ల కడ గండ్లు అలాగే ఉండకుండా పేదప్రజకు మోక్షం కలిగించమని పెండింగ్ ఫైళ్ళకు పరిష్కారం చూపించారు. ఆక్షేప కవితకే 'పెండింగ్ ఫైళ్ళు' కలికితురాయిలా అమరి చిరునవ్వుల జల్లులు కురిపిస్తూంది.

నేడు దేశంలో జనాభా పెరిగిపోతోంది. రావణాసురుని ముందు హనుమంతుని వాలంలా. ఉత్పత్తులు పెరుగుతున్నా జనసముదాయాల కొరత ఏర్పడు తూంది. జనాభా సమస్య మనదేశానికి తీరని వ్యథ కలిగిస్తూంది.

శ్రీ మాలకొండయ్యగారు కుటుంబ నియంత్రణ విధానాన్ని పొగడుతూనే లోపాలనుబయటపెట్టి చక్కదిద్దాలంటున్నారు. 'ఎక్కువే తక్కువ' అనే ఖండిక కుటుంబ నియంత్రణాన్ని అపహాస్యం చేస్తుంది.

"ఎక్కువ పంటలు పండిస్తే
కృషిపండిత బిరుదుఇస్తే
తక్కువపిల్లలు కన్నందుకు
కుటుంబపండిత బిరుదుఇవ్వాలి."

ఇందులో పరిహాసం పరుగులు పెడుతూంటే హాస్యం రెక్కలు విప్పింది. పైకి పొగడ్త, లోన, అపహాస్యం. నచ్చని విషయాన్ని పరిహాసపూర్వకంగా చెప్పి నవ్వుపుట్టించటం 'సెటైరు'కవితకు పునాది. పరిహాసానికి పరిమితం ఉండదు. విషయాన్ని హేళన చేయటం కవితప్రత్యేకత. అందుచేతనే కవి—

నేడు సామాన్యుని సంసారం బండి
ఓవర్ లోడై ఓరగిలి పడుతోంది.
ప్రమాదం తప్పాలంటే వెంటనే నూపాలి ఎజ్జుజంజా

ఆపాలి జననాల బండి ఇద్దరు పిల్లలు పుట్టగానే
ఇంటికి తగిలించాలి బోర్డు హౌస్‌ఫుల్
"కుటుంబం బండి నిండింది" అవి

సంసారంబండి ఓవర్‌లోడై ఒరగిలపడినా, ఎఱ్ఱజెండా చూపించినా, హౌస్ ఫుల్ అని బోర్డుపెట్టినా, కుటుంబనియంత్రణా విధానానికి తిలోదకాలే. సిరిసంప దలు కావాలంటే చిరసంసారం కావాలని కోరరు గనుకనే ప్రభుత్వం ఎరబెట్టి ఎఱ్ఱదీపం వెలిగిస్తూంది. ఈ కుటుంబ నియంత్రణా విధానం సువర్ణాక్షరాలతో లిఖించి శాశ్వతంగా ఉండటానికి ఒక చిట్కా అధికారులకు అందిస్తున్నారు. ఆచ రిస్తే ఆరోగ్యానికి మంచిదవి.

కార్యమనే మర్యాద పేరుతో జరిపే
గర్భాదాన సంబరం పండుగలాగే
చేయాలి గర్భాన్ని నిరోధించే
వ్యాసక్టమీ ట్యూబెక్టమీల పండుగలు!

కవి కవితలో గర్భాదాన సంబరాన్ని, ఆనాడు జరిగే తతంగాన్ని, హేళన చేస్తున్నారు. గర్భాదానంకూడ ఒక పండుగేనా అని! అలాగే వ్యాసక్టమీ ట్యూబె క్టమీలకు చలువ పందిళ్ళు వేసి ముత్తయిదులను పిలిచి అందరికి యాపే పండు తాంబూలంగా అందించి ఆనందించమంటున్నారు. ఈ పంక్తుల్లో కవి కనిపించ కుండా వాతలుపెట్టి నిర్మోహమాటంగానే జనాలపై కంట్రోలును ఎదుర్కొంటు న్నారు.

జననత్వాలున్న కవిత్వం అంటే గుండెకు సూదిగా తగిలి ఆలోచనా లోచనాలను తెరపించి లోకాన్ని సునిశితంగా పరిశీలించమని వీపు తడుతుంది. ఆ లక్షణమే వీరి కవితకు పరమార్థము, ప్రత్యేకతసి గ్రహించాలి.

కవి ఇంతటితో ఆగక నేటి ఫ్యాషన్లపై తిరుగుబాటు ధోరణిని ప్రదర్శిం

చారు. ఈ కాలపు ప్రజలకు ఆధునికత్వంపై వ్యామోహం పెరిగింది. అనుకరణ ఎక్కువయ్యింది. సహజత్వం పోయి అసహజత్వం దీర్ఘకాలిక రోగంలా తయారయ్యింది. సంస్కృతి అంటే అర్థంతెలియని సమాజం రొంకదారులు పడుతూంది. దీనినిబట్టి సమాజం ముందుకు పోతున్నదో, వెనక్కుపోతున్నదో తెలియటంలేదు. ఈ ఫ్యాషన్లపై కవి ధ్వజమెత్తి ఈసడిస్తున్నారు.

ముంజేతుల క్రిందకు రవికలు
నింగిని తిలకిస్తూ
భుజాలపై కెక్కాయి
ఎవరెస్టు గెలిచినంత గర్వంతో!
బొడ్డుపైకి పోయిన చీరకట్టులు
పతనమైపోతున్నాయి.
అజంతా సుందరులతో పోటీచేస్తూ!

స్త్రీలఫ్యాషన్లు వెర్రితలలు వేస్తున్నాయి. మహిళామణులు తమ నిజస్థితి కోల్పోతున్నారు. వీరందరికీ సినిమాలు ఆదర్శం. గుప్పిట మూసిఉన్నంత వరకే గుట్టు తెలియకుండా ఉంటుంది. ఆ గుప్పిట తెరిస్తే గుట్టు బయట పడిపోతుంది జాగ్రత్తని స్త్రీలను కవి హెచ్చరిస్తున్నారు.

స్త్రీల ఫ్యాషన్లపై కవి గేలి చేసారని పురుషపుంగవులు పొంగి పోనక్కరలేదు. వీరి వేషాలపై కూడా వ్యాఖ్యానం చేసారు చూడండి—

మగవారిదుస్తులు మగువల మించాయి
రంగురంగు చొక్కాలు
రవికలో చీరలో తెలియని గురు షర్టులు
అవసరానికి విప్పుకోడానికి అలవికాని
గొట్టాం ఫ్యాంట్లు అబ్బాయిలకు

అబ్బాయి, అమ్మాయి షర్టు జాకెట్ వేస్తారు. వీరి దుస్తుల్లో అబ్బాయికి, అమ్మాయికి సృష్టిలోనే తేడాయేగాని ధరించే వస్త్రాల్లో భిన్నత్వంలో ఏకత్వం కనిపిస్తూంది. నవనాగరికత పాతరాతి యుగానికి పయనిస్తోందని కవి చూపుడు వ్రేలితో చూపిస్తున్నారు.

ఫ్యాషన్ల ప్రహసనం ఇంతటితో ఆగక మీటింగులు, సన్మానాలపై దుమారం రేగింది. ప్రతి విషయానికి మీటింగులు పెట్టడం. ఆ మీటింగుల్లో దళపల్యాజీలకు సన్మానాలు చేయడం పరిపాటయ్యింది. ఈ మీటింగులు, సన్మానాలు కవి దృష్టిలో పడ్డాయి. అవి కూడ వెక్కిరింతకు లోనయ్యాయి. కవి వీనిని కూడ వదలకుండా ఫ్యాషన్ల పేరిట జరిగే మీటింగులు, సన్మానాలపై కొరడాదెబ్బలు కొడుతున్నారు. ఈ రోజుల్లో మీటింగులున్నాయంటే ఈటింగుండ వలసిందే. మీటింగుకు వచ్చినవారందరికీ ఈటింగు ఉండదు. ఈటింగుకు వచ్చిన వారందరూ మీటింగికురారు. ఈనాడు మీటింగులు, సన్మానాలు బజారుపాలయ్యాయి.

> పని చేపట్టాలన్నా మీటింగులే
>
> చెడగొట్టాలన్నా మీటింగులే
>
> ఎలక్షన్‌లకు మీటింగులు, సెలక్షన్‌లకు మీటింగులు
>
> ఉద్యోగుల మీటింగులు
>
> నిరుద్యోగుల మీటింగులు
>
> పుడితే పురిటి మీటింగులు
>
> చస్తే సంతాపాల మీటింగులు

ఈ రకరకాల మీటింగులకు ధనం ఎంత వ్యయమవుతుందో అని ఆవేదన చెందుతూనే అక్కరకురాని మీటింగులను కటింగ్ చేయమని, వట్టిమాటలు కట్టి పెట్టి గట్టిమేలు తలపెట్టమని హెచ్చరికలు చేస్తూ మీటింగ్ నిర్వాహకులను పరిహాస సాగరంలో ముంచెత్తారు.

ఇది మీటింగుల యుగంలా సన్మానాల యుగమయ్యింది! అక్షరం ముక్క రాని ప్రతివ్యక్తి పదవికి రాగానే సన్మానాల లంపటత్వంలో మునిగి ఏ మురికి వాడల సందుల్లో, గొందుల్లో సన్మానాలు చేస్తారాయని ఎదురు చూస్తాడు. డాక్టరు కొరకు ఎదురుచూచే పేషెంటులా. సన్మానాలవల్ల సన్మానితుడు కంటే భజన రాయుళ్ళే బాగుపడతారు. సన్మానితుని మెడలో పూలదండలు పడుతాయి ఉరి త్రాడులా. అందుచేతనే కవి సన్మానాల వారధిపై విముఖత్వాన్ని ప్రకటిస్తూ విస్తుపోతున్నారు.

ఎన్నికల్లో నెగ్గినా, పన్నాగాల్లో గెలిచినా
పత్రికల్లో పేరుపడినా, అన్నిటికీ సన్మానాలే
సన్మానాల పేరుతో సంతర్పణలు
సంతర్పణల పేరుతో
సంగీత కచ్చేరీలు——.

ఈనాడు అన్నింటికీ సన్మానాలే. తుమ్మినా, దగ్గినా సన్మానాలు జరపటం అంధానుప్రాయులకు అలవాటయ్యింది. ఇలాంటి సన్మానితులకు కవి గుణపాఠం చెబుతున్నారు.

సన్మానం పొందే అర్హతను
సంపాదించుకోవడంకన్న
సన్మానం మరివేరే ఏముంది?
అది లేనివాడు ఏ సన్మానమైనా
కాదా అవమానం క్రిందనే జమ?

సన్మానితులు చివరి వాక్యాలు గుర్తుపెట్టుకొని సన్మాన జాతర్లలో పాల్గొనకుండా పల్లకీలు మోయించుకొనటం మానివేయమంటున్నారు. సూటిపోటు మాట

లతో ఆధిక్షేపిస్తూ కడుపు నింపుతున్నారు. సన్మానితులకీ పరిహాస ప్రపంచ నంగా ప్రయోగించారు కవి.

విజ్ఞానశాస్త్రం పెరిగినా మూఢనమ్మకాలపై అభిమానం తగ్గలేదు. ఆచారా లకు బద్ధుడై ప్రవర్తిస్తున్నాడు. ఆచారాల పేరిట అనాచారాలు పెరుగుతున్నాయి. ధర్మం, న్యాయం అడుగంటిపోతున్నాయి. మూఢమైన ఆచారాలవల్ల నిండు ప్రాణాలు బలైపోతున్నాయి. సామాజికపరమైన ఈ అస్తవ్యస్తతకు నాడు కందుకూరి, గురజాడవంటివారు సంస్కరణకు పూనుకొంటే ఛాదస్తులందరూ ఎదురు తిరిగారు. సంస్కర్తలను దూషించి అంటరానివారుగా పరిగణించారు. కాలగమ నాన్ని లెక్కచేయకుండా, సంస్కర్తల మాటలు గమనించకుండా, తప్పొప్పు తెలియకుండా ప్రవర్తించి మానవతావాదానికి తిలోదకాలర్పించారు. "పెద్దపులులు గాండ్రించినా, పెనుపాములు బుసకొట్టినా, జాతిస్వభావం మార్చాలంటే నవత్వం చూపి మూఢనమ్మకాలను ఎదిరించాలని, హెచ్చరికలు లెక్కచేయరాదని, సమా జానికి పట్టిన చీడపురుగులను, మూఢనమ్మకాలనే సైతానులను నిర్మూలించమని" ప్రబోధిస్తూ మూఢనమ్మకాలను ఎగతాళి చేస్తున్నారు కవి.

తుమ్ముకూ దగ్గుకూ
పిల్లినడకకూ బల్లిపలుకుకూ
కాకి ఆకాశంలో ఎగరటానికి, నక్క దారి దాటటానికీ
కల్పించారు వింతవింత అపార్థాలు
కట్టారు ముంతకు చెవుల కట్టుకథలు
పెట్టారు బోడితలలకు మోకాళ్ళకు ముడులు.

మానవ బ్రతుకులకు పిల్లి, బల్లి, నక్క, కాకి భావిజీవితాన్ని నిర్ణయించ లేవు. పనులకు, ప్రయాణాలకు ముహూర్తాలు పెట్టే పురోహితులుకారు, ఈ ఆచార వ్యవహార దక్షులంతా స్త్రీని విధవనుచేసి ఆంక్షలెన్నో విధించారు. మాన వత్వానికి తీరని అపచారం చేసి సుఖజీవనానికి భరతవాక్యం పల్కారని కవి

ఆచారపరులను ఆక్షేపిస్తూ వారి చర్యలను ఖండించారు. సమాజ ప్రగతికి వీరం దరూ నిరోధకులని బాహాటంగా చెబుతున్నారు.

అంతేగాక కుళ్ళినకొబ్బరికాయలు కొట్టేవారు, మురికినీటిలో మునిగేవారు, అర్థంలేని మంత్రాలు చదివేవారు; పనికావాలంటే భగవంతుని భూషించేవారు, కాకుంటే దూషించే వారందరూ దొంగభక్తులని కవి వివరిస్తూ వారి బూటకాలను బట్టబయలు చేసారు.

విభూతి నుదుట
కమండలం చేత
యోగదండం చంకన
జటా జూటం తలపైన
ఆకారం ఆ పరమేశ్వరునిది
ఆచారం అంతా బూటకపు నాటకం

అని దొంగ సన్యాసులను అధిక్షేపించారు. వీరందరూ పొట్ట కూటికి ఎంగిలిపడే వారేకాని వాస్తవికత కించిత్తుకూడా లేదని, శ్రీరంగనీతులు చెప్పి, చెప్పరాని చేతలు చేస్తారని, కాషాయవస్త్రాలు కట్టి, స్వార్థానికి ఛత్రంపట్టి, రుద్రాక్షమాలలు త్రిప్పి ఉదరపోషణ పంచాంగం విప్పుతారని కవి నిష్కర్షగానే విసుర్లు విసిరి వాస్తవిక భక్తి ప్రపత్తులకు స్వాగతవచనం అందించమంటున్నారు.

అర్థంలేని ఆచారాలను, ఆధారంలేని నమ్మకాలను సమాజం నుండి పార ద్రోలి నవసమాజనిర్మాణంకొరకు నడుంకట్టి ముందుకువచ్చి మాయనిముసుగులను మాపి, మనిషిని మనిషిగాతీర్చి, మానవత్వానికి మహత్వాన్ని కల్గించి పచ్చని జీవితాలకు స్వాగత తోరణాలు అలంకరించినప్పుడే పుణ్యభూమికి పురిటినొప్పులు రావు. కవి తనకు అభీష్టంకాని చర్యలను నిరసిస్తూ మూఢ విశ్వాసాలు సమాజం నుండి కూకటివ్రేళ్ళతో పెళ్ళగించుకొని రావాలని ఆశిస్తూ నవ్యతను ఆహ్వానిస్తున్నారు.

ఈ విధంగా కవితల్లో 'సెటైర్' కలకల నవ్విస్తుంది. మనస్సును మలుపులకు త్రిప్పుతుంది. ప్రగతి పథానికి మార్గాలు వేస్తుంది. పచ్చని వరిచేలల్లో కలుపు మొక్కలను పెరికివేస్తుంది. స్వేచ్ఛావాయువులు పీల్చటానికి ఊపిరి స్తుంది. ప్రత్యక్షంలో ఉన్నతోటి మానవుని స్థితిగతులను ప్రతిబింబించి పరిష్కార మార్గాన్ని సూచిస్తుంది. మానవతను మరువవద్దని హెచ్చరికలు చేస్తుంది. మనిషికి మనిషికి మధ్యఉన్న తరతమాలను ఛేదించి సమతా సిద్ధాంతం ప్రతిపాదించి వసుధైకకుటుంబ నిర్మాణానికి పునాదులు వేస్తుంది

శ్రీలింగం మాలకొండయ్యగారు ఆత్మ విశ్వాసంతో సమాజాన్ని నిరంతరం అన్వేషిస్తున్న ఉదాత్తకవిపుంగవులు రతిమన్మథుల, రాజవాసాల కథలకు పుల్‌స్టాపు పెట్టి సామాజిక దౌర్బల్యాన్ని కవితా వస్తువుగా గ్రహించి ప్రజాజీవన సమస్యలను పాఠకుల ముందుంచారు. కాలగమనంలో జరుగుచున్న రకరకాల సంఘటనలను రంగురంగుల చిత్రాలుగా చిత్రించి సమాజం కన్ను తెరిపించారు. కష్టాల్లో ఉన్నవారి కన్నీరు తుడవాలని, బాధలలో ఉన్నవారి భారం తగ్గించాలని మునిగిపోతున్నవారికి చేయి అందించాలని, ఆకలితో మాడుతున్నవారికి అన్నం పెట్టాలని, జీవిత సాఫల్యానికి చక్కని త్రోవచూపి మానవసేవయే మాధవసేవ యనే పరమార్థతత్త్వాన్ని ప్రబోధించి, ప్రేమలేని చోట ద్వేషం రాజ్యం చేస్తుందని, మనిషిమీద నమ్మకంలేకుంటే మనిషిని ప్రేమించలేమన్న నగ్నసత్యాన్ని సూటిగాచెప్పి, ప్రజలడబ్బుతో ప్రభుత్వం అమలుపరచే పథకాలఫలితాలు ప్రతి వ్యక్తికి అనుభూతికి వచ్చేలా చేయాలని, పాత ఏడాది చేసిందేమిటి? కొత్తఉగాది చేయగలిగిందేమిటన్న విషయాన్ని నెమరు వేసుకుంటూ కాలాన్ని వృథా చేయక కర్తవ్య నిర్వహణకు పూనుకొని విప్లవాత్మక మార్పులకు దోహదం చేయాలని కవి హృదయపూర్వకంగా మానవతావాదిమై జీవనజ్యోతులు వెలిగించాలని కోరుతున్నారు.

కవిత నవవికసిత సుమబాలలా నవ్యతకు నీరాజనం పడుతున్నది.

తెలుగు మాటలకు తేనియలు రంగరించి తెలుగువాని హృదయ తంత్రులపై జీవనరాగాన్ని పలికిస్తున్నది. నీలి నీలాంబరాలమధ్య దోబూచులాడక, ప్రణయ తరంగడోలికలూగక వాస్తవిక జగత్తును ఆపోసనపెట్టి ప్రకృతిశక్తికి సమతా దృష్టి ఉంటుందని నిరూపించింది. రసాస్వాదనకు, ధ్వనికి, వ్యంగ్యానికి నిధి, కళాదృష్టికి, నవసృష్టికి సేతువు నిర్మించింది. అభ్యుదయానికి ఆనంద తోర ణాలు ముచ్చటగా ముడివేస్తోంది. అనుభూతికి, సానుభూతికి ప్రతీకగా నిలబడు తుంది. తెలుగుగడ్డపై శాశ్వతంగా నిలుస్తుంది.

కలియుగంలో కదం త్రొక్కుతూ కల్లబొల్లి కబుర్లతో కాలక్షేపం చేస్తూ కండలు పిండకుండా కనుసైగల కౌగిళ్ళలో మునిగి కాలాన్ని గుప్పిట బంధించి కలలమాటున అలల ఆలోచనలతో వెఱ్ఱెత్తిన మానవతకు నవత కల్పించి రాచ బాటలు నిర్మించి, చింతలతో, వంతలతో చిక్కిపోతున్న జనపదానికి ప్రగతి పథం చూపించి, "జీవితం ఒక ప్రవాహం, సుఖదుఃఖాలు దానిరెండు తీరాల"ని ప్రబోధించి, న్యాయాన్యాయాలమధ్య నలిగి నీలిగి నిత్యవిసీతుల అంచులపై జారి పడిపోతున్న అనాథలకు దీపకళిక చూపించి, ఉడికే రక్తంతో ఉరకలు వేయించి కలాన్ని చిందులు త్రొక్కించి సమాజానికి పట్టిన జాఢ్యానికి సమాధి కట్టమని సలహాలిచ్చారు. శ్రీ మాలకొండయ్యగారు.

పద్యకవిత్వంపోయి గేయకవిత్వం వచ్చినా, గేయకవిత్వం పోయి గద్య కవిత్వం రెక్కలు విప్పుకొన్నా, గద్యకవిత్వంపోయి చోద్యకవిత్వం చోటుచేసి కొన్నా, హృద్యకవిత్వానికి వీరి కవితలు నికషోపలంగా నిలుస్తాయి. సాహిత్యా నికి నవ్యనవనీత సమానంగా నిగ్గులు చిందిస్తాయి. నవ్వుల పువ్వులు వెదజల్లు తాయి.

ఆవేశం-ఆర్ద్రత పుణికి పుచ్చుకొన్నకవి
ఆనందం అమృతం పంచిపెట్టేకవి

అన్యాయాన్ని అక్రమాన్ని ఎదుర్కొన్న కవి శ్రీ లింగం మాలకొండయ్య గారు.

# కాదేదీ కవిత కనర్హం

"కారులో కవిత్వం
పుడుతుందని కనుగొన్నాను నేను
బారులో కవిత్వం పుడుతుందన్నారు
మిత్రులు కొందరు
కాని కవితావస్తువు కావచ్చు
కాలనడిచి పోయేవాళ్ళకు,
కారులో/ పోయేవాళ్ళకు
కనిపించేదంతా కవితామయమే!"

నా ఎదురుగా వున్న కుర్చీలో కూర్చొని నా మిత్రుడొకడు యీ పదాలు పలికినప్పుడు నేనెంతగానో థ్రిల్ అయిపోయి 'ఎవరిది కవిత్వం' అని అడిగాను.

'మాలకొండయ్య. ఒక ఐ.ఏ.ఎస్. ఆఫీసర్' అని చెప్పి నా మిత్రుడు ఆ తర్వాత చరణాలను గొణగడం మొదలెట్టాడు.

అప్పటికి ఏడు సంవత్సరాలనుంచి జర్నలిజం వృత్తిలో వున్న నాకు మాలకొండయ్యగారు కవిత్వం వ్రాస్తారని తెలుసు. కాని ఫైళ్ళమీద సంతకాలు పెట్టడానికి 24 గంటలు సరిపోని ఒక ఐ.ఏ.ఎస్. ఆఫీసర్, హృదయానికి హత్తుకునే ఇంతటి మధురమైన కవిత్వం రాయగలరా అని ఆశ్చర్యం వేసింది నాకు.

ఈ నాలుగు చరణాలు విని థ్రిల్ కలిగి ఆయన రచనలు చదవాలని ఆసక్తి పుట్టింది. ఆ రెండో రోజునే నాకు తెలిసిన ఒక స్టేట్ ఎక్సైజ్ ఆఫీసర్‌కు

ఫోన్ చేశాను. (మాలకొండయ్యగారు అప్పటికి కొన్ని నెలల క్రితంవరకూ ఎక్సైజ్ కమీషనర్‌గా పనిచేశారు).

ఆయన పుస్తకాలు దొరికే మార్గం ఏదైనా ఉందా అని ఆయన్ని అడిగాను.

తనదగ్గిర ఒకే ఒక సెట్ ఉన్నాయని, పుస్తకాలు మరొకరికి అరువిచ్చే అలవాటు తనకు లేదని ఆయన జవాబిచ్చారు.

కొన్ని నెలలతర్వాత నాకు మంచి మిత్రుడైన రాష్ట్రప్రభుత్వ అధికారి ఒకరు మాలకొండయ్యగారు తనింటికి భోజనానికి వస్తున్నారనిచెప్పి నన్నుకూడా ఆహ్వానించాడు. ఒక కవిని కలుసుకోవాలన్నా, మాట్లాడాలన్నా ఎంతో అదృష్టంగా మంచి అనుభవంగా భావిస్తాను నేను.

ఆ రాత్రి నా మిత్రుడు నన్ను ఆయనకు పరిచయం చేయగానే ఆయన నాతో కరచాలనం చేస్తూ 'Iam Malakondaiah' అన్నారు.

సన్నగా, పొడుగ్గా కంచుకంఠంతో ఉన్న మాలకొండయ్యగారు సాక్షాత్తూ నిఖార్సయిన ఐ.ఏ.ఎస్. ఆఫీసర్‌గానే నా కళ్ళకు కనిపించారుతప్ప కవిగా మాత్రం అనిపించలేదు. ఒక వ్యక్తిని చూసి ఆయన స్వభావాన్ని, శక్తిసామర్థ్యాలను పసిగట్టగల అనుభవం నా కళ్ళకు వుందా లేదా అని ఎప్పుడూ సందేహిస్తూనే ఉంటాను నేను.

ఆ రాత్రి సుమారు రెండుగంటలపాటు నేను ఆయనతో వున్నాను. ఉమర్ ఖయ్యాం రుబాయీలు, ఖలీల్ జిబ్రాన్ తిరుగుబాటు వేదాంతం గురించి ఆయన మాట్లాడారు. బుద్ధుని జాతక కథలు, పరమానందయ్య శిష్యులకథలు చెప్పారు. తెలుగుభాషలోని మాండలికాలు, జానపద సాహిత్యంలో వాటి ఉపయోగం, వాటి తీయదనం గురించి వివరించారు. ఆ రెండుగంటల్లో ఆయన

ఎన్నెన్నో విషయాలపై అనర్గళంగా మాట్లాడారు. సజీవ విజ్ఞాన సర్వస్వంలాంటి మాలకొండయ్యగారి నోట్లోనుంచి వచ్చిన ఇన్నిమాటలు విన్నతర్వాత ఆయన సాక్షాత్తూ కవి, పండితుడనే అభిప్రాయానికొచ్చాను నేను. ఐ.ఎ.ఎస్. హూదా బరువు క్రింద సున్నితమైన ఆయన కవితాహృదయం అణగిపోయి వుందేమో అనిపించింది నాకు.

ఆరాత్రి ఆయనతో కలిసి గెస్ట్‌హౌస్ కెళుతూన్నప్పుడు ఆయన ఆఫీసు పనిలో తనకు తీరిక అసలు దొరకదని, కారులోనో, విమానాల్లోనో ప్రయాణి స్తున్నప్పుడు మాత్రమే తనకు నిజమైన విశ్రాంతి లభిస్తుందని అప్పుడే నాలుగు ముక్కలు రాయడానికి మూడ్ వస్తుందని అన్నారు.

గెస్టుహౌస్ తీసుకెళ్ళి ఆయన తనురాసిన కొన్ని పుస్తకాలు నాకిచ్చారు. ఇంటికి తిరిగొచ్చిన తర్వాత 'జీవిత వలయాలు' అన్న పుస్తకం విప్పి నాలుగు పంక్తులు చదివాను. ఆరాత్రి దాన్ని పూర్తిచేయకుండా ఉండలేకపోయాను.

నిత్యజీవితంలో ఎదురయ్యే ఏ వస్తువునూ, ఏ విషయాన్నీ, ఏ వ్యవహారాన్ని ఆయన వదలినట్టు కనిపించదు. కళ్ళకు కనిపించే ప్రతివస్తువునూఆయన కవితా వస్తువుగా స్వీకరించారు. నిద్ర, పొగడ్త, సెలయేరు, ఫైళ్ళు, వేట, ఇంటిర్వ్యూ, ఆశ, దుఃఖం, పుల్లకూర, నవ్వు, సిగ్గు, ప్రేమ, స్నేహం, కోపం, పూజలు, కారు, విమానం, ఇల్లు, కలం, నిప్పు, భార్య, వెల్లుల్లి, కత్తెర్లు, కరణాలు- ఇలా ఒకహద్దూ, అంతం లేకుండా ప్రవహిస్తుంది ఆయన కవితాధార.

కళ్ళకు కనబడే ప్రతివస్తువునూ, దాని మంచిచెడ్డలను తాత్విక దృష్టితో పరిశీలించి వాటిని కవితలుగా మలచి పాఠకుల ముందు పెట్టడంలో మాల కొండయ్య గారికొక ప్రత్యేకతవుంది. పదాడంబరాలు, అలంకారాలు, ఛందస్సులు, ఇజాలు, భేషజాలు ఆయన రచనల్లో ఎక్కడా కనిపించలేదు. పాఠకులకుఅర్థం కాకుండా పదాలతో మెలికలుతిప్పి, తికమకలుపెట్టే ప్రయత్నం ఎక్కడాచేయ

లేదాయన. అందుకే ఆయన రాసింది పాఠకుడి మనస్సులో తిన్నగా నాటి పోతుంది, గట్టిగా హృదయానికి హత్తుకుంటుంది.

"చెవిటివాడికికూడా వినిపిస్తుంది పొగడ్త
గుడ్డివాడికికూడా కనిపిస్తాడు పొగిడేవాడు
తియతియగా ఉంటుంది పొగడ్త
పొగడ్త వద్దంటుంటాం కాని—
(మనల) పొగడకపోతే బాధపడుతూనే వుంటాం!"

స్వచ్ఛమైన పదాలు, స్వచ్ఛమైన అర్థం యీ ఐదుపంక్తుల్లో పుష్కలంగా వున్నాయి. పొగడ్త ఎంత బలమైన బలహీనతో కవి ఇంతకంటే తేలికైన పదాలతో చెప్పగలడా?

ప్రభుత్వ కార్యాలయాలలో ఫైళ్ళనడక ఎంత 'రసవత్తరంగా' వుంటుందో 'పెండింగ్ ఫైళ్ళు'లో రాస్తారాయన.

"ఆఫీసర్లు ఆర్డర్లు వేసినా
పేదవాళ్ళ ఫైళ్ళు పెండింగ్‌గానే వుంటాయి"
అనిరాసి పేదలపక్షం వహిస్తారీ ఐ.ఎ.ఎస్. ఆఫీసర్‌గారు.
'మన గొప్పతనం తెలుసుకోవాలంటే చచ్చిచూడాలిమనం'
అన్నప్పుడు నాకు అబ్రహాంలింకన్ చెప్పిన కథ గుర్తుకొచ్చింది.

+ + +

'తెల్లని మొగ్గలతోనిండిన మల్లెపొద
వన్నె వన్నెల పింఛం విప్పిన నెమలి
రమణీయమైన రంగుల రామచిలుక

పూటోడుల చిరునవ్వుల పువ్వులు
సెలయేరుల సరాగముల సంగీతం'

—ఇవి ఆయనలో అంతర్గతంగా దాగివున్న సౌందర్య పిపాసకు మచ్చు తునకలు.

రోడ్డుమీద పోతున్న ఒక పేదరాలిని గురించి రాస్తూ—

'వెన్నెల లాగున్నది
ఎండలో పోతున్నది
పూవులాగున్నది
వూరిగుడిసెకో ఉంటున్నది!'

అంటారు. ఆయనది కవితాదృష్టి అని, ఆయనకు కనిపించేదంతా కవితా మయమే అనడానికి యీ ఒక్క ఉదాహరణచాలు.

'కారణ-కరణాలు' చదివిన తర్వాతగాని గ్రామకరణాల పనులేమిటో, విధులేమిటో, స్వభావమేమిటో మొదటిసారిగా తెలుసుకున్నానునేను. కరణాలను చూసి జనం ఎందుకంత కంగారు పడతారో మాలకొండయ్యగారి రచన చదివిన తర్వాత స్పష్టంగా అర్థమైందినాకు.

'గ్రామాలకు కరణాలు-కరణాలకు గ్రామాలు
కారణ-కరణాలు అంటారు'
అని ఎంతో సింపుల్‌గా తేల్చేస్తారాయన.
'విన్నారా వెల్లుల్లి శాస్త్రికథ?
ఇంటరెస్టుగా వుంటుంది వినండే!'

అంటూ మొదలెట్టి ఆయన పిల్లలకూ పెద్దలకూ కూడా ఇంటరెస్టుగావుండే విధంగా నడుపుతారు కథని.

"ఉద్యోగాలు ఊళ్ళోవాళ్ళకు
ఉల్లిపాయలు మనకు'"
అంటూ ముగిస్తారు వెల్లుల్లి శాస్త్రికథ.

ఆయన సహజకవి అని, సౌందర్యారాధకుడని, పేదల పక్షపాతి అని, సంప్రదాయాలపై తిరుగుబాటు దారుడని ఆయన రాసిన ప్రతిగేయం, ప్రతి పంక్తి, ప్రతిపదం నిరూపిస్తాయి.

అణువణువునా, అడుగడుగునా ఆయన కవి అని ఆయన ప్రతిమాటా, ప్రతి అడుగూ రుజువు చేస్తాయి.

సలీమ్
సీనియర్ సబ్ ఎడిటర్
ఈనాడు
విశాఖపట్నం

# "ముగింపు" లో తెగింపు

కళాప్రపూర్ణ

—డా. దాశరథి

(ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి)

చెరకు గడను ఖండఖండాలుగా నరకకుండా నమిలి రసం గ్రోలగలమా?

అందుకే ఆధునిక కవిత ఖండఖండాలుగా కనిపిస్తుంది. ఖండకావ్యాలుగా అవతరిస్తుంది.

ఖండాలన్నీ కలిస్తే ఇక్షుదండం!

ఇక్షుదండాన్ని ఖండిస్తే ఇక్షుఖండం!

మాలకొండయ్యగారు మనకు అందనంత యెత్తయిన కైతల,మాలల,కొండ!

అయితే, తాను సులభుడై, మాలలు మాలలుగాతనను అల్లుకుని, నేలకు దిగివచ్చి, పాఠకుడికి అందుబాటులో వుంటున్నాడు. అదీ ఆయనలోని సౌలభ్యం అదీ ఆయనలోని నమ్రత, కమ్రత కూడా,

కావాలంటే, పాఠకుణ్ణి గజిబిజి పరచే నాలుగు నైఘంటుక (మూలగొట్టు) శబ్దాలు వేయలేడా? అధివాస్తవికత పేరిట అయోమయం చేయలేడా?

అది ఆయన మనస్తత్వంకాదు. యోగి వేమన్నను, మానదీర్ఘ సమాస భూయిష్ఠ మత్తేభ శార్దూలాల్ని వ్రాయమంటే యెలా వుంటుంది?

మాలకొండయ్యగారు మాలకొండయ్యగారే అనిపించుకున్నారు. మాల

కొండయ్యగారు 'ఆయన్ని అనుసరించారు. ఈయన్ని అనుసరిస్తారు' అనిపించుకోలేరు. "అందరి కవులమీదా వారి ప్రభావం వుంది, వీరి ప్రభావం వుంది. ఫలానావారి ప్రభావంనుంచి సంపూర్ణంగా కవులు తప్పించుకోలేక పోతున్నారు" అంటుంటారు కొందరు. అందులో సత్యం లేకపోలేదు. కాని ఆ సత్యం మాలకొండయ్యగారికి వర్తించదు. ఆయనకు భావమేగాని ఇతరుల ప్రభావం లేదు.

సుప్రసిద్ధ కథకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని గురించి చెబుతూ వుంటారు— "ఆయనపై పాశ్చాత్య కథా సాహిత్య ప్రభావం ఏమాత్రంలేదు, He is as original and fresh as the morning sun అని. అవును. ఆయనకు పాశ్చాత్య కథాసాహిత్యం దేనికి? ఆయన కథలకు కావలసిన సామగ్రి తెలుగు ప్రజల్లో వుంది, తెలుగుదేశంలో వుంది. ఆ సామగ్రిని ఉపయోగించుకోగల శక్తివుంది.

ఇది అక్షరాలా మా మాలకొండయ్యగారికీ వర్తిస్తుంది. ఆయనకు తన కవితాసామగ్రి యెవరినుండో, యెక్కడినుండో యెరువు తెచ్చుకోనవసరంలేదు. He is original to the core. His life is his knife which cuts very deep into the present day complex society. and exposes the wound, the problem,

మాలకొండయ్యగారి తొలి రచన నుంచి ప్రస్తుత కవితా సంపుటం దాకా పరిచయం కలవాణ్ణినేను. కనుక ఈ మాటలు వ్రాశాను ధైర్యంగా.

కథా, కావ్యమూ విడిపోయాక, కథాకావ్యాల అస్తిత్వం అస్తమించింది. కనుక మాలకొండయ్యగారి కవితల్లో కథలేదు; వ్యథవుంది. సుధవుంది. మనకు కావలసింది వ్యథ, సుధ. వ్యథలో నుంచి సుధ ఉద్భవిస్తుంది. క్షీరసాగరమథనం లో యెంతవ్యథవుందో! అందులోనుంచి యెంత సుధ వెలువడింది! కార్యాలయంలో ప్రయాణంలో, పడకగదిలో, యెక్కడవ్రాసినా, మాలకొండయ్యగారి హృదయ క్షీరసాగరాన్ని ఆయన లేఖిని కవ్వపుకొండ (మందర పర్వతం) లా అవిచ్ఛి

స్నంగా చిలుకుతూ, మనకు కవితా సుధను అందిస్తుంది.
వ్యధాభరిత వసుధకు కావలసించి సుధ.

మాలకొండయ్యగారి హృదయవ్యధను గురించి రెండు పంక్తులు ఉదహరిస్తే పాఠకులకు అవగతం అవుతుంది.

"అక్షరాలు అరుస్తున్నాయి
వాక్యాలు కేకలు వేస్తున్నాయి"
"అక్షరం తక్షణం కళ్ళు తెరవమంటుంది
వాక్యం మనసు విప్పి పలకమంటుంది"

—అక్షరాలు (పుట 5)

మనసువిప్పి పలికే వాక్యం, కావ్యం.

మాలకొండయ్యగారు మనసు విప్పకుండా పలకలేరు. అది ఆయన మనస్తత్వం. కనుక ఆయన వ్రాసిన ప్రతి వాక్యంలో కావ్యం ధ్వనిస్తుంది.

అలతి అలతి మాటల్లో అద్భుత వ్యంగ్యం కుదించగల శక్తి, మాలకొండయ్య గారిలో చూచిన నేను, చాలా సందర్భాల్లో ఆయన అశేష ప్రతిభకు ఆశ్చర్య పోయాను.

ఉదాహరణకు "రామాయణ సారం" చదవండి (పుట 13).

విభీషణుణ్ని గూర్చి ఆ కవితలో మాలకొండయ్యగారు అన్న గొప్ప మాటలు మాటిమాటికి నాకు జ్ఞాపకం వస్తుంటాయి.

"అన్నకు ద్రోహం చేసేనట!
అతడే గొప్ప దేశభక్తుడట!!"

సహజకవి గనుక, అశేష ప్రతిభాశాలి గనుక, శ్రీ మాలకొండయ్యలా కొత్తగా ఆలోచించగలిగారు. అందరికీ ఆ ఆలోచన తట్టదు.

'అది వక్రదృష్టి' అని ఎవరైనా అనవచ్చు. నా దృష్టిలో ఇది వక్రదృష్టి కాదు. వక్రోక్తి మాత్రమే. వక్రోక్తి కవితకు శోభ చేకూరుస్తుంది.

"వక్రోక్తిః కావ్యజీవితం"

ఇది, కుంతకుడనే ఆలంకారికుడు అన్నవాక్యం.

"వక్రోక్తి, కావ్యానికి ప్రాణం" అన్నాడాయన.

నిజానికి భామహుడనే మరో ఆలంకారికుడు కుంతకుడికంటే పూర్వమే వక్రోక్తిని ప్రస్తావించాడు, అది మాలకొండయ్యగారి కవితకు వన్నె తెచ్చింది.

ఇక వ్యంగ్య వైభవానికి మాలకొండయ్యగారి ఈ "తప్పని ముగింపు" సంపుటిలో ఉదాహరణలు యెన్నైనా చూపవచ్చు:—

"కన్నులు అద్దెకు ఇస్తే" శీర్షిక గల కవితలోనుంచి, ఉదాహరణకు మూడు పంక్తులు,—

"కన్నులు అద్దెకు ఇచ్చుకొని
చెవులకు చూపులప్పచెపితే

"నిజము తెలుసుకోవడం ఎలా?" ఉత్తమ కవితకు ఈ పంక్తులు ఉదాహరణంగా చూపితేచాలు.

ఈ సంపుటిలోని ఆఖరు కవిత "తప్పని ముగింపు" లోనూ శాశ్వత సత్యంతో తొణికిసలాడే ధ్వనిని ప్రవేశపెట్టారు కవిగారు.

"తప్పని ముగింపు" తరుముకొస్తున్నా
తయారుకాడు, మూర్ఖుడు మనిషి"

ఇవి సత్కవితా సంభరిత సత్యవాక్కులు. మానవనైజం ఎంత బాగా గ్రహించాడు కవి! ఈ గ్రహణశక్తి కవికి మేధా గతమైనది.

"జీవిత వలయాల" నుంచి "తప్పని ముగింపు" దాకా ప్రయాణించిన కవి శ్రీ మాలకొండయ్య, కవితా ప్రయాణం సాగుతూనే వుంటుంది. ఈకవితా ప్రయాణానికి "తప్పని ముగింపు" అడ్డూలేదు. "గట్టులు తెంచుకుని ఉరకలు వేసే భావ తరంగిణి"కి ఫుల్‌స్టాప్ వుంటుందా? — (తప్పనిముగింపు నుంచి)